# అపరాధ పరిశోధన

రూ 4-50 జూన్ '81

సప్లిమెంట్



 3/5/81

# మూడు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఆవేశం అనర్థం

రచన : వసుంధర

## దారిదోపిడి

రచన : సికిందర్

## రచయిత బందిఖాన

రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

పొగమంచు—చివరి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ - 90
జూన్, 1981
వెల: రు. 4-50
ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ఆవేశం అనర్థం!

## వసుంధర

రామానికి ఆవేశం ఎక్కువని ఇంట్లో అంతా అంటారు.

తనకు ఆవేశం ఎక్కువని రామానికీ తెలుసు. కానీ ఆవేశాన్ని అదుపు చేసుకోవాలని అతనెన్నడూ ప్రయత్నించలేదు.

తన ఆవేశం తన్ను హంతకుణ్ని చేయగలదని ముందే తెలిస్తే రామం-చిన్నతనంనుంచీ ఆవేశాన్నణచుకునేందుకు ప్రయత్నించి వుండేవాడు.

రామానికి ఇద్దరు తమ్ముళ్ళు. ఒక చెల్లెలు. అతనికంటె ఒక సంవత్సరం మాత్రమే పెద్దదైన ఒక అక్క..వీళ్ళంతా అతడి చేతిలో దెబ్బలు తిన్నవాళ్ళే!

తల్లి మీద కోపంవస్తే రామం—గిన్నెలూ, కంచాలూ విసిరేసేవాడు. తండ్రిమీద కోపంవస్తే ఇంట్లోంచి పారి పోయేవాడు.

రామం కోపం ఇంట్లోనే కాదు—బయట కూడా జోరుగానే వుండేది. స్కూల్లో అతను చాలామందిని

చితక్కొట్టాడు. చాలామంది చేత తన్నులు తిన్నాడు. టీచర్సుని ఎదిరించేవాడు.

అయితే రామున్నెవ్వరూ అసహ్యించుకునేవారు కాదు. అతను పాఠాలు శ్రద్ధగా చదివేవాడు. క్లాసులో మంచి మార్కులు తెచ్చుకునేవాడు. అతడిది మంచి మనసని అంతా అనేవారు.

రామం పుస్తకాలు ఎక్కువగా చదివేవాడు. వాటిలోని వీరుల కథలతడిని ఎక్కువగా ఆకర్షించేవి. మితిమీరిన ఆవేశంతో—చట్టవిరుద్ధమైన పనులు చేస్తూ—మంచివారికి సాయపడుతూ—చెడ్డవారిని శిక్షిస్తూ—పాలకులకు సింహస్వప్నంగా వుండే కథానాయకులతడికి నచ్చేవారు. తనకు తెలియకుండానే అతను వారి అడుగుజాడల్లో నడిచేవాడు.

ఇతరులకు సాయపడడంలోనే అతను గొడవలు తెచ్చుకునేవాడు. అతని తత్వాన్ని కనిపెట్టి చాలామంది అతడిని ఉపయోగించుకునేవారు. తమవల్ల కాని పనులతనికి పురమాయించేవారు.

రామం క్లాసులో విశ్వనాథంగారు సైన్సు బోధించేవాడు. ఆయనంటే చాలామంది విద్యార్థులకు కోపం వుండేది. ఎందుకంటే క్లాసులో ఆయన పక్షపాతం చూపించేవాడు. డబ్బున్నవారి పిల్లలనూ, అధికారంలో వున్నవారి పిల్లలనూ, తనవద్ద ప్రయివేటు చెప్పించుకునే పిల్లలనూ ఆయన ప్రత్యేక అభిమానంతో చూసేవాడు. వాళ్ళు తప్పుచేసినా శిక్షించేవాడు కాదు. మిగతా పిల్లలు తప్పుచేస్తే కఠినంగా శిక్షించేవాడు.

ఒకరోజు రామం స్నేహితుడు సత్యనారాయణ క్లాసులో భీమారావు అనే కుర్రాడితో గొడవపడ్డాడు.

మాటామాటా పెరిగి ఇద్దరూ జుట్టూ జుట్టూ పట్టుకొని కలియబడేవరకూ వచ్చింది. ఆ సమయంలో క్లాసులోకి సైన్సు టీచరు విశ్వనాథంగారు వచ్చేరు. పరిస్థితి చూస్తూనే ఆయన న్యాయాన్యాయాలు విచారించకుండా సత్యనారాయణను క్లాసులోంచి బయటకు పొమ్మన్నాడు.

రామం వెంటనే లేచి "మరి భీమారావు సంగతేమిటి సార్!" అన్నాడు.

"ఇది క్లాసురూం. ఇక్కడ నువ్వు మాట్లాడకూడదు. కోర్టులో జడ్జిగారినీ, క్రికెట్ ఫీల్డులో అంపైర్నీ, స్కూల్లో టీచర్నీ - ఎవ్వరూ దేనికి ప్రశ్నించకూడదు" అన్నాడు విశ్వనాథం

రామం అప్పటికి ఊరుకున్నాడు. కానీ అతడి ముఖం ఎర్రబడింది.

ఆ సాయంత్రం విశ్వనాథం స్కూల్నించి ఇంటికి వెడుతూంటే అతను దారికాశాడు. విశ్వనాథం రామానికి ఒంటరిగా దొరికాడు.

అప్పుడు రామం వయసు పదహారేళ్ళు. మనిషి బలంగావున్నా—విశ్వనాథాన్ని కొట్టేంత బలంలేదు. కానీ రామం చేతిలో రాళ్ళున్నాయి. మనసులో మొండితనం వుంది.

విశ్వనాథం వయసు నలభై వుంటుంది. మనిషి బలంగా వున్నా — దశాబ్దాలుగా వెలగబెడుతున్న మేష్టరుగిరీ ఆయన్ను నిర్వీర్యుణ్ని చేసింది. దారికాసి తన ఎదురుగా నిలబడ్డ మనిషి—ఆఖరికతడు తన విద్యార్థి అయినా సరే—ఎదుర్కొనే మనోబలం ఆయనకు లేదు.

"ఏమిటిది?" అన్నాడు విశ్వనాథం.

"ఇది క్లాస్‌రూం కాదు. ఇక్కడ నేను నీకు పాఠం

చెబుతాను—" అన్నాడు రామం.

రామం శరీరం ఆవేశంతో వణుకుతోంది. కళ్ళు క్రూరంగా చూస్తున్నాయి. అతడి చేతిలోని రాళ్ళు వాడిగా వున్నాయి. అతను విశ్వనాథానికి కాస్త దూరంలోనే వున్నాడు.

"నీ గురువును నువ్వు మన్నించే విధానం ఇదేనా?" అన్నాడు విశ్వనాథం మేకపోతు గాంభీర్యంతో.

"సత్యనారాయణ, భీమారావు—ఇద్దరూ తప్పు చేశారు. కానీ నువ్వు సత్యనారాయణనే క్లాసులోంచి పొమ్మన్నావు. భీమారావునేమీ అనలేదు. అది అన్యాయం కాదూ?" అన్నాడు రామం.

"అన్యాయమే!" వెంటనే అన్నాడు విశ్వనాథం.

"తెలిసి కూడా అన్యాయం చేసేవాడు మంచి గురువు ఎలా అవుతాడు?" అన్నాడు రామం.

"అవడు. నేను మంచి గురువుని కాదు—" అన్నాడు విశ్వనాథం.

"అందుకే నేను నిన్ను మన్నించడంలేదు—" అన్నాడు రామం.

"నువ్వు నా మాట కూడా కాస్త వింటావా?" అనడిగాడు విశ్వనాథం.

"చెప్పుకో!" అన్నాడు రామం నిర్లక్ష్యంగా.

"భీమారావు పెద్ద ఆఫీసరుగారబ్బాయి. ఇంట్లో గారాబంగా పెరుగుతున్నాడు. అతను శిక్షను సహించలేడు. నేను శిక్ష విధిస్తే ఇంట్లో చెబుతాడు. ఆఫీసరుగారికి కోపం వస్తుంది. నా దగ్గర ప్రయివేటు మాన్పించేస్తాడు. నాకు నెలకు పాతికరూపాయలు నష్టం వస్తుంది. పాతిక రూపాయలు ఆఫీసరుగారికి లెక్కలో డబ్బుకాదు. కానీ

నాకదెంతో ముఖ్యమైనది. అది నేను వదులుకోలేను. సత్యనారాయణ సంగతి తీసుకుంటే—అతను పేదవాడు. పేదవాడి కోపం పెదవికిచేటు. ఇప్పట్నించీ అతనికి ఆవేశాన్నణచుకోవడం నేర్పాలి. లేకపోతే జీవితంలో చాలా కష్టపడిపోతాడు. అతని మంచి కోరే నేనతనికి శిక్ష విధించాను—"

"మరి నా సంగతి?"

"నువ్వు ఇంజనీరు గారబ్బాయివి. అంచేత నీ కెంత ఆవేశమున్నా ఫరవాలేదు. ఇప్పుడు నువ్వు చేసిన పనికూడా నేను క్షమిస్తున్నాను. కానీ నీ మేలుకోరి ఒక సలహా ఇస్తున్నాను—" అన్నాడు విశ్వనాథం.

"ఏమిటది?"

"నీలో ఆవేశం చాలా ఎక్కువ పాళ్ళలో వుంది. ప్రస్తుతం నువ్వు కుర్రాడివి. నీ ఆవేశంలో నువ్వు మనుషుల్ని తిడుతున్నావు. కొడుతున్నావు. ఈ ఆవేశాన్నదుపు చేసుకోకపోతే అది ఇంతటితో ఆగదు. ఏదో ఒక రోజున నువ్వు హత్యచేసినా చేస్తావు. హత్య చేసిన పనిమనిషిని డబ్బు కూడా రక్షించలేదు—" అన్నాడు విశ్వనాథం.

రామం మ్రాన్పడిపోయాడు.

విశ్వనాథం కొనసాగించాడు—"ఏం సాధిద్దామని నన్ను కొట్టడానికి వచ్చావు? నేను నిన్నేమీ చేయలేదే? ఎవడో సత్యనారాయణకి అన్యాయం జరిగిందని నువ్వు ఆవేశపడ్డావు. అనుభవంమీద చెబుతున్నాను—ఎదుటి వాళ్ళకు జరిగిన అన్యాయం సరిదిద్దాలనుకోవడం మంచి హాబీకాదు. అలా చేయడంలో నీకు నువ్వే అన్యాయం చేసుకుంటే—అప్పుడా ఎదుటి మనిషి కూడా నీకు సాయ

పడదు___”

రామం చేతిలోని రాళ్ళు కింద పడేశాడు. కలవరపడ్డ మనసుతో అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

## 2

విశ్వనాథంగారలా హెచ్చరించినప్పుడైనా తను జాగ్రత్తపడవలసిందనుకున్నాడు రామం. కానీ చేతులు కాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనమేముంటుంది?

విశ్వనాథం అనుభవంతో చెప్పిన మాటలబద్ధం కాలేదు. రామం ఆవేశం నానాటికీ విజృంభిస్తోంది.

అయితే రామం స్వాభావికంగా ఆవేశపరుడుకాదు. అతడికలా సాగుతోంది. ఆవేశంవల్ల కలిగే అనర్థాలతడికి అనుభవంలోకి రాలేదు. ఇంట్లో అతడికి తల్లి గారాబం. అతడినెవరూ దేనికీ ఏమీ అనడానికి వీల్లేదు. మితిమీరిన ఈ గారాబం అతడిలో అహంకారాన్ని పెంచుతూ వచ్చింది. పెరుగుతున్న అహంకారం అతడి ఆవేశాన్ని పెంచుతోంది.

రామం స్కూల్లో ఫస్టుగా వచ్చాడు. కాలేజీలో ఫస్టు క్లాసు తెచ్చుకున్నాడు. డిగ్రీ వచ్చి సంవత్సరం తిరక్కుండా తండ్రి పలుకుబడి కారణంగా నెలకు ఎనిమిదివందలు వచ్చే ఉద్యోగం సంపాదించుకున్నాడు.

అతను పనిచేసే కంపెనీ మేనేజరు సుబ్బారావు. అయనవద్ద కూడా రామం తన ప్రవర్తన మార్చుకోలేదు. అసలే అది ప్రయివేటు కంపెనీ. అరంభంలో అలా వుంటే ఆ వుద్యోగం ఊడిపోవచ్చు కూడా. అయితే ఇక్కడ కూడా అదృష్టమో, దురదృష్టమో రామానికి కలిసివచ్చింది.

సుబ్బారావు కూతురు గిరిజ అన్నివిధాలా రామానికి

ఈడూ జోడుగా వుంటుంది. ఈ విషయం రామం తలిదండ్రులు కూడా అనుకున్నారు. వారలా అనుకోవడం వల్లనే రామానికి వుద్యోగం దొరికింది. ఎటొచ్చీ ఈ విషయం రామానికి తెలియకుండా రహస్యంగా వుంచారు—రామం వుద్యోగంలో చేరిన సంవత్సరం వరకూ.

ఈలోగా గిరిజ తాను ఫలానా అని చెప్పకుండానే రామంతో పరిచయం సంపాదించుకుంది. రామానికి గిరిజ నచ్చింది. అతడామెను ప్రేమించాడు.

రామానికి ఆవేశం ఎక్కువ. ఆ ఆవేశాన్ని రెచ్చగొట్టి అతన్ని పెళ్ళికి రెచ్చగొట్టింది. ఇదంతా నాటకమని తెలియని రామం గిరిజ గురించి ఇంట్లో చెప్పాడు. పెద్దలు వెంటనే ఒప్పుకున్నారు. పెళ్ళి జరిగిపోయింది—వైభవంగా!

ఇంతవరకూ బాగానే వుంది. ఎక్కడా రామం అహంగానీ, ఆవేశంగానీ దెబ్బ తినాల్సిన అవసరం రాలేదు. గిరిజ కూడా అనుకూలవతి అయిన భార్య. ఆవేశం లేనపుడు రామం మంచివాడు. అతడికావేశం రాకుండా చూసుకుంటే ఎప్పటికీ మంచివాడే! రామానికి ఆవేశం రాకుండా చూసుకోవడమూ, అతడికావేశం వస్తే దాన్ని ఎదుర్కోవడమూ—గిరిజకు సులభంగానే వుంది. ఇంక సమస్యలే లేవు.

సమస్యలు లేనపుడు కొంతమంది కొని తెచ్చుకుంటారు. రామం కూడా అలాగే ఓ సమస్య కొని తెచ్చుకున్నాడు. లేకపోతే అతనా ఊళ్ళో హోటల్ సంపెంగకు వెళ్ళడం ఎందుకు? అదీ భార్యతో కలిసి....

అదంతా తమాషాగా జరిగింది.

ఓ రోజు స్నేహితులతో కబుర్లు చెబుతూండగా హోటల్ సంపెంగ ప్రసక్తి వచ్చింది.

"హోటల్ సంపెంగలో బీరు అద్భుతంగా వుంటుందట. అందులో ఏదో స్పెషాలిటీ వుందట. భార్యతో కలిసి అక్కడ బీరు తాగడమన్నది ఒక అద్భుతమైన అనుభవం అంటారు. కానీ ఆ అదృష్టానికి మనం నోచుకోలేదు—" అన్నాడో మిత్రుడు.

"ఎందుకని?" అనడిగాడు రామం. అతనా ప్రశ్న కేవలం కుతూహలంకొద్దీ అడిగాడు. అంతేకానీ భార్యతో కలిసి హోటల్ సంపెంగలో బీరు తాగాలని అతడను కోలేదు.

"ముందు మన ఆడవాళ్ళు బీరు తాగడానికి ఒప్పుకోరు. ఓవేళ ఒప్పుకున్నా అక్కడ బీరు చాలా ఖరీదు. గ్లాసు పదిరూపాయలు. అంతేకాక అక్కడ అన్నీ ఖరీదే! సర్వరే పదిరూపాయలకు తక్కువ టిప్పు పుచ్చుకోడంటారు—"

"ఓస్ యింతేనా?" అన్నాడు రామం—"చెప్పేలా చెబితే ఏ ఆడదైనా వింటుంది. సరదాగా తాగమంటున్నాం కానీ గంగలో దూకమనడం లేదుగదా! ఆ తాగేది కూడా మనతో కలిసి. అదీ బ్రాందీకాదు, విస్కీకాదు. ఉత్త బీరు. ఖర్చు సంగతంటావా? ఆ అనుభవం నిజంగా అంత అద్భుతమైనదే అయితే ఓ రోజుకి వంద రూపాయలు మనవి కావనుకుంటే సరిపోతుంది. ఆమాత్రం లగ్జరీకి—అదీ ఎప్పుడో ఒక్కసారికి—ఖర్చుచేయలేకపోతే వెధవ సంపాదన ఎందుకు? ఈ వెధవ బ్రతుకు ఎందుకు?"

రామం స్నేహితుడు నవ్వి—"అంత తేలిగ్గా తీసి పారేయాకు. ఆ మాత్రం వందరూపాయలు జన్మకోసారి

అంటే ఎవరైనా ఖర్చుపెడతారు. ఎటొచ్చీ ఆడాళ్ళని ఒప్పించడం నువ్వనుకున్నంత సులభం కాదు. అదీకాక— అన్నింటికీ మించిన అసలు సమస్య వేరే వుంది—" అన్నాడు.

"ఏమిటో—అది కూడా చెప్పి ఏడు—" అన్నాడు రామం విసుగ్గా.

"చెప్పడానికేముంది? ఆ హోటల్‌కు వెళ్ళిన ఆడవాళ్ళు అక్కడ భర్తతో కాక పరాయి మగాడితో గడపక తప్పదు—"

రామంలో కాస్త ఆవేశం చోటుచేసుకుంది— "ఇలాంటి పిచ్చి పిచ్చి వాగుడు కట్టిపెట్టకపోతే— నిన్నెవరైనా సరే పల్లెటూరి గబ్బిలాయి అనే అంటారు. హోటల్ సంపెంగ—మనుష్యుల మధ్య—నాగరికత నడుమ వుంది. అంతేకానీ అడవిలో లేదు. తమకు అందు బాటులో లేనివాళ్ళపైన అభాండం వేయడం మన దేశ ప్రజల అలవాటు. నీ మాటలు నేను నమ్మను—"

"నువ్వు నమ్ము-నమ్మకపో. నా కెంతో నమ్మకమైన వ్యక్తుల ద్వారా అందిన సమాచారమిది. నేను నమ్ము తున్నాను. నమ్ముతున్నాను కాబట్టే నా భార్యతో కలిసి ఆ హోటల్‌కు వెళ్ళడం లేదంటాను—"

"అయితే ఆ హోటల్‌కి వెళ్ళిన ఆడవాళ్ళను రేప్ చేస్తారంటావా?" వేళాకోళంగా అడిగాడు రామం.

"అలాంటిదేం జరగదట. అన్నీ ఇచ్ఛాపూర్వకంగానే జరుగుతాయి. అందుకు అనుకూల వాతావరణం మాత్రం అక్కడ ఏర్పాటవుతుంది—"

"ఇదీ మరీ అసంబద్ధంగా వుంది. నీ భార్య శీలాన్నే నువ్వు శంకిస్తున్నట్లవుతుంది-అలాంటి అనుమానం పెట్టుకుని

కనుక నువ్వు హోటల్ కి వెళ్ళకపోతే—" అని తన స్నేహితుడి ముఖం చిన్నబోయి వుండడం చూసి రామం మళ్ళీ అన్నాడు—"నేనిలా ఎందుకంటున్నానంటే—నీ భార్య పక్కన నువ్వుంటావు. ఎవ్వరూ ఆమెను బలవంతం చేయరు. అయినా ఆమె పరాయి మగాడితో అనుభవం పంచుకుంటుంది. ఇది జరుగుతుందని భయపడి నువ్వు హోటల్ సంపెంగకు వెళ్ళడం లేదు. ఈ మాటలు నువ్వు మా దగ్గర అన్నట్లు తెలిస్తే నీ భార్య ఎంత బాధపడుతుందో నువ్వే ఆలోచించు—"

"నీతో వాదన అనవసరం. నేను సమాచారం చెబితే దాన్ని నువ్వు సవాల్ గా మారుస్తున్నావు—"

"అవును సవాలే! నేను, నా భార్య సంపెంగ హోటల్ కు వెళ్ళివస్తాం—ఎంత పందెం?" అన్నాడు రామం ఉన్నట్టుండి.

మిత్రులంతా నివ్వెరపోయారు. అక్కడున్న ఎవ్వరికీ ఈ పందెం ఇష్టమున్నట్టులేదు. కానీ రామం మొండిపట్టు పట్టాడు. ఆఖరికి అతడి మిత్రులంతా తలా వందా ఇస్తామన్నారు.

"నాతో కూడా ఎవరొస్తారు? మీకు సాక్ష్యం కావాలి కదా—...." అన్నాడు రామం.

"నీ మాటంటే మాటే! నిన్ను పూర్తిగా నమ్ముతున్నాం. మాకు వేరే సాక్ష్యం అక్కర్లేదు—" అన్నారు మిత్రులంతా ఏక కంఠంతో.

"మీకు నామీద ఎంత నమ్మకం?" అన్నాడు రామం ఆశ్చర్యంగా.

"కానీ నీకే మామీద నమ్మకంలేదు. అందుకే జీవితంతో ఆటలాడే పందెం కట్టావు—" అన్నాడో

స్నేహితుడు విచారంగా.

"డియర్ ఫ్రెండ్! మనిషి మొదట తనను తాను నమ్మాలి. తర్వాత తన భార్యను నమ్మాలి. ఈ రెండూ కాదన్న వారితో నేను పందెం కట్టక తప్పదు—" అన్నాడు రామం.

## 3

హోటల్ సంపెంగకు రావడానికి గిరిజ ఒప్పుకోలేదు. "ఆ హోటల్‌కు మంచి పేరు లేదండీ—అక్కడికి వెళ్ళి వచ్చామంటే ఆ తర్వాత నలుగురికీ ముఖం చూపించడం కూడా కష్టమవుతుంది—" అందామె.

"తీసుకు వెడుతున్నది నేను. అక్కడికి వెళ్ళడానికి డబ్బుల్లేక నలుగురూ అలా అనుకుంటే మనం ఆ మాటలకు విలువనివ్వక్కర్లేదు. నా మాట విను—" అన్నాడు రామం.

గిరిజ ఓ పట్టాన ఒప్పుకోలేదు. కానీ అతను ఆవేశపడే లోగా ఒప్పేసుకుంది.

"అంతే కాదు—అక్కడ నువ్వు నాతో కలిసి బీరు తాగాలి—" అన్నాడు రామం.

"ఆడది బీరు తాగడం మా యింటా వంటా లేదు—" అరచి గిరిజ.

"అంటే మా యింటా వంటా వుందనా నీ వుద్దేశ్యం?" అన్నాడు రామం.

ఏమో నాకేం తెలుసని అందామనుకుంది గిరిజ. కానీ భర్త ఆవేశపడతాడని భయపడి—"మీరు తాగమంటే విషమైనా తాగేస్తాను—" అంది.

"అలాగుండాలి—భార్య అంటే!" అన్నాడు రామం ఆమెను మెచ్చుకుంటూ.

"ఏమండీ—మీ రేమీ అనుకోనంటే ఓ మాట అడగనా—" అంది గిరిజ బెదురుగా.

"అడుగు—"

"ఇలా అడుగుతున్నానని మరోలా భావించకండి. ఏ మగాడూ తన పెళ్ళాన్ని హోటల్ సంపెంగకు తీసుకెళ్ళడు. ఏ మగాడూ తన పెళ్ళాన్ని బీరుతాగమని వేధించడు. ఈ రెండూ మీరు చేశారు. ఇంతకుమించి అడ్వాన్సుడా వెళ్ళరు గదా! మీ ఆవేశం మాటే నాకు భయం. అలాంటి పరిస్థితి ఏర్పడితే నా ప్రాణాలైనా తీసుకుంటాను గానీ మీ మాట వినను—" అంది గిరిజ.

రామం ఆశ్చర్యంగా—"అలా అడిగావేమిటి?" అన్నాడు.

"హోటల్ సంపెంగకు ఊళ్ళో మంచి పేరు లేదండీ-" అంది గిరిజ మళ్ళీ.

"లేకపోతే లేకపోనీ—నాకలాంటి భయాలేమీ లేవు. నిజం చెప్పాలంటే ఇది మనకు మనం పెట్టుకుంటున్న పరీక్ష. నాకు నీమీదా, నీకు నామీదా నమ్మకముందన డానికి ఇంతకంటే మంచి పరీక్ష ఎందుకు?"

గిరిజ అనుమానంగా-"అసలు మనకు పరీక్ష ఎందుకు?" అంది.

"మనకు పరీక్ష అవసరముందో లేదో కూడా తెలుసుకుందుకిది పనికొస్తుంది—" అన్నాడు రామం. తర్వాత గిరిజ మరింకేమీ మాట్లాడలేదు.

ఇద్దరూ ఆ సాయంత్రం కలిసి—హోటల్ సంపెంగకు వెళ్ళారు.

హోటల్లో అడుగు పెట్టగానే ఏదో స్వర్గంలోకి అడుగు పెట్టినట్లుంది.

ఇద్దరూ డైనింగ్ హాల్‌కు వెళ్ళారు.

అదే ఓ ఇంద్ర భవనంలా వుంది. హాలునిండా ఎన్నో బల్లలున్నాయి. ప్రతి బల్లకూ అటూ ఇటూ రెండేసి కుర్చీలు.

హాల్లో చాలా టెలివిజన్‌లున్నాయి. బల్లల్నీ, టెలివిజన్నీ అమర్చిన పద్ధతివల్ల హాల్లో ఏ బల్ల దగ్గర కూర్చున్నా హాయిగా టెలివిజన్ చూడొచ్చు. టెలివిజన్లో కూడా మామూలుగా వచ్చే చెత్త కార్యక్రమాలులేవు. చూపరులకు ఆసక్తికరంగా వుండే కార్యక్రమాలు వస్తున్నాయి. అది క్లోజ్డ్ సర్క్యూట్ టీవీ. హోటల్లోవారికి మాత్రమే ప్రత్యేకమైన కార్యక్రమాలు. బహుశా ఏ ఫారిన్ కార్యక్రమాలో విడియో టేపు రూపంలో సంపాదించి వేస్తూండి వుండాలి.

కార్యక్రమాల్లో కూడా ఎక్కడా అసభ్యతలేదు. సునిశితమైన హాస్యం,ఆసక్తికలిగించే సన్నివేశాలున్నాయి.

రామం, గిరిజ రెండు బీర్లు ఆర్డరిచ్చారు.

గిరిజ బీరు కొద్దిగా చప్పరించి—"ఛీ కుంకుడుకాయ పులుసులా వుంది—" అంది.

"మొదట్లో అలాగే వుంటుంది. అలవాటైతే అదే బాగుంటుంది—" అన్నాడు రామం ఉత్సాహంగా చప్పరిస్తూ.

"అడుసుతొక్కి కాలు కడుగుక్కున్నట్లు—ఇది అలవాటు చేసుకోవడం కూడా ఎందుకు....?"

గిరిజ ప్రశ్నకు జవాబు రాలేదు. సరిగ్గా అప్పుడే బల్లకు వారిద్దరికీ ఎదురుగా ఒకతను వచ్చి కూర్చున్నాడు. అతడు నేరుగా రామంవంక చూసి—"నీ అదృష్టాన్నభినందిస్తున్నాను. నీ భార్య చాలా అందంగా వుంది—"

అన్నాడు.

రామం కాస్త ఇబ్బందిగా—"థాంక్స్—" అన్నాడు.

"అందమే కాదు. చాలా సెక్సీగా కూడా వుంది—" అన్నాడతను.

రామం ముఖం ఎర్రబడింది. తటపటాయిస్తూ—"నీ కామెంట్ నాకు నచ్చలేదు—" అన్నాడు.

"కానీ నాకు నీ భార్య నచ్చింది. ఇఫ్ యూ డోంట్ మైండ్....ఇద్దరం కాసేపు....అలా...."

అతడి మాటలు పూర్తికాకుండానే రామం లేచి నిలబడి—"యూ బ్లడీఫూల్.... గెటౌట్...."అన్నాడు. ఆవేశంతో అతడి శరీరం వణుకుతోంది.

"నా పేరు బ్లడీ ఫూల్ కాదు. రవికిశోర్—" అని అక్కణ్నించి వెళ్ళిపోయాడతను.

గిరిజ భర్తవంక అదోలా చూసి—"నేను వద్దంటే ఇక్కడికి తీసుకొచ్చారు. వాడన్న మాటలకు సిగ్గుతో నా వళ్ళు చచ్చిపోయింది—" అంది.

"ముందు బీరు తాగు...." అన్నాడు రామం. అతను తన ఆవేశాన్నణచుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు. రవి కిశోర్ వెంటనే వెళ్ళిపోవడం అతడికి కాస్త తృప్తిని కలిగించినట్లుంది.

గిరిజ ఇబ్బందిగా ముఖంపెట్టి బీరు చప్పరించసాగింది.

అయిదు నిముషాలైనా గడవకుండా అక్కడికి మళ్ళీ రవికిశోర్ వచ్చాడు. ఈ పర్యాయం అతడి కూడా ఓ అప్సరసలాంటి అమ్మాయి వచ్చింది. వస్తూనే అతను రామంవంక తిరిగి—"ఇందాకా నేను ఓ చిన్న పొరపాటు చేశాను. నేనేమీ అఫర్ చేయకుండా నిన్నేదో

కోరాను. మీట్ మై వైఫ్ ప్రతిమా—" అన్నాడు.

ప్రతిమ రామానికి నమస్కరించింది. రామం కూడా ఇబ్బందిగా ఆమెకు నమస్కరించాడు.

"హౌ డూ యూ లైక్ హెర్—" అన్నాడు రవి కిశోర్. రామం బదులివ్వలేదు కానీ ఓరకంటితో ప్రతిమను చూసి ఆమె అందం అంచనా వేసి—చాలా అందమైనదేనని అప్రయత్నంగా అనుకున్నాడు.

"నీకామె నచ్చుతుందని నాకు తెలుసు—" అన్నాడు రవికిశోర్—"ఓ గంట సేపు ఆమె నీది. ఈమె నాది—" అంటూ గిరిజను చూపించాడతను.

"వాడ్డూయూ మీన్—" మళ్ళీ రామం ఎర్రబడ్డాడు.

"జస్టు ఎక్స్‌ఛేంజ్—అదీ ఓ గంట సేపు—" అన్నాడు రవికిశోర్.

రామం జవాబివ్వకుండా క్రూరంగా రవికిశోర్ కళ్ళలోకి చూశాడు.

"అలా చూడకు మిస్టర్! నేను చాలా న్యాయంగా మాట్లాడుతున్నాను. నీకీ వ్యవహారం కొత్త కావచ్చు. అంతమాత్రాన మరీ అంత బెట్టు చేయకూడదు. కావాలంటే ఎక్స్‌ట్రాగా డబ్బు కూడా స్తా. ఎంతైనా ఐశ్వర్యగల సర్దారుణ్ని. జస్టు—మీ ఆవిడంటే మోజు పడ్డాను...." అన్నాడు రవికిశోర్.

"పెళ్ళైన ఆడది చెల్లెలాంటిదని తెలియదా నీకు—" అన్నాడు రామం తన్నుతాను నిగ్రహించుకునేందుకు ప్రయత్నిస్తూ.

"అలా అనుకునేవాడెవడూ ఈ హోటల్ సంపెంగకు

రాడు. ఇక్కడికి వచ్చేదే ఎక్స్ఛేంజి కోసం. అలాటప్పుడు నువ్విలా నీతులు వల్లిస్తే ఎలా? అందులోనూ నీ భార్యను చెల్లెలిలా భావించడం మరీ కష్టం—" అంటూ గిరిజను అంగ వర్ణన చేయనారంభించాడు. ఆ వర్ణనలో రవంత అసభ్యత కూడా లేకపోలేదు.

గిరిజకు ఈ సంభాషణ చాలా ఇబ్బందిగా వుంది. కానీ అది కోరి తెచ్చుకున్న సమస్య. అందువల్ల తానేమీ మాట్లాడకుండా టెలివిజన్ కేసి దృష్టిసారించింది. టెలివిజన్‌లో ఏదో బాక్సింగ్ పోటీ జరుగుతోంది. పోటీ చాలా ఆసక్తికరంగా వుంది. వున్నట్టుండి ఓ బాక్సర్ తన రెండు చేతుల్నీ వేగంగా కదిపి అవతలవాడి ముఖంపై రెండు బ్లోస్ ఇచ్చాడు. అవతలి బాక్సర్ కుప్పలా కూలిపోయాడు.

అయిదారుగురు మనుషులు పరుగున తమవైపు వస్తున్న చప్పుడు విని గిరిజ అటు చూసింది.

నేలమీద రవికిశోర్ పడివున్నాడు. అతడి భార్య అతడి పక్కనే కూర్చుంది. రామం కోపంగా రవికిశోర్ వంక చూస్తూ— "ఇంకా వాగావంటే చంపేస్తాన్రా రాస్కెల్—" అన్నాడు.

వచ్చిన మనుషులు రామం చేతులు పట్టుకుని— "వాటీజ్ దిస్ నాన్సెన్స్" అన్నారు.

"నేను కాదు. ఇతను అంతా నాన్సెన్స్ మాట్లాడుతున్నాడు—" అన్నాడు రామం.

రవికిశోర్ లేచి కూర్చున్నాడు. రామం జరిగింది క్లుప్తంగా వాళ్ళకు చెప్పాడు.

"దాందేముంది సార్—ఇష్టముంటే ఒప్పుకుంటే సరిపోతుంది. లేదా—ఇష్టంలేదని చెప్పండి. ఇక్కడ మనిషికి

ఏమైనా మాట్లాడే స్వతంత్రముంది. కానీ ఎవర్నీ ఎవ్వరూ బలవంతం చేయరు. ఇష్టపడని స్త్రీని పురుషుడు తాకనైనా తాకడు. కానీ మామూలుగా బయట మాట్లాడలేని ఏమాట అయినా చెప్పవచ్చు. ఇది హోటల్ సంపెంగ చేస్తున్న ఓ వినూత్న ప్రయోగం. ఆడవాళ్ళ చేత చెప్పుదెబ్బలు తినకుండా వాళ్ళ గురించి మీకు తోచిన మాటలు—అవి ఎంత అసభ్యంగా ఉన్నా సరే—చెప్ప గలగడం—ఓహ్-అలాంటి అనుభవం మీకెక్కడ దొరుకు తుంది?" అన్నాడో మనిషి.

"కానీ ఇతను నా భార్యను వర్ణిస్తున్నాడు—"

"వర్ణించనివ్వండి. మీరూ అతడి భార్యను వర్ణించండి. ఆమెనే కాదు. ఈ హోటల్లో వున్న ఏ స్త్రీ దగ్గరకైనా వెళ్ళి మీరామెను యథేచ్ఛగా వర్ణించవచ్చు. ఎవరైనా ఒప్పుకుంటే అనుభవం కూడా పొందవచ్చు. పశుబలాన్ని చూపి బలవంతం చేయడం ఒక్కటే ఇక్కడ సహించ పడదు—" అన్నాడు హోటల్ మనిషి.

రామం రవికిశోర్ భార్యవంక చూశాడు. ఆమె నిజంగా చాలా అందంగా వుంది. కొద్ది క్షణాలు ఆమె తనిది కావడం కోసం ఏమైనా చేయవచ్చుననిపిం చింది. మగవాడికి పరాయి స్త్రీ ఆకర్షణ చాలా బల మైనది. రామం ఎదురుగా ఓ అందమైన పరాయి స్త్రీ నిలబడి వుంది. ఆమె అతనిది కావడానికి అభ్యంతరమేమీ లేదు. కానీ ఒకే ఒక చిన్న షరతు....

రామం, రవికిశోర్ వంక చూశాడు. అతడు గిరిజవంకే చూస్తున్నాడు. ఆ కళ్ళనిండా ఆకలి....

రామం చటుక్కున గిరిజ చేయి పట్టుకొని—"మిస్టర్ రవికిశోర్! ప్రస్తుతానికి నేను వెళ్ళిపోతున్నాను. కానీ

ఇంతటితో నిన్ను వదిలిపెట్టాననుకోకు. నీ చావు నా చేతుల్లో రాసిపెట్టి వుంది—" అన్నాడు.

అప్పటికా హోటల్ మనుషులు వెళ్ళిపోయారు.

"నువ్వు నన్ను చంపే మాటైతే ఇలా వృథాగా అరవకు. నలుగురూ వింటే అదే సాక్ష్యమై నీ పీకను చుట్టుకుంటుంది. జరిగిందేదో జరిగిపోయింది. బీ స్పోర్టివ్. స్పోర్టివ్‌గా ఉండలేకపోతే ఇలాంటి హోటల్సుకు రాకు" అన్నాడు రవికిశోర్.

## 4

రామం స్నేహితులిచ్చిన డబ్బు తీసుకోలేదు.

"మీరు చెప్పింది నేను సరిగ్గా అర్థం చేసుకోక పందెం కట్టాను. అసలు నేనా హోటల్‌కు వెళ్ళకుండా వుండవలసింది. అలా వెళ్ళడంవల్లనే నేనో వెధవకి నా భార్యని అంగాంగ వర్ణన చేసే అవకాశమిచ్చాను. ఆ రాత్రంతా నా భార్య ఏడుస్తూ కూర్చుంది—" అన్నాడు రామం.

"నువ్వు చెప్పేది వింటూంటే నాకా హోటల్ మీద మోజు కలుగుతోంది రామం! పెళ్ళాలతో కాకుండా ఒంటిగా ఓసారి ఆ హోటల్‌కు వెళ్ళి మన నోటి దురద తీర్చుకువద్దామా?" అన్నాడో స్నేహితుడు.

"ఆ హోటల్‌కు జంటలే వెళ్ళాలి!" అన్నాడు రామం.

"ఆ జంట భార్యాభర్తలై తీరాలని కూడా ఉందా?" అడిగాడా స్నేహితుడు.

"వున్నట్లు లేదు—" అన్నాడు రామం సాలోచనగా.

"అయితే మనకు జంటల్ని నేను సంపాదిస్తాను.

ఓసారి అక్కడకు వెళదాం—" అన్నాడా స్నేహితుడు.

"నీతికన్నా అవినీతి ఎంత బలమైనది—" అన్నాడు రామం నిట్టూరుస్తూ. అతను వాళ్ళతో హోటల్ కి వెళ్ళడానికి ఒప్పుకోలేదు. అలాంటివి తనకు చాలా అసహ్యమని చెప్పాడు.

"ఎందుకని?" అన్నాడో స్నేహితుడు.

"నీ భార్యని ఓ పరాయి మగాడు నీ కళ్ళెదుట అంగాంగ వర్ణన చేసి తప్పించుకోవడమన్నది— ఎంత బాధాకరమో—అనుభవంలోకి వస్తే కానీ తెలియదు..."

ఆవేశంతో రామం పిడికిళ్ళు బిగిశాయి.

"అంగాంగ వర్ణన అంటే....అసభ్యంగా కూడా ఉందా?" అన్నాడా స్నేహితుడు.

"అసభ్యత తప్ప మరొకటి అందులోలేదు. శరీరంలో ఏ భాగమూ వదిలిపెట్టబడలేదు. నా భార్యకు బట్టలు విప్పుకుని నిలబడ్డ అనుభూతి కలిగి సిగ్గుతో చచ్చిపోయిందిట—" అన్నాడు రామం.

ఇంకెవ్వరూ ఏమీ మాట్లాడలేదు. కాసేపు అక్కడ మౌనం రాజ్యమేలింది.

"ఒక స్నేహితుడు నెమ్మదిగా—ఇప్పుడేం చేద్దామనుకుంటున్నావ్?" అనడిగాడు.

"ఆ రవికిశోర్ అంతు చూద్దామనుకుంటున్నాను—" అన్నాడు రామం.

అన్నాడు కానీ ఆ పని ఎలా చేయాలో అతడికి తెలియడంలేదు. హోటల్లో వున్నప్పుడు అతడి ఆవేశం పనిచేయలేదు. నలుగురు మనుషుల బలం ముందు అతడి ఆవేశం తలవంచింది. తర్వాత ఆతడు రవికిశోర్ గురించి ఆచూకీ తీస్తూనే వున్నాడు.

రవికిశోర్ పెద్ద బిజినెస్ మాగ్నెట్. అతణ్ణి ఒంటరిగా కలుసుకోవడం అసాధ్యం. అతన్ని చంపాలంటే మళ్ళీ హోటల్ సంపెంగకే వెళ్లాలి. అయితే అక్కడ మరొకడు తన భార్యకోలికివస్తే....

ఇలా ఒక్కొక్కరే తన భార్య అందాన్ని గురించి-ఎక్స్‌రే కళ్ళతో ఆమెను చూడడం రామానికిష్టంలేదు. అదీకాక హోటల్ సంపెంగలో తన ఆవేశం పనిచేయదు. రవికిశోర్‌ని కలుసుకుంటే వేరే ఎక్కడైనా—తను మీదపడి చంపగలిగే విధంగా కలుసుకోవాలి.

రామం ఈ విషయం భార్యతో కూడా చర్చించాడు.

"ఎందుకండీ వెధవ గొడవ. తప్పు ఆయనదీ కాదు. తెలిసి ఆ హోటల్‌కు వెళ్ళడం మన తప్పు. మీరు హత్యల గురించి ఆలోచించకండి. నాకు భయం వేస్తోంది" అంది గిరిజ.

# 5

రామానికి ఒక చక్కటి ఉపాయం తోచింది. రవికిశోర్ గురించి అతడికో కొత్త సమాచారం తెలిసింది.

రవికిశోర్‌కు విలియమ్స్ అనే బ్రోకరొకడున్నాడు. డబ్బాశ చూపించి వాడు రవికిశోర్ దగ్గరకు ఆడవాళ్ళను తీసుకు వెడుతూంటాడు. తనకు నచ్చిన ఆడవాళ్ళ గురించి అయిదారువేలదాకా సులభంగా ఇస్తాడు రవికిశోర్. విలియమ్స్‌కూ కూడా మంచి కమిషనే ముడుతుంది.

తనకు నచ్చిన అమ్మాయిలతో సుఖపడేందుకు రవికిశోర్‌కు ఒక ప్రత్యేకమైన బంగళా వుంది. రవికిశోర్ అమ్మాయిలతో కలిసి అక్కడకు వెళ్ళినపుడు బంగళాలో ఇంకెవ్వరూ ఉండకూడదు. ఆఖరికి వాచ్‌మాన్ కూడా! అది శాసనం ...

దీనిగురించి రామం కష్టపడి తెలుసుకున్నాడు. త్వరగా అతడి పథకం రూపొందింది. రామంతో నిమిత్తంలేకుండా గిరిజ, రవికిశోర్ కు తన అభీష్టం తెలియబర్చి విలియమ్స్ ద్వారా ఆ ఇంటికి వెళ్లాలి. అక్కడ రామం రవికిశోర్ ను సఫా చేస్తాడు. అయితే అందుకు గిరిజను ఒప్పించాలి.

ఉత్సాహంగా ఇంటికి వెళ్ళాడు రామం రోజుకంటె ముందుగా.

అతను వెళ్ళేసరికి వీధి తలుపులు బార్లా తెరిచి వున్నాయి. గిరిజ అశ్రద్ధను అప్పటి ఉత్సాహంలో అతను మన్నించగలిగాడు. తలుపులు తనే దగ్గరగా వేశాడు.

అప్పుడతనికి బెడ్రూంలోంచి మాటలు వస్తున్న వైనం తెలిసింది.

రామం ఆశ్చర్యపడ్డాడు. ఆ మాటలు ఒక పురుషుడివి. అదీ పరిచితమైన కంఠంలాగే వుంది.

రామంలో అప్పుడే ఆవేశం చోటుచేసుకుంది. జరుగుతున్నదేమిటో తెలుసుకోవడం కోసం అతను నెమ్మదిగా వెనక నడిచి పడకగది గుమ్మం చేరాడు.

గుమ్మం దగ్గర్నుంచి లోపల మనుషులు అతడికి కనిపిస్తున్నారు. వాళ్ళకు తను కనిపించకుండా అతను జాగ్రత్తపడ్డాడు.

లోపల గిరిజ నిలబడి వుంది. ఆమె కెదురుగా నిలబడి వున్న వ్యక్తిని రామం గుర్తుపట్టాడు. అతను రామం స్నేహితుడు పద్మనాభం. అతడి చేతిలో రివాల్వర్ వుంది.

“నన్ను తప్పుగా అర్థంచేసుకోకు గిరిజా! మొదట్లో నీపై నాకు ఎటువంటి దురభిప్రాయంలేదు. కానీ నువ్వు హోటల్ సంపెంగకు వెళ్ళాక—రవికిశోర్ నిన్నెలా

వర్ణించాడో రామం చెప్పాడు. ఆ వర్ణన నా కళ్ళముందు మెదిలింది. ఒక్కసారి నిన్ను ఆ వర్ణనల ప్రకారం చూడాలనుంది. నిజంగానే నీ సౌందర్యం అపురూపం. నిన్నలా చూడని జన్మ వ్యర్థం. త్వరగా నాకోరిక తీర్చు. ఓ పట్టాన నా మాట వినవనే భయింతో ఈ రివాల్వర్ కూడా తెచ్చుకున్నాను. రామం వచ్చేలోగా నేను వెళ్ళిపోవాలి. ఆలస్యం చేయకు. ప్లీజ్ — క్విక్!" అంటున్నాడు పద్మనాభం.

ఆ క్షణంలో రామానికొలిగిన ఆవేశమింతా అంతా కాదు.

"రాస్కెల్ — మిత్ర ద్రోహీ!" అంటూ ఒక్క ఉదుటున గదిలోకి వెళ్ళి పద్మనాభం పీక పట్టుకున్నాడు. ఈ హఠాత్సంఘటనకు పద్మనాభం చేతిలోని రివాల్వర్ జారి పడిపోయింది. అతడికి మాట్లాడే అవకాశం లేకుండా రామం చేతులు అతడి మెడచుట్టూ బిగుసుకున్నాయి. పెనగులాడేందుకు అతడి శరీరం ప్రయత్నించేలోగానే అతడి సర్వశక్తులూ క్షీణించసాగాయి. కొద్దిక్షణాల్లో అతను కుప్పలా నేలకూలాడు.

"చచ్చిపోయాడేమోనండీ—" అంది గిరిజ.

అప్పటికి రామం ఆవేశం కాస్త తగ్గింది. అతను చటుక్కున వంగి పద్మనాభం ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. శ్వాస ఆడుతున్నట్లులేదు. అదే పైకి అన్నాడతను.

"ఆఁ" అంది ఓ కంఠం. అది గిరిజది కాదు. అప్పుడు రామం అటు చూశాడు.

గుమ్మం దగ్గర ఓ యువకుడు నిలబడివున్నాడు. అతడు పీలగా వున్నాడు. కళ్ళలో భయం కనబడుతోంది.

మనిషి నిశ్చేష్టుడైనట్లు కనబడుతోంది. చేతిలోని ఏదో పుస్తకం నేలజారింది.

"ఎవరున్నవ్వు?" అంటూ రామం అతన్ని సమీపించాడు. ఇప్పుడు రామంలో ఆవేశంలేదు. భయముంది.

ఆ యువకుడు ఉలిక్కిపడి—"నేను.... నేను.... నేనేమీ చూడలేదు...." అన్నాడు.

"ఎవరున్నవ్వు?" రామం తన ప్రశ్నను రెట్టించాడు. అతని కంఠం వణుకుతోంది.

"చందా కోసం వచ్చాను. తోయగానే తలుపులు తెరుచుకున్నాయి. మీరు గుమ్మం దగ్గరుంటే దొంగేమో ననుకున్నాను. లోపలకు వెళ్ళగానే నేనూ గుమ్మందాకా వచ్చాను. తర్వాత....తర్వాత .... నేనింకేమీ చూడలేదు...." అన్నాడా యువకుడు.

రామం చటుక్కున ఆ యువకుడి చేయిపట్టి లాగి— "లాభంలేదు. నిన్ను చంపేయాలి" అన్నాడు. అయితే చంపడానికి అవసరమైన ఆవేశం అతడిలో వున్నట్లులేదు.

"ప్లీజ్—నన్ను వదిలిపెట్టండి. నేను మీకేమీ హాని చెయ్యను—" అన్నాడా యువకుడు.

"లాభంలేదు. జీవితంలో తొలిసారిగా నేను చేసిన హత్యను నువ్వు చూశావు. నన్ను నేను రక్షించుకోవడం కోసం నిన్ను చంపక తప్పదు—" అన్నాడు రామం.

"ఎలా వచ్చానో—అలా వెళ్ళిపోతాను. నేను మీ ఇంట్లో అడుగుపెట్టిన విషయమే మర్చిపోతాను. దయతో నన్ను వదిలిపెట్టండి—" అన్నాడాయువకుడు.

మరో హత్యచేసే ధైర్యం రామానికి లేదు. ఇతణ్ని వదిలితే ఏమవుతుందోనని భయంగా వుందతనికి. ఏమీ తేల్చుకోలేని సందిగ్ధవస్థలో అతనుండగా ఆ యువకుడు

చటుక్కున రామం చేతిపట్టు విడిపించుకుని పారి పోయాడు. రామం అతణ్ని తరమాలనుకున్నాడు కానీ అది అనవసరంగా అందరి దృష్టినీ ఆకర్షిస్తుందని భయ పడ్డాడు. వీధిలో ఒకరి వెనుక ఒకరు పరుగెడుతూంటే— తనతానై హత్యానేరం బయటపెట్టినట్లవుతుంది.

రామం వీధి తలుపులు గడియపెట్టి లోపలికి వచ్చాడు.

"ఏమండీ—ఈయన చచ్చిపోయాడండీ—" అంది గిరిజ ఏడుపు కంఠంతో.

"అంటే....అంటే.... నేను హత్య చేశానా?" అన్నాడు రామం. అతనిప్పుడు పూర్తిగా మామూలు మనిషయిపోయాడు. చతికిలబడి మోకాళ్ళమీద తల పెట్టుకుని ఏడవసాగాడు.

గిరిజ ఏం చేయాలో తోచక అటూ యిటూ చూడ సాగింది. అప్పుడామె దృష్టిని అక్కడ కిందపడివున్న పుస్తకం ఆకర్షించింది. చటుక్కున నడిచి ఆ పుస్తకం అందుకుంది.

అది రసీదుల పుస్తకం. ఆ యువకుడు చందాతీసుకున్న వారికీ పుస్తకంలోంచి రసీదులిస్తున్నాడన్న మాట! ఆమె పుస్తకాన్ని అటూ యిటూ తిప్పిచూసింది.

పుస్తకం వెనుక ఓ చిరునామా వుంది. కె. సుబ్బా రాయుడు, సోషల్ వర్కర్ అని రాసివుంది. చిరునామా ఇంటి నంబరుతో సహా వివరంగా ఉంది. గిరిజ చందాల పుస్తకం తెరిచి చూసింది. ప్రతి డూప్లికేటుమీదా సుబ్బారాయుడన్న సంతకం వుంది.

అంటే ఆ యువకుడే సుబ్బారాయుడన్నమాట— అనుకుంది గిరిజ. ఈ విషయం చెప్పడానికి ఆమె భర్త వద్దకు పరుగెత్తింది. కానీ అతనామె ఏం చెప్పినా వినే

సితిలో లేదు. అలా ఆగకుండా ఏడుస్తూనే ఉన్నాడు.

గిరిజ అతణ్ని ఓదార్చసాగింది—"ఏమండీ—జరిగింది జరిగిపోయాక ఇప్పుడు ఏడ్చి లాభమేమిటండీ—ముందేం చేయాలో ఆలోచించాలి...."

"నేను హత్య చేశాను గిరిజా—ఇప్పుడు నేను హంతకుణ్ని. నన్ను చూస్తే నీకు భయం వేయడంలేదూ—ఒళ్ళంతా కంపరంగా లేదూ—"అన్నాడు రామం ఇంకా ఏడుస్తూనే.

"ఒక ఆడదాన్ని ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా—అనుభవించాలనుకునే పద్మనాభంలాంటి వ్యక్తి—హంతకుడికంటె భయంకరమైనవాడు. ఆడదానికి మానభంగం కంటె జుగుప్సాకరమైన అనుభవం వుండదు. అలాంటి వ్యక్తినుంచి, అలాంటి అనుభవంనుంచి నన్ను రక్షించిన మీరు నాకు దేవతా స్వరూపులు. నిజానికి రవికిశోర్ పద్మనాభంకంటె వెయ్యిరెట్లు మెరుగండీ! అతడు మనల్ని ఆ హోటల్ నిబంధనలమేరకు మాత్రం అవమానించాడు. వీడు అన్ని నిబంధనలూ అతిక్రమించాడు. వీడికిది తగిన శిక్షే అనుకుంటాను...." అంది గిరిజ.

అప్పుడు రామానికి తను రవికిశోర్ని చంపాలని పథకం వేసుకోవడం గుర్తొచ్చింది. అది చెప్పాలన్న ఉత్సాహంతోనే ఇంటికి పెందరాళే వచ్చాడు. అలా రావడం వల్లనే గిరిజ శీలం సంరక్షించబడింది. రవికిశోర్ తన భార్యను కోరాడు—కానీ అందుకు అనుమతికూడా తీసుకోదలిచాడు. పద్మనాభం అలాకాదు. గిరిజ అనుమతితో కూడా నిమిత్తంలేకుండా ఆమెను అనుభవించదలిచాడు. రవికిశోర్‌ను తను చంపాలని అనుకోవడం గిరిజను పద్మనాభం బారినుండి రక్షించింది.

అది సరే!....తను నిజంగా రవికిశోర్‌ను హత్యచేయ కలిగి వుండేవాడా?

ఆవేశం తనను హత్యకు పురిగొల్పుతోంది తప్పితే.... హత్యచేసి తట్టుకునే మనోబలం తనకు లేదు.

పద్మనాభాన్ని తను చంపాలని అనుకోలేదు. కానీ చంపేశాడు.

"గిరిజా! ఇప్పుడేం చేయాలి?"

భర్త అధైర్యపడుతూంటే గిరిజకు జాలివేసింది.

# 6

భార్యాభర్తలిద్దరూ నిదానంగా ఆలోచించి తదుపరి కార్యక్రమం నిర్ణయించారు.

అనుకోకుండా తను ఎక్కడికో బయల్దేరవలసి వచ్చిందనీ—వారం రోజుల్లో తిరిగొచ్చాక వివరాలన్నీ చెబుతాననీ పద్మనాభం భార్యకు రాసిన విధంగా ఓ వుత్తరాన్ని గిరిజ తయారుచేసింది. వుత్తరం చాలా హడావుడిగా రాసినట్లు రాసింది. వుత్తరాన్ని రామం పోస్టుచేసి వచ్చాడు.

ఈ వుత్తరం అందుకుంటే వారం రోజులదాకా పద్మనాభం భార్య అతడి గురించి ఆలోచించదు. కేసు ఎంత పాతపడితే తమకు అంత మంచిది. తిరగతోడడం పోలీసులకు అంత కష్టమవుతుంది. అదికాక పద్మనాభం భార్య వెంటనే ఎలాగూ పోలీసుల దగ్గరకు వెళ్ళదు.

భార్యాభర్తలిద్దరూ కలిసి కష్టపడి హాల్లో నిలువెత్తు లోతున గొయ్యి ఒకటి తీసి పద్మనాభాన్ని అందులో పాతిపెట్టారు. ఎక్కడా ఆనవాలు దొరక్కుండా గొయ్యిని బాగా కప్పెట్టేశారు.

తర్వాత రామం అడ్రస్ పట్టుకుని సుబ్బారాయు

డింటికి వెళ్లాడు.

సుబ్బారాయుడి భార్య కాబోలు—ఓ యువతి వచ్చి తలుపు తీసింది. ఆమెను చూసి రామం ఆశ్చర్యపోయాడు. ఆమె పేరు సుమతి. చదువుకునే రోజుల్లో రామం తలిదండ్రుల పక్కిల్లే ఆమెది. ఇద్దరూ మంచి స్నేహంగా వుండేవారు. రామం ఆమెను స్వంత చెల్లెలికంటె అభిమానంగా చూసుకునేవాడు. కాలేజీ చదువుల కోసం రామం ఊరొదిలిపెట్టేక మళ్ళీ వాళ్ళు కలుసుకోలేదు.

నువ్వా అంటే నువ్వా అనుకున్నారిద్దరూ.

సుబ్బారాయుడు ఇంట్లోలేడు.

"ఎలావుంది మీ ఆయన ఒంట్లో?" అనడిగాడు రామం కాసేపు కబుర్లయ్యాక.

"ఇంటికొచ్చి హడావుడిగా బైటకు వెళ్ళిపోయారు. మనిషి కంగారుగా వున్నారు—" అంది సుమతి.

"నీకేమీ చెప్పలేదా?"

"లేదు...."

రామం నిట్టూర్చాడు. అయితే అప్పుడే గండం గడిచిందనుకునేందుకు లేదు. సుబ్బారాయుడు హడావుడిగా బైటకు వెళ్ళడానికి కారణమేమిటి? అతను పోలీస్ స్టేషన్‌కు వెళ్లాడా?

రామం చందా రసీదుల పుస్తకం సుమతికి అందించి—"నీ భర్త నా యింటికొచ్చి ఇది మరిచిపోయి వెళ్ళిపోయాడు. దీనిమీది అడ్రస్ చూసి-పోనీ తిరిగిచ్చేద్దామని తీసుకొచ్చాను. మంచిదే అయింది. ఈ విధంగా నిన్ను మళ్ళీ చూశాను—" అన్నాడు.

"చందా రసీదుల పుస్తకం ఇవ్వడం కోసం ఇంత దూరం వచ్చావా? అప్పట్నించీ నీ మంచి బుద్ధి అలాగే

వుందన్నమాట—" అని నవ్వుకుంది సుమతి. అంతలోనే దిగులు ఆమె ముఖాన్నావహించుకోగా—"నువ్వు కానీ ఆయనకు చందా ఇవ్వలేదుగదా—" అంది.

"ఏం?" అన్నాడు రామం ఆశ్చర్యంగా.

"అబద్ధమెందుకూ? నిజం చెప్పేస్తాను. నా భర్త నడిచే దారి మంచిదికాదు. ఆయన సంపాదిస్తున్న ప్రతి పైసా కూడా మోసంతోనే!" అని నిట్టూర్చింది సుమతి.

రామం ఆశ్చర్యపడ్డాడు. కానీ అంతలోనే అతడికి వాంతకుడినన్న విషయం గుర్తుకొచ్చింది. ఈ విషయం తెలిస్తే సుమతి తన గురించి ఏమనుకుంటుంది?

రామం అక్కడ ఎక్కువసేపు వుండలేకపోయాడు. అతడు సుమతిని తన ఇంటికి రమ్మనమని ఆహ్వానించి అక్కణ్నించి బయల్దేరాడు. ఇల్లు దాటి సందు మొగ తిరిగేసరికి అతడికి సుబ్బారాయుడు ఎదురుపడ్డాడు.

"హలో మిస్టర్ సుబ్బారాయుడూ!" అంటూ రామం అతన్ని పలకరించాడు.

సుబ్బారాయుడు రామాన్ని చూసి తడబడి"—మీకు నా పేరెలా తెలుసు!" అన్నాడు.

రామం స్వరం తగ్గించి—"ఒక్క నిముషం అలా పక్కకురా. నేను నిన్నేమీ చెయ్యను. నీ భార్య సుమతి నాకు స్వంత చెల్లెలికంటె ఎక్కువ. చిన్నప్పుడు అయిదేళ్లు కలిసిమెలిసి వున్నాం. నీతో ఒక్కమాట చెప్పాలి. అంతే!" అంటూ చేయిపట్టుకుని అతన్ని దూరంగా ఓ చెట్టుకిందకు తీసుకుపోయి—తగ్గు స్వరంతో హత్య ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో ఆ కథంతా చెప్పాడు.

సుబ్బారాయుడు ఓపికగా ఇదంతా విని—"మీ రిదంతా నా కెందుకు చెబుతున్నారో తెలియదు.

నాకై నేనే నిజాయితీపరుణ్ని కాను. మీ యింట్లో ఏం జరిగిందో మీరు గుర్తుచేసినా తెచ్చుకోను. నన్ను నమ్మండి. వదిలిపెట్టండి. నేను కలిసొచ్చే పనులు తప్ప చెయ్యను. కోరి ప్రమాదాలు ఆహ్వానించను-" అన్నాడు.

రామం అప్పటికతన్ని వదిలిపెట్టాడు.

మర్నాడు భార్యాభర్తలిద్దరూ కలిసి సుబ్బారాయు డింటికి బయల్దేరారు. ఆ యిల్లు తాళంవేసివుంది. వాకబు చేయగా సుబ్బారాయుడు ఇల్లు ఖాళీ చేసి వెళ్ళి పోయ్యాడని తెలిసింది.

ఆ తర్వాత అతనేమయ్యాడో వాళ్ళకి తెలియలేదు.

## 7

పద్మనాభం అంతర్ధానం పోలీసు రిపోర్టుదాకా వెళ్ళ డానికి కొన్ని నెలలు పట్టింది. పోలీసులు విచారించి ఏమీ తేల్చలేకపోయారు. అనుమానితుల జాబితాలోకి రామం రాలేదు. ఓ సంవత్సరం గడిచేసరికి ఆ కేసు ఫైలు మూల పడింది.

ఒక హత్యచేసి అంత సులభంగా తప్పించుకోగలనని రామం ఎన్నడూ అనుకోలేదు. కొంతకాలంపాటు అతను ఆవేశాన్నణచుకున్నప్పటికీ—క్రమంగా అతడినేదో మొండి ధైర్యం ఆవహించుకుంది. రామం తన ఆవేశాన్ని ఎప్పటివలెనే ప్రకటించడం ఆరంభించాడు.

"ఆవేశం మీచేత ఓ హత్య చేయించింది-ఆ విషయం మరిచిపోకండి—" అంటూ గిరిజ భర్తను ఎన్నోమార్లు మరీ మరీ హెచ్చరించింది.

"నేను చేసిన హత్య దైవనిర్ణయం. ఒక దుర్మార్గుడికి నా ద్వారా శిక్ష విధించబడాలని దేవుడు నిర్ణయించాడు. నేను నిమిత్త మాత్రుణ్ని. అందుకే నాకే అపాయమూ

వాటిల్లలేదు. ఇంక నేను దేనికీ భయపడను. నా ఆవేశం నాకు మేలు చేస్తుందే కానీ కీడు చేయదు. లేనిపోని నీతులు నాకు చెప్పకు—" అంటూ రామం తీసిపారేసేవాడు.

"తప్పించుకోగలగడం మీ అదృష్టం. అన్ని పర్యాయాలూ కలిసిరాదు. ఆవేశం అనర్ధదాయకం. ఆ విషయం మాత్రం మరచిపోవద్దు—" అంటూ గిరిజ హెచ్చరించేది.

రెండేళ్ళు గడిచాక రామం ఊరు మారాడు. ఇక్కడ అతడి జీవితం మారింది. సంపాదన పెరిగింది. ఓ అబ్బాయి కూడా పుట్టాడు.

మధ్యతరగతి సంసారాల్లో సంపాదన పెరిగినకొద్దీ ఖర్చు పెరుగుతూనే వుంటుంది. రామం సంపాదన పెరగడంవల్ల ఇంట్లో నాలుగు రకాల వస్తువులూ అమరాయి తప్పితే బ్యాంకులో నిల్వ పెరగలేదు. గట్టిగా రెండు మూడు వేలు కావాలంటే డబ్బుకు తడుముకోవలసిందే!

ఓ రోజు భార్యాభర్తలిద్దరూ ఓ ఎలక్ట్రికల్ షాపులో వాషింగ్ మెషిన్ బేరం చేస్తూండగా వారిని ఒక వ్యక్తి పలకరించాడు. రామానికి వెంటనే అతడు గుర్తువచ్చాడు. అతడు రవికిశోర్!

రవికిశోర్ రామాన్ని కాక గిరిజనే పలకరించాడు.

"హలో మిసెస్ గిరిజా! మనం హోటల్ సంపెంగలో కలుసుకొని రెండేళ్లు దాటిందనుకుంటాను. అప్పటికీ ఇప్పటికీ నీలో ఏమీ మార్పులేదు. ఐ కంగ్రాట్యులేట్ యువర్ హజ్బెండ్. ఆ రోజు మనం ముగ్గురం కలిసి మాట్లాడుకున్న మాటలు-ఆహా—ఇప్పటికీ చెవుల్లో గింగురుమంటున్నాయి. వై డోన్ట్ యూ కం దేర్ అగైన్!" అని రామంవంక తిరిగి—"మిస్టర్ రామం—మీ శ్రీమతిని తీసుకుని మా ఊరొచ్చి హోటల్ సంపెంగకు రావాలి మీరు. ఈసారి

మీరు తిరస్కరించలేని ఆఫర్ తో వస్తాన్నేను. సీయూ....” అని వెళ్ళిపోయాడు.

రామానికి నోటమాటరాలేదు.

ఇద్దరూ ఆ షాపులోంచి త్వరగా బైటకు వచ్చేసరికి-రవికిశోర్ కారు వెళ్ళిపోయింది.

ఆ షాపులో రవికిశోర్ కు షేరుందట. రవికిశోర్ స్నేహితులని తెలియగానే వాళ్ళకతను ఎక్కువ మర్యాద చేయబోయాడు. రవికిశోర్ కందులో షేర్లున్నాయన్న విషయం కంపరం కలిగించగా వారిద్దరూ అక్కడ ఉండ లేకపోయారు. ఆ తర్వాత వారు షాపింగ్ కొనసాగించనూ లేదు.

“డర్టీ రోగ్!” అన్నాడు ఇంటిదగ్గర రామం.

గిరిజ మాట్లాడలేదు.

“పద్మనాభానికి పట్టిన గతే వాడికీ పట్టిస్తాను—” అన్నాడు రామం.

గిరిజ భయంగా—“చీటికీ మాటికీ మీరు హత్యల గురించి మాట్లాడకండి!” అంది.

“లేదు గిరిజా! నేను అవతరించిందే దుష్టశిక్షణకోసం-ఇలాంటి చీడపురుగుల్ని ఏరేయాలి—”

“ఇలాంటి చీడపురుగుల్ని ఒకటొకటిగా ఏరే బదులు—ఆ హోటల్ సంపెంగ మీద ఓ బాంబువేస్తే సరిపో తుంది—” అంది గిరిజ.

“ప్రపంచాన్ని రిపేర్ చేయడం నా వల్లకాదు. నా కళ్ళెదుటే నా భార్యను అవమానించినవాణ్ని వదిలి పెట్టను. పద్మనాభం కాక అలా చేసినవాడు రవికిశోర్ ఒక్కడే! వాడు కూడా చస్తేకాని నేను సుఖంగా నిద్ర

"లేను—" అన్నాడు రామం.

"అయితే ఏమంటారు?"

"పద్మనాభం విషయంలో హత్య జరిగాక నాకు గాయపడ్డావు నువ్వు. ఇప్పుడు హత్య జరగడానికీ గాయపడాలి నువ్వు. నా దగ్గర పథకం సిద్ధంగా వుంది-" అంటూ ఇదివరలో తను రవికిశోర్‌ను ఎలా చంపాలనుకున్నాడో చెప్పాడు.

"అయితే విలియమ్స్ తెలుసా మీకు?" అంది గిరిజ ఆశ్చర్యంగా.

"తెలుసు—" అన్నాడు రామం—"కానీ వాడికి నేను తెలియదు. పద్ధతి నాకు తెలుసు. విలియమ్స్‌కు నేనో వుత్తరం రాస్తాను. రాసిందెవరో వాడికి తెలియక్కర్లేదు. ఫలానా చిరునామాలో వుంటున్న యువతి డబ్బు అవసరంలో వుంది—అని రాస్తే చాలు. మిగతా వ్యవహారం వాడే నడుపుతాడు. అందులో వాడు అందె వేసిన చేయి—"

గిరిజ ఆలోచనలోపడింది. కాసేపాగి—"నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి. ఇది చాలా ప్రమాదకరమైన వ్యవహారంలా తోస్తోంది నాకు—" అందామె.

గిరిజకు ఏం చేయాలో తోచలేదు. విషమ సమస్య వచ్చినట్లే అనుకుందామె. సుఖంగా నడిచిపోతున్న సంసారంలో చిక్కులు తెచ్చిపెట్టవద్దని భగవంతుణ్ని ప్రార్థించింది.

భగవంతుడామె ప్రార్థనలు విన్నాడో లేదో తెలియదు కానీ ఆ దంపతులకు కొత్త ఉపద్రవం వచ్చిపడింది.

ఓరోజు రామం ఇంటికి వచ్చేసరికి గిరిజ దిగులుగా అతడికి ఎదురై—"కొంప మునిగిపోయిందండీ—" అంది.

"ఏమిటయింది?" అన్నాడు రామం కంగారుగా.

"ఓగంట క్రితం—ఈ కాగితం మనింటి తలుపు సందు లోంచి తోయబడి వుంది—" అంటూ భర్తకు ఆ కాగితా న్నందించిందామె. రామం ఆత్రుతగా దాన్నందుకుని చదివాడు.

"హలో మిస్టర్! నువ్వు చేసిన హత్యకు నేను ప్రత్యక్ష సాక్షినన్న విషయం గుర్తుందా? త్వరలో నేను నిన్ను కలుస్తాను. నేనడిగింది నువ్వివ్వాలి. ఇస్తావనే అనుకుంటున్నాను. ఇవ్వకపోతే వురి తప్పదుకదా మరి! వివరాలు మళ్ళీ వుత్తరంలో రాస్తాను...."

క్రింద సంతకం లేదు.

"ఇది తప్పకుండా ఆ సుబ్బారాయుడి పనే అయియుంటుంది—" అన్నాడు రామం.

"సుబ్బారాయుడు కాక మరెవరైనా ఇది రాశారనుకుంటే మనకు మనశ్శాంతి కూడా వుండదు. ఆ హత్యకు ప్రత్యక్ష సాక్షి అతనొక్కడే! అతనుకాక ఇంకెవరున్నారు?" అంది గిరిజ.

"అవును—ఇంకెవరున్నారు?" అన్నాడు రామం. అప్పుడే అతనికి ఏదో స్ఫురించింది. ముగ్గురంటే ముగ్గురికి మాత్రమే ఈ హత్య గురించి తెలుసు. అందులో తనను మినహాయిస్తే మిగిలింది ఇద్దరు. ఒకడు సుబ్బారాయుడు ఇంక....గిరిజ....

రామం వుత్తరాన్ని పరీక్షగా చూశాడు. అది గిరిజ దస్తూరీయేనని అతడికి అనిపించింది.

సుబ్బారాయుడికిలాంటి వుత్తరం రాసే దమ్ములేదు. ఈ వుత్తరం గిరిజే రాసి వుండాలి. రాస్తే ఎందుకు?

ఓ హత్య చేయడంవల్ల ఎన్ని అనర్థాలుంటాయో తనకు తెలియాలి. అందులోని ప్రమాదాలు తనకు అర్థం కావాలి. ముందు హత్యపట్ల తను విముఖుడు కావాలి.

ఇది గిరిజ ఎత్తుగడ!

రామం వుత్తరాన్ని జేబులో పెట్టుకుని—"గిరిజా! సుబ్బారాయుణ్ని, రవికిశోర్‌తోపాటు కలిపి చంపుతాను. నువ్వేమీ భయపడకు—" అన్నాడు.

"ఏది ఏమైనా మీరు కాస్త తొందరపడి వాడి వునికి తెలుసుకోండి—నాకు చాలా బెంగగా వుంది—" అంది గిరిజ.

రామం తనలో తాను నవ్వుకున్నాడు.

# 8

అయితే కొద్ది గంటలు తిరక్కుండానే రామం ఆ వుత్తరాన్ని సీరియస్‌గా తీసుకోవలసొచ్చింది.

మరిచిపోయిన పాలడబ్బాలు కొనడం కోసం అతను బజారుకి వెడితే ఓ షాపులో అతడికి సుబ్బారాయుడు కనబడ్డాడు.

రామం వులిక్కిపడ్డాడు.

సుబ్బారాయుడు రామాన్ని చూడలేదు. రామం ఒక్క క్షణం తటపటాయించి—చివరికి సుబ్బారాయుణ్ని పలకరించాలనే అనుకున్నాడు.

రామం పలకరింపు విని సుబ్బారాయుడు ఆశ్చర్యపోయాడు—"ఎవరండీ మీరు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నేను గుర్తులేనా నీకు సుబ్బారాయుడూ—" అన్నాడు రామం.

"నా పేరు సుబ్బారాయుడు కాదు. పాపారావు—" అన్నాడా మనిషి.

"అలాగా — నువ్వు పేర్లు కూడా మారుస్తావన్న మాట—" అన్నాడు రామం.

"మీరు చెప్పేది వింటూంటే నాకేదో జోక్ గుర్తొస్తోంది. నాకిప్పుడు టయింలేకపోయింది కానీ మీతో సరదాగా కబుర్లు చెప్పి వుండే వాణ్ని...." అని చటుక్కున అక్కణ్నించి వెళ్ళిపోయాడతను.

రామం కంగారుగా అతడినను సరించాడు. అతను తన్నెవరో అనుసరిస్తున్నారన్న ధ్యాసేలేకుండా వెళ్ళిపోయాడు. రామం అతను వెళ్ళిన ఇల్లు బాగా గుర్తుపెట్టుకున్నాడు. కె. పాపారావు అన్న నేమ్ ప్లేటు కూడా వుందా ఇంటికి.

నేమ్ ప్లేట్ చూడగానే తెల్లబోయాడు రామం. వీడు నిజంగానే పాపారావయుండాలి. లేకపోతే ఇంటికింకో నేమ్ ప్లేట్ ఎందుకుంటుంది?

కానీ తనకు సుబ్బారాయుడు బాగా తెలుసు. తన కళ్ళు పొరబడవు.

రామం తిన్నగా ఇంటికి వెళ్ళిపోయి గిరిజతో—"నాకు సుబ్బారాయుడు వునికి తెలిసిపోయింది. వాణ్నెలాగైనా చంపేయాలి!" అన్నాడు.

గిరిజ చాలా ఆశ్చర్యపడింది-"సుబ్బారాయుడీ ఊళ్ళో వున్నాడా?" అంది ఆత్రుతగా.

"సందేహం లేదు. వాడే ఆ వుత్తరం రాశాడు. ఎటొచ్చీ ఈ ఊళ్ళో వాడి పేరు పాపారావు. వచ్చి ఎంతకాలమయిందో తెలియదుగానీ-నలుగుర్నీ మోసంచేసి బ్రతికే వెధవ—నన్నే బెదిరించే స్థితికి వచ్చాడు—" అన్నాడు రామం.

"మీరేదో పెద్ద గ్యాంగు లీడర్లా మాట్లాడు

తున్నారు!" అంది గిరిజ.

"గ్యాంగ్ లీడర్ని కాకపోతేనేం—చిటికెలో హత్య చేసి అవలీలగా తప్పించుకోగలను. కాదంటావా?"

"కాదనను. కానీ మనిషిని అదృష్టం అన్నివేళలా కాయదు. మనను ఓ పర్యాయం కాసింది. అపధర్మంగా అనుకోకుండా హత్య చేయడం వేరు కావాలని పథకంవేసి ద్వేషంతో, పగతో హత్యచేయడం వేరు. అలాంటి వాళ్ళను దేవుడూ క్షమించడు. మళ్ళీ మళ్ళీ నేరాలు చేయడంలోనే నేరస్తుడు తప్పటడుగువేసి దొరికిపోతాడు. జరిగింది మర్చిపోండి. ఇంకెవర్నీ హత్య చేయాలని అనుకోకండి—" అంది గిరిజ.

"కానీ గిరిజా! నువ్వో విషయం మర్చిపోతున్నావు. ఆ సుబ్బారాయుడి దగ్గర నా ప్రాణాలు తీసే రహస్యం దాగివుంది. దాంతో వాడు నా ప్రాణాలు తీస్తాడు. లేదా డబ్బుకోసం వేధిస్తాడు. వాణ్ని అంతం చేయలేకపోతే ఎలా?"

"సరే—సుబ్బారాయుణ్ని చంపుతారు. తర్వాత రవికిశోర్ని చంపుతారు. ఇన్ని హత్యలుచేసి మీరు తప్పించుకోగలననే అనుకుంటున్నారా?"

"నీవంటి భార్య వుంటే ఈ ప్రపంచంలో ఏమైనా చేయగలను!" అన్నాడు రామం.

"అయితే వినండి. నేను మీకు ఏ విధంగానూ సాయపడలేను. అందువల్ల హత్యల సంగతి మీ బుర్రలోంచి చెరిపేయండి—" అంది గిరిజ.

"కానీ సుబ్బారాయుడు నన్ను బెదిరిస్తూ వుత్తరం రాశాడు. దానికేమంటావ్?"

"అది సుబ్బారాయుడు రాయలేదు. నేనే రాశాను!"

అంది గిరిజ.

పక్కలో బాంబు పేలినట్లు వులిక్కిపడ్డాడు రామం- "గిరిజా! ఆ వుత్తరం నువ్వే రాసినట్లు అనుమానించాను. నేను మళ్ళీ మళ్ళీ హంతకుణ్ని కావడం ఇష్టంలేక నన్ను నా ప్రయత్నంనుండి విముఖుణ్ని చేయడానికా వుత్తరాన్ని నువ్వే సృష్టించి వుంటావని నేననుకున్నాను. కానీ ఇప్పుడు సుబ్బారాయుణ్ని చూశాక ఆ వుత్తరం వాడే రాశాడని తెలిసిపోయింది. నీ అబద్ధాలు నేను నమ్మను. నా ఆలోచనలు నీ దారికి మళ్ళవు. నువ్వు నాకు సహకరించి తీరాల్సిందే!" అన్నాడు.

"మీకు తప్పక సహకరిస్తాను. కానీ హత్యల విషయంలో కాదు. ఆ వుత్తరం నేనే రాశాను. కావాలంటే దస్తూరీ సరిపోల్చండి. ఇంక సుబ్బారాయుడి విషయమంటారా? అతడు అమాయకుడు. మిమ్మల్ని బెదిరించి డబ్బు గుంజే వుద్దేశ్యం అతడికి ఏ కోశానా వుండదని నేను నమ్ముతున్నాను. అతణ్ని చూసినట్లే మరిచిపొండి. నేను త్తరం రాయడం—మీరతణ్ని చూడడం కాకతాళీయంగా జరిగాయి—" అంది గిరిజ.

దస్తూరీ సరిపోల్చగా ఆ వుత్తరం గిరిజ రాసిందేనని తేలింది. కానీ రామం నమ్మలేదు.

## 9

రామం ఆ యింటి తలుపు తట్టగానే ఓ యువతి వచ్చి తలుపు తీసింది. అతనాశ్చర్యపడ్డాడు. ఆమె సుమతికాదు.

"సుబ్బారాయుడుగారింట్లో లేరా?" అనడిగాడతను.

"సుబ్బారాయుడుగారెవరు? ఇది పాపారావు గారిల్లు—" అందామె.

"మీరు ...."

"నేనాయన భార్యను...." అందామె.

రామానికి నమ్మకం కలగలేదు—"మీతో ఒక్క క్షణం మాట్లాడాలి. నేను మీకు అన్నలాంటివాణ్ని—లోపలకు రావచ్చా?" అనడిగాడు.

ఆమె అభ్యంతర పెట్టలేదు.

ఇద్దరూ లోపలకు వెళ్ళి కూర్చున్నాక రామం ఆమెను మంచినీళ్ళడిగాడు. ఆమె లోపలకు వెళ్ళివచ్చేలోగా అతనక్కడ గోడలకు తగిలించిన ఫోటోలు చూశాడు. అందులో ఒకటి సుబ్బారాయుడిది. రెండవది ఇంట్లో వున్న యువతిది. మిగతావి ఎవరివో తెలియలేదు.

ఆమె మంచినీళ్ళు తీసుకురాగానే రామం గోడకున్న ఫోటో చూపించి "ఆ ఫోటోలో ఆయనేగా మీ భర్త!" అన్నాడు.

అవుననడానికి కాస్త సిగ్గుపడిందామె.

"చూడమ్మా—మీ భర్త చూస్తే పచ్చిమోసగాడిలా వున్నాడు. ఆయన నాకు బాగా తెలుసు. మూడేళ్ళ క్రితం వరకూ ఇద్దరం బాగా కలిసిమెలిసి తిరిగాం. ఆయనకు నా స్నేహితురాలు సుమతితోనే వివాహమైంది. ఇద్దరూ చిలకా గోరింకల్లా వుండేవారు. నాకు తెలిసినంతవరకూ ఆయన పేరు సుబ్బారాయుడు. ఇప్పుడు తన పేరు పాపారావంటున్నాడు. సుమతినేం చేశాడో తెలియదు. చంపేశాడో—వేరేచోట వుంచాడో—" అన్నాడు రామం.

"నాకూ ఆయనకూ వివాహమై నాలుగేళ్ళయింది. ఇద్దరం ఇంతవరకూ కలిసిమెలిసి హాయిగా వుంటున్నాం. ఆయన నన్నొదిలిపెట్టి ఏడాదికి పదిరోజులుంటారేమో—అంతే! మీరు చెప్పే కథలేవీ ఆయనతో పొసగడంలేదు.

కానీ నేను మీ బాధ అర్థం చేసుకోగలను-" అందామె.

"అంటే?" అనడిగాడు రామం.

"మా ఆయనకో కవల సోదరుడున్నాడు. అచ్చం ఆయనలాగే వుంటాడు. పేరు సుబ్బారాయుడు. అతడి భార్య సుమతి అవడం నిజం. అయితే అన్నదమ్ములిద్దరికీ సంబంధ బాంధవ్యాలు లేవు. సుబ్బారాయుడి బుద్ధులు మంచివి కాదు. నలుగుర్నీ మోసంచేసి బ్రతుకుతాడు. ఈయనేమో నలుగురిలో గౌరవంగా బ్రతుకుతున్నారు. అందుకని సోదరుడితో అన్ని బంధాలూ తెంచుకున్నారీయన. ఎవరైనా సుబ్బారాయుడి గురించి అడిగినా తనకు తెలియదంటారు. పోలికల కారణంగా ఒకరికొకరు పొరబడతారని ఇలా దూరంగా వస్తే—ఇక్కడ కూడా మీరాయన్ను వెతుక్కుంటూ రావడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది—" అందామె.

రామం అనుమానంగా—"అయితే సుబ్బారాయుడెక్కడుంటున్నాడు?" అనడిగాడు.

"ఇంకెక్కడి సుబ్బారాయుడు? అతనూ అతడిభార్యా, ఓ చంటి కుర్రాడూ—ఆర్నెల్ల క్రితం జరిగిన రైలు ప్రమాదంలో చచ్చిపోయారు. శవాలు కూడా గుర్తు తెలీకుండా పోయినై. నలుగుర్నీ మోసంచేసి బ్రతికినందుకు ఆ ఉసురు—అతన్నే కాక—అతడి భార్యా బిడ్డలక్కూడా కొట్టింది—" అందామె.

"శవాలు కూడా గుర్తు తెలియకపోతే మరి సుబ్బారాయుడు పోయాడని ఎలా అనుకున్నారు?"

ఆమె బాధగా నవ్వి—"పెళ్ళైనప్పట్నించీ ఈయనకు సుబ్బారాయుడు మీద అనుమానం. అతడు తన పోలికలతో నన్ను కూడా మోసం చేస్తాడేమోనన్న భయంతో

ఆయన ఏదో వంకపెట్టి ఓ రోజున ఇద్దరూ పచ్చబొట్లు పొడిపించుకునేలా చేశారు. ఆయన చేతిమీద పాపారావు పేరుంటుంది. సుబ్బారాయుడి చేతిమీద అతడి పేరుంటుంది—అదే అతణ్ని రైలు ప్రమాదంలో పట్టిచ్చింది. అతడి దగ్గర్లో వున్న తల్లీబిడ్డల శవం అతడి భార్యా బిడ్డలదని ఊహించాం. తల్లి శవం తెలియకపోయినా—బిడ్డ శవం గురు బాగా తెలుస్తోంది—" అంది.

రామం ఆమెతో మాట్లాడుతూండగానే అక్కడకి పాపారావు వచ్చాడు. అతడి చేతిమీద పాపారావు అన్న పచ్చబొట్టు కూడా చూశాక అతను విచలితుడయ్యాడు.

ఎంతలో ఎంత ప్రమాదం తప్పింది! తీరికూర్చుని తను ఓ అమాయకుణ్ని హత్యచేసేవాడు. అందువల్ల తనకు కొత్త ప్రమాదం రావడం తప్పితే ప్రయోజనమేమీ వుండదు.

పాపారావు నిజంగా పాపారావేననీ—సుబ్బారాయుడికి తెలిసిన హత్యా రహస్యం అతడికి తెలియదనీ-తెలిసిన సుబ్బారాయుడు చచ్చిపోయాడనీ రామం ఊహించలేకపోయాడు.

అతడి మనసిప్పుడెంతో తేలికగా వుంది. ఉత్సాహంగా ఇంటికి వెళ్ళి గిరిజకు మొత్తం విషయమంతా చెప్పి—"జన్మలో నేను మళ్ళీ హత్యా ప్రయత్నం చేయను. అంతేకాదు. ఆవేశాన్ని వదిలిపెట్టి నిదానంగా ఉండడానికి ప్రయత్నిస్తాను. నిదానించడంవల్లనే పాపారావు గురించిన అసలు రహస్యం తెలిసింది—" అన్నాడు.

"సుబ్బారాయుడు బ్రతికే వున్నా—మీరు కాస్త నిదానిస్తే-అతడివల్ల కూడా మీకే ప్రమాదమూ వుండదని తెలిసేది. ఊరికే ఆవేశపడి హత్యలు చేయాలనుకోవడంవల్ల

ఉరికంబమెక్కడం తప్ప ప్రయోజనమేమీ వుండదు—"
అంది గిరిజ.

ఆయితే ఆమె మనసులో ఓ అనుమానం వుంది. సుబ్బారాయుడు నిజంగా చచ్చిపోయాడా? లేక పాపారావు అలాంటి కథ ఒకటి తయారు చేశాడా?

ఏది నిజమైనా దానివల్ల ఒక విషయం స్పష్టమవుతోంది. సుబ్బారాయుడివల్ల తన భర్తకు ప్రాణ భయం లేదు. సుబ్బారాయుడు చచ్చివుంటే ఎలాగూ బాధలేదు. ఒకవేళ పాపారావే సుబ్బారాయుడై వుంటే—అతను తన భర్తకు భయపడుతున్నట్లు తెలియనే తెలుస్తోంది.

ఏది ఏమైనా పాపారావు గురించి తెలిసిన నిజం రామానికి చాలా మంచి చేసింది. అతడిప్పుడు రవికిశోర్ విషయం కూడా పూర్తిగా వదిలిపెట్టి తన బ్రతుకు తను బ్రతుకుతున్నాడు.

—: ఐపోయింది :—

# దారి దోపిడి?

## సికిందర్

లాల్ మోగుతున్న ఫోన్ వంక తదేకంగా కొన్ని క్షణాలు చూసి, అప్పుడు రిసీవరెత్తాడు.

"యస్, లాల్ స్పీకింగ్. హూ ఈజ్ దట్ ఎండ్ ప్లీజ్?"

"నేను సుధాకర్ని మాట్లాడుతున్నాను. మీరు వెంటనే ఇక్కడికి రావాలి—మా ఇంటికి!"

"దేనికి?"

"దోపిడీ జరిగింది! డబ్బు పోయింది!"

"ఇంట్లోనా?"

"కాదు, కాదు—అన్నయ్యని దోచుకున్నాడు దొంగ! ఊర్నుంచి వస్తోంటే దార్లో ఆపి—దౌర్జన్యం చేసి—ముందు మీరు వెంటనే రండి! ఇక్కడ వివరంగా మాట్లాడుకోవచ్చు."

"పోలీసులకి తెలియజేశారా?"

"లేదు,"

"వాళ్ళకి తెలియజేస్తే మంచిదేమో...."

"ఓహ్, అలాగే తెలియజేస్తాను. ముందు మీరు బయల్దేరండి!"

"దోపిడీ జరిగి ఎంత సేపయింది?"

"అర....ఆగండి, ముప్పావుగంటయింది. సరిగ్గా 10-15కి జరిగింది."

"ఎక్కడ?"

"హాయత్ నగర్ దగ్గర. అన్నయ్య వస్తోంటే కారాపి, దౌర్జన్యం చేసి దోచుకున్నాడు. పావుగంటవరకూ అక్కడ అన్నయ్య తెలివిలేకుండా పడివున్నాడు. లేచి తిన్నగా ఇంటికొచ్చాడు ఇప్పుడిప్పుడే...."

"ఆయన ఎక్కడనించి వస్తున్నాడు?"

"విజయవాడనించి."

"ఐసీ....ఎంత డబ్బు పోయింది?"

"నలభై వేలు."

"ఆయన దొంగ ఆనవాలు చూశాడా?"

"లేదు, చీకటి. వాడు ముక్కుపై వరకు కర్చీఫ్ కట్టుకున్నాడట."

"దేనితో బెదిరించాడట?"

"కత్తితో. మిస్టర్ లాల్, మీరిక వస్తారా....?"

"దొంగ ఎలాంటి దుస్తుల్లో వున్నాడు?"

"ఊదా షర్టు.... తెల్ల ప్యాంటు...."

"వెల్, చీకట్లో అంత స్పష్టంగా కన్పించాయా అవి?"

"అంటే....? మీ ఉద్దేశ్యం?"

"చీకట్లో నీలిరంగుని గుర్తించడం కష్టమవుతుంది...."

"మిస్టర్ లాల్," చటుక్కున అంది అవతలి గొంతు,

త విసుగుతో. "మీరొచ్చి అన్నయ్యని అడగండి. ాసరంగా టైం వేస్టు చెయ్యకండి సందేహాలతో. ్మల్ని పిలవమని అన్నయ్యే చెప్పాడు. ఆయన బాగా సెట్ అయివున్నాడు, దయచేసి వెంటనే రండి! జరి ంతా ఆయన కళ్ళకు కట్టినట్టు చెప్తాడు—చీకట్లో నీలి ని గుర్తించడం కష్టమన్నారు. కానీ, దొంగ దారికడ్డం ్చి కారాపి వుంటే అతనిమీద హెడ్ లైట్స్ పడ యని గమనించండి."

లాల్ అతని మాటలకి మురిసిపోయాడు. "ఎక్కడ ఇల్లు?"

సుధాకర్ సోమాజీ గూడలోని అడ్రసు చెప్పాడు.

"ఓ.కే., వెంటనే వస్తున్నాం" లాల్ చెప్పి ఫోన్ ట్టేశాడు.

సుధాకర్ గేటు తెరిచి డిటెక్టివ్ లను లోనికి తీసుకు ళ్ళాడు.

"రండి, అన్నయ్య లోపల వున్నాడు. సోఫాలో రగిలబడి ఒకటే సిగరెట్లు కాల్చేస్తున్నాడు! నాకేదో యంగా వుంది."

"భయం దేనికి?" జాన్ అడిగాడు, సిగరెట్ గబ బా పీలుస్తూ.

"ఏమైపోతాడోనని! ఇది మామూలు షాక్ కాదు, ఈ యసులో."

"వయసెంత?"

"నలభై మూడు."

"హార్టు ట్రబుల్?"

"థాంక్ గాడ్, లేదు."

"ఇంట్లో ఇంకెవరున్నారు?"

"ఎవరూ లేరు—మేమిద్దరమే."

"మిగతా వాళ్ళు ఎక్కడికెళ్ళారు?"

"మాకు కావల్సిన వాళ్ళు ఎవరూ లేరు."

"మీకు వదిన లేదా?"

"వుండేది, చచ్చిపోయింది ..."

"ఆయన మళ్ళీ చేసుకోలేదా?"

"లేదు. వదిన పోయేటప్పటికి ఆయన వయసు నలభై. ఆ వయసులో మళ్ళీ చేసుకోవడం ఇష్టంలేదు. పైగా వదినని మర్చిపోలేడు."

"పిల్లలు కలుగలేదా?"

"లేదు."

"బాడ్ లక్."

"నేనంటే ఆయనకు ప్రాణం."

"మీ వయసుల్లో చాలా వ్యత్యాసం కన్పిస్తోంది...."

"కరెక్టు. నా వయసు ఇరవై ఏడు. అన్నయ్య తర్వాత చాలా ఆలస్యంగా పుట్టాను. చాలా చిన్నవాణ్ని. అందుకే నేనంటే ప్రాణం."

"ఏం చేస్తుంటారు మీరు?"

"తోడ్పడుతుంటాను—అన్నయ్యకు వ్యాపారంలో."

ముగ్గురూ ఇంట్లోకి వెళ్లారు.

హాల్లో ఎదురుగా సోఫాలో కూర్చుని వున్న వ్యక్తి గబుక్కున లేచి ముందుకు వచ్చాడు.

"లాల్ అండ్ జాన్! మీరొచ్చేశారా?"

లాల్ తలూపి అతన్ని ఆపాదమస్తకము చూశాడు.

అతని వెంట్రుకలు అక్కడక్కడా నెరిశాయి. జుట్టు రేగిపోయి వుంది. బట్టలు మాసివున్నాయి. తెల్లని షర్టు

మీద సిగరెట్ నుసి మరకలు కన్పిస్తున్నాయి. ముఖంలో ఏ కళాలేక వెలవెలబోతోంది. కళ్ళలో చెప్పలేని ఆందోళన వుంది—కానీ అదిప్పుడు డిటెక్టివ్ లని చూసి చాలావరకూ తగ్గింది.

"వెల్, మీరు కూర్చోండి...."

"నా పేరు అచ్యుతరావు."

"మిస్టర్ రావ్, మీరలా కూర్చోండి. ఆందోళన మానండి. ఈ రోజుల్లో దొంగల్ని పట్టుకోడం చాలా తేలిక—ఇట్టే దొరికిపోతారు."

"ఎలా?" అన్నాడు రావ్ కూర్చుంటూ.

లాల్ కూడా కూర్చున్నాడు. "ఏమీ లేదు, సైకాలజీ. దొంగలంతా తెలివిగలవాళ్లు కారు. అందులో ఈ చిన్న చిన్న నేరాలు చేసేవాళ్లు, జేబు దొంగలు, ఇంట్లో దూరి అందింది ఎత్తుకుపోయేవాళ్ళు, పదికో పరక్కో దారికాచి బెదిరించి లాక్కునే వాళ్ళు...స్ప్లిట్ సెకండ్ ఆపరేషన్ వాళ్ళది. క్షణాల్లో జరిగిపోవాలి. వ్యవధి ఎక్కువ వుండదు. అందువల్ల ఆధారాలేవైనా వదిలితే ఆ పరిస్థితుల్లో తొలగించే అవకాశం వుండదు.

"మిమ్మల్ని దారికాచి దోచుకున్నాడంటే తప్పకుండా ఆధారాలు వదులుతాడు. అతను మీ కారుని ముట్టుకున్నాడు; డోర్ తెరిచాడు; బ్రీఫ్ కేసు అందుకున్నాడు—అప్పుడు వెంటనే పారిపోవాలి. లేకపోతే హెవీ ట్రాఫిక్ వుండే ఆ నేషనల్ హైవే మీద ఏ వాహనమైనా రావచ్చు. మీరు అరవచ్చు. పట్టుబడతాడు. అందువల్ల మిమ్మల్ని స్పృహ పోగొట్టి లేదా ఇంకేదో చేసి తక్షణం పారిపోతాడు. ఆధారాల్ని లక్ష్యపెట్టడు."

"అయితే మా కారు మీద అతని వేలిముద్ర

లుంటాయా?" సుధాకర్ అడిగాడు.

"తప్పకుండా వుంటాయి. అంతేగాక అతను వేచి వున్నచోట సిగరెట్ బట్స్ అగ్గిపుల్లలు వగైరా వుండవచ్చు. కిళ్ళీ అలవాటుంటే ఆ మరకలు కూడా వుంటాయి. ఇసుక ప్రాంతమైతే అడుగుజాడలు కూడా వుంటాయి.... ఇప్పుడా స్థలాన్ని మీరు గుర్తించగలరా?" లాల్ అడిగాడు రావ్ ని.

రావ్ అడ్డంగా తలాడించాడు. "లేదు నాకు గుర్తు లేదు. ఆ పరిసరాలు గుర్తులేవు."

"హాయత్ నగర్ లో ఎక్కడ?"

"హాయత్ నగర్ అవతల."

"ఎంత అవతల?"

"సుమారు ఒక కిలోమీటరు—"

"చుట్టుప్రక్కల ఏం చూశారు?"

"నాకేమీ గుర్తులేదు."

"ఫిల్లింగ్ స్టేషన్?"

"లేదు."

"పెద్దచెట్లు ఏదైనా...."

"ఊహు!"

"గుబురు మొక్కలు....పొదలు....?"

"లేవు."

"టెలిగ్రాఫ్ స్తంభం?"

"గుర్తులేదు."

"మైలురాయి....?"

"అదీ గమనించలేదు."

"సమీపంలో ఎక్కడైనా లైట్లు?"

"కనిపించలేదు."

"చుట్టూ చీకటి అన్నమాట?"

"అంతే, చిమ్మ చీకటి."

"వెల్, దొంగ ఎక్కణ్నించి ప్రత్యక్షమయ్యాడు?"

రావ్ మళ్ళీ అడ్డంగా తలూపాడు, "తెలీదు. బాగా సమీపించేవరకూ నేను చూడలేదు. రోడ్డు మధ్య నిలబడి చెయ్యూపుతున్నాడు. నేనతన్ని సరిగ్గా చూడలేదు. లిఫ్ట్ కావాలేమోనని వేగం తగ్గించి దగ్గరగా వెళ్ళేసరికి అప్పుడు గ్రహించాను నేనెలాంటి అపాయంలో పడ్డానో. వాడు ముక్కువరకూ కన్పించకుండా రుమాలు కట్టుకున్నాడు. చేతిలో కత్తి మెరుస్తోంది, హెడ్ లైట్స్ కాంతిలో. నాకేమీ చెయ్యడానికి పాలుపోలేదు. కాళ్ళు చేతులు మరిక సహకరించలేదు. అలాగే కూర్చుండి పోయాను కారాపేసి....

"అప్పుడు వాడు గబుక్కున అవతలి డోర్ దగ్గర కొచ్చి, బొంగురు గొంతుతో హెచ్చరించాడు. 'అరిచావంటే పొడిచేస్తా, లాల్లి పెట్టక సొమ్ము తీయ్!' అని."

"ఆగండి!" జాన్ అన్నాడు మధ్యలో, "అతను ఏవైపు నిలబడ్డాడన్నారూ? అవతలివైపా? మీకు ఎడమ వైపు డోర్ దగ్గరా?"

"అవును."

జాన్ తలతిప్పి లాల్ ని చూశాడు. "అక్కడెలా నిల్చున్నాడు? ఇవతలగా వచ్చి రావ్ ప్రక్కనే, దగ్గరగా నిల్చోవాలి కదా? అసహజంగా వుంది."

సుధాకర్ లేచి, కాఫీ తెస్తానని వెళ్ళాడు.

"అవును నేనప్పుడు తేరుకున్నాను." రావ్ చెప్పాడు తిరిగి కొనసాగిస్తూ "వాడు దొంగ! నన్ను దోచు

కుంటాడు. ప్రక్కనే సీటుమీద బ్రీఫ్ కేసు వుంది. అందులో నలభై వేలుంది. ధైర్యం చెయ్యాలనుకున్నాను. ఎలాగైనా తెగించాలనుకున్నాను. వాడు కారు కడ్డం లేడు. గేరు మార్చి క్లచ్ వదిల్తే దూసుకుపోతున్న నన్ను చూస్తూ నిల్చోడం తప్ప ఏమీ చెయ్యలేడు.

"కానీ మిస్టర్ లాల్, నా ఆలోచన వాడు పసిగట్టాడు. నేనాపని చెయ్యకముందే వాడు డోర్ లాగి అమాంతం లోనికి పడ్డాడు. చేతిలో దేంతోనో నా తల మీద నేనూహించని వేగంతో కొట్టాడు—బహుశా అదే కత్తి పిడి అయివుంటుంది — అంతే, నా కళ్లు చీకట్లు కమ్మాయి. అలాగే పడిపోయాను."

"అప్పుడు?"

"అప్పుడేం జరిగిందో తెలీదు. తర్వాత కళ్ళు తెరిస్తే, చీకట్లో ఒంటరిగా పడివున్నాను సీటు మీద. జరిగింది గుర్తుకొచ్చింది. బ్రీఫ్ కేసు లేదు! వాడు దాంతో పారిపోయాడు. పోతూ కారుని రోడ్డు వారగా ఆపి, లైట్లార్పేసి వెళ్ళాడు."

"వెల్, దొంగకి డ్రైవింగ్ కూడా వచ్చన్నమాట."

రావ్ తలూపాడు. "అప్పుడు పదిన్నరయింది. నేను పావుగంట మూర్ఛలో వున్నాను. ఆ పావుగంటలో వాడు కొన్ని మైళ్ళు దాటేసి వుంటాడు. నాకేమీ చెయ్యడానికి పాలుపోలేదు. ఇంటిదాకా ఆ స్థితిలో ఎలా డ్రైవ్ చేశానో తెలీదు. పోలీసులకు చెప్పాలని కూడా తట్టలేదు. ఇంటికొచ్చి సుధాకర్ తో చెప్పాక మీరు జ్ఞాపకమొచ్చారు. అప్పుడు మిమ్మల్ని పిలవమన్నాను."

"ఆ సంఘటనంతా ఎంత సేపట్లో ముగిసింది?" అడి

గాడు లాల్.

"నిమిషాల్లో—ఆగండి—ఒకే ఒక్క నిముషంలో!"

"మీరతన్ని బాగా చూడలేదా, మొదట హెడ్ లైట్స్ వెలుగులో?"

సుధాకర్ కాఫీలు తెచ్చి తలొకటి ఇచ్చి తనొకటి తీసుకున్నాడు.

"లేదు, బట్టలు మాత్రం చూశాను. బ్లూ షర్టు తెల్ల ప్యాంటు. ముఖం అసలు కన్పించలేదు. ముక్కు పైవరకు కర్చీఫ్ కట్టుకున్నాడు. కళ్ళకింద చిన్న సందు వుంచాడు. క్రాపు సరిగాలేదు, జుట్టు చెదిరిపోయింది. కర్చీఫ్ తెల్లటిది. దానిమీద నల్లగళ్ళున్నాయి. కానీ మిస్టర్ లాల్, వాడి చేతిలో కత్తితోబాటు ఇంకేదో కూడా మెరిసింది."

"ఏమిటది? రిస్టువాచీయా? కడియమా?" అడిగాడు లాల్ కాఫీ తాగుతూ.

"ఊహుఁ! రెండూ కావు."

"మరి, ఉంగరమా?"

రావ్ ఆలోచించాడు. "అవును, కావచ్చు....చిన్న కాంతి పుంజరంలాగ తళుక్కున మెరిసింది."

"వెరీ వెల్! గొంతు బొంగరుగా వుందా?"

"అవును. వాడి వయసు ముప్పై వుండొచ్చు."

"ఇంకేం మాట్లాడాడు?"

"ఏం లేదు, ఆ రెండు ముక్కలే. ఉచ్చారణ యాసగా వుంది."

"ఓ.కే. కానీ మీరంత డబ్బుతో ఒంటరిగా రాత్రి పూట ఎందుకొస్తున్నారు?"

"తప్పలేదు, గత్యంతరంలేకపోయింది. అంత డబ్బుతో

ఈ రాత్రి విజయవాడలో ఆగిపోయేకన్నా బయలు దేరి ఇక్కడికి చేరుకోవడమే ఉత్తమమనిపించింది. హోటల్స్‌లో దిగాలంటే నాకు భయం."

"విజయవాడ ఎందుకెళ్ళారు?"

"పనిమీద. గత నెల్లో అక్కడ ఇళ్ళ స్థలాలు అమ్మాను. మేం పూర్తిగా ఇక్కడ స్థిరపడాం గనుక అక్కడ ఆస్తులు అనవసరమనిపించింది. తీసేశాను. గత నెలలో అగ్రిమెంట్ కుదిరినప్పుడు సగం డబ్బు 40 వేలు ముట్టింది. రిజిస్ట్రేషన్ ఈ నెలలో నిన్న పెట్టాం. అలాగే నిన్న వెళ్ళి అది ఈ రోజు పూర్తి చేయించాను. మిగతా డబ్బు ముట్టింది, నలభై వేలు. కాని అప్పటికి బాగా ఆలస్యం జరిగింది. బ్యాంకులు మూసేశారు. డ్రాఫ్టు తీసే వీలు కలుగలేదు. అందువల్ల డబ్బుతో అలాగే బయల్దేరి వచ్చేశాను."

"ఆల్ రైట్" లాల్ లేచాడు. "ఒకసారి మీ ఫోన్‌ని ఉపయోగిస్తాను."

సుధాకర్ లేచి ఫోన్ చూపించాడు. లాల్ ఎత్తి డయల్ చేశాడు.

"హాలో, కంట్రోల్ రూం....? హాలో, డిసీజ్ లాల్ స్పీకింగ్. క్రైంబ్రాంచ్‌కి, సరూర్‌నగర్ స్టేషన్‌కీ తక్షణం ఈ వార్త చేరవేయండి: దోపిడీ జరిగింది. విజయవాడ హైవేమీద, హాయత్ నగర్ దగ్గర. ఫిర్యాది అచ్యుతరావు కార్లో వస్తోండగా దొంగ ఆపి బ్రీఫ్‌కేసు దోచుకున్నాడు. నలభై వేలు. పదింబావుకి జరిగింది. ఆనవాలు: వయసు ముప్ఫై, బ్లూ షర్టు, తెల్ల ప్యాంటు. కుడిచేతికి ఉంగరం, జేబులో నల్లగళ్ళ కర్చీఫ్. కత్తి కూడా వుంటుంది.... భాష యాసగా వుంటుంది,

తెలుగు. బొంగురు స్వరం. డ్రైవింగ్ కూడా వచ్చు. రికార్డ్సు తిరిగేయమనండి. ఫిర్యాది కారు తెల్ల అంబాసిడర్. ఫిర్యాది ఇంటికి వెంటనే ఒక వేలిముద్రల మనిషి చేరుకోవాలి. అడ్రసు చెప్తున్నాను, వ్రాసుకోండి...."

## 3

మోటార్ సైకిల్ ఒకటి రివ్వున దూసుకొచ్చి గేటు లోంచి తప్పున ఆగింది.

దానిమీద ముగ్గురూ క్రిందకి దూకేశారు. కృష్ణన్ గబగబా నడిచివస్తూ, "హలో ఫ్రెండ్స్! వెరీ బాడ్ నైట్ దిస్ మిడ్ నైట్" అంటూ చిరాకు వ్యక్తం చేశాడు.

సార్జెంట్ నవీన్, వేలిముద్రల ఎక్స్పర్టు స్వామి అతని వెనుక వచ్చారు.

"ముగ్గురూ ఏకంగా బైక్ మీద వచ్చేశారేమిటి?" లాల్ అడిగాడు నవ్వుతూ.

"పొదుపు చేస్తున్నాం, ఫ్రెండ్స్!" కృష్ణన్ చెప్పాడు గొప్పగా.

"వెరీ లాయల్ ఫోర్స్, అవర్ పోలీస్ ఫోర్స్" జాన్ కామెంట్ చేశాడు.

"థాంక్స్. అసలేమిటి గొడవ?" కృష్ణన్ అడిగాడు సిగరెట్ ముట్టిస్తూ.

లాల్ గబగబా అంతా చెప్పాడు. కృష్ణన్ శ్రద్ధగా విని, స్వామికి సూచనలిచ్చాడు: "స్వామి, మీరు కారు మీద వేలిముద్రలు చూడండి—ఆ కారు అంబాసిడర్. డోర్స్ స్టీరింగ్ వీల్, డాష్ బోర్డు జాగ్రత్తగా పరిశీలించండి. తప్పక వుంటాయి.

"నవీన్, సుబ్బిక్కడే స్వామితో వుండు. పనయ్యాక మీరిద్దరూ బైక్ మీద వెళ్ళిపోండి. నేను వాళ్ళతో హాయత్ నగర్ వెళ్తాను...."

"కానీ, ఇన్స్పెక్టర్" రావ్ అన్నాడు చటుక్కున, "ఆ స్థలాన్ని నేను గుర్తించలేను. కారెక్కడ ఆపానో తెలీదు!"

"ముందు అక్కడికి వెళ్దాం. మీరు ఉజ్జాయింపుగా సూచనలివ్వండి. మేం పనిగట్టేస్తాం" అన్నాడు కృష్ణన్, బైక్‌లోంచి 5—సెల్ టార్చి తీసి డిటెక్టివ్‌ల కారువైపు నడుస్తూ "కమాన్ ఫ్రెండ్స్, లెటెజ్ గో!"

డిటెక్టివ్‌లూ, రావ్, సుధాకర్‌లు కదిలారు.

సరూర్ నగర్ స్టేషన్ ముందు కారాపి కృష్ణన్ దిగి వెళ్ళాడు. స్టేషన్ ముందొక లారీ లోడ్‌తో ఆగి వుంది. కృష్ణన్‌ని చూసి డ్యూటీలో వున్న సెంట్రీ సెల్యూట్ చేశాడు.

"ఇన్స్పెక్టర్ ఏడి?" అడిగాడు కృష్ణన్.

"బయటికెళ్ళాడు, సార్. హాయత్ నగర్."

"హాయత్ నగర్‌కా?"

"అవును సార్. ఒక సర్దార్జీ వచ్చి రిపోర్టిచ్చాడు, ఆ లారీ డ్రైవర్. హాయత్ నగర్ దగ్గర కార్లో ఒక మనిషి పడివున్నాడట—ఇన్స్పెక్టర్ వెంటనే వెళ్ళారు."

కృష్ణన్‌కు ఆత్రుత పెరిగింది. "ఇందాక మీకేదేనా మెసేజ్ వచ్చిందా?"

"వచ్చింది, సార్. హాయత్ నగర్ దగ్గర కారు దోపిడీ జరిగిందని. కానీ అంతకుముందే సార్ వెళ్ళిపోయారు, సర్దార్జీతో."

కృష్ణన్ వెనక్కి ఉరికివచ్చి కారెక్కాడు.

"లెటెజ్ గో! ఇప్పుడు మన పని సులువైంది!"

"ఏమైంది, కృష్ణన్?" లాల్ అడిగాడు.

కృష్ణన్ చకచకా చెప్పేశాడు. జాన్ స్పీడు ఇంకా పెంచి డ్రైవ్ చెయ్యసాగాడు.

"వెరీ వెల్! సన్మానించాలి ఆ సర్దార్జీని."

కారు ఇంకా సరూర్ నగర్ దాటకముందే ఒక మోటార్ సైకిల్ ఎదురొస్తూ కన్పించింది. కృష్ణన్ ముందుకు చూసి, ఉలికిపడి అరిచాడు. "జాన్, కారాపేయండి!"

సడన్ బ్రేకుపడి కారు తూలింది. కృష్ణన్ డోరు తెరిచి బయటకు దూకేశాడు. రోడ్డు మధ్య నిలబడి చెయ్యూపుతూ ఆ మోటారుసైకిల్ని ఆపాడు.

దానిమీద ఇన్స్పెక్టర్, వెనుక ఒక సర్దార్జీ వున్నారు.

"హాలో కృష్ణన్, వాట్ హేపెండ్?" అరిచాడు ఇన్స్పెక్టర్.

"మనందరికీ ఒక్కటే జరిగింది! మీరొచ్చేస్తున్నారేమిటి?"

"ఈ కర్తార్ సింగ్ వచ్చి రిపోర్టు ఇచ్చాడు—హాయత్ నగరు దగ్గర అంబాసిడరులో ఎవరో పడివున్నారని. ఆక్సిడెంట్ కాదు. ఏమిటో చూద్దామని వెళ్ళాను. కానీ అక్కడ ఆ కారూ లేదు, మనిషీ లేడు!"

"ఆ కారతను ఈ కార్లోనే వున్నాడు, మిస్టర్ నాథ్. ఆయన్నెవరో దోచుకొని పారిపోయాడట. నలభైవేలు. అన్ని పాట్రోలింగ్ స్క్వాడ్స్‌కి దొంగ ఆనవాలు మెసేజ్ వెళ్ళింది. మీరు వెనక్కి పదండి, ఆ స్థలాన్ని ఇప్పుడు పరిశీలించాలి."

"అలాగా .... అయితే పదండి. కార్లో ఇంకెవ రున్నారు?"

"లాల్ అండ్ జాన్."

కృష్ణన్ వెనక్కివచ్చి కారెక్కాడు. నాథ్ బైక్ ముందు వెళ్ళాక, జాన్ వెనుక పోనిచ్చాడు.

హాయత్ నగర్ దాటాక ఒక పెట్రోలు బంకుకి సుమారు కిలోమీటరు దూరంలో, నిర్మానుష్యంగా, చీకటిగా వున్న ప్రదేశంలో రోడ్డుమీద బైక్ ఆపి దిగాడు ఇన్స్పెక్టర్ నాథ్.

జాన్ కూడా కారాపాడు. అందరూ దిగారు. కృష్ణన్ టార్చి వెల్గించాడు.

"ఇక్కడేనా?"

"అక్కడే!" అన్నాడు నాథ్.

"ఏమిటి గుర్తు?"

"ఆ మైలురాయి. సర్దార్జీ గుర్తుపెట్టుకుని మరీ వచ్చాడు."

"అవును సాబ్. సరిగ్గా ఇక్కడే!" చెప్పాడు సర్దార్జీ హిందీలో.

లాల్ రావ్ వైపు తిరిగాడు. "వెల్?"

"ఇక్కడే కావచ్చు....గుర్తులేదు నాకు."

"ఆల్ రైట్, మీరిద్దరు ఇక్కడే కార్లో వుండండి" లాల్ ముందుకి కదిలాడు.

కృష్ణన్ అన్నాడు, "కానీ లాల్, అతనెక్కడ దాగి వుంటాడు? ఈ చుట్టుప్రక్కల సమీపంలో చెట్లు లేవు, ఏమీ లేవు."

"రోడ్డు దిగువ పొంచి వుండొచ్చు. గుంటలు చాలా వున్నాయి....పదండి చూద్దాం!"

"రోడ్డు కివతలా? అవతలా?" జాన్ అన్నాడు.

"ముందు ఇవతల చూద్దాం, రావ్ వస్తున్నప్పుడు ఎడమవైపు. సిటీకి వచ్చే వాహనాన్ని ఆపాలనుకొంటే దొంగ ఎడమవైపే వుంటాడు. కమాన్."

కృష్ణన్ చేతిలో టార్చి వెలుతురు విశాలంగా పర్చుకుంది. చిన్న చిన్న పిచ్చిమొక్కలు, రాళ్ళు, గుంటలు అనేకంగా కన్పిస్తున్నాయి. నల్గురూ చూసుకొంటూ జాగ్రత్తగా దిగి వెళ్ళసాగారు. కృష్ణన్ అన్నివైపులా టార్చి వేస్తూ నిశితంగా చూస్తున్నాడు. అలా పదిగజాలు వెళ్ళాక సిగరెట్ పీకలు కనిపించాయి.

"దటీజ్ రైట్! మన ఫ్రెండ్ ఇక్కడే కూర్చున్నాడు."

కర్చీఫ్‌లో ఆ పీకల్ని ఏరి చుట్టాడు కృష్ణన్. మొత్తం మూడు పీకలు. అక్కడే అగ్గిపుల్లలు కూడా కన్పించాయి. అయితే అవి పీకల సంఖ్యకి రెట్టింపు వున్నాయి. ఇంకా ఎక్కువే వుంటాయి.

"వెల్ పుల్ల గీసినప్పుడల్లా గాలికి ఆరిపోతోందేమో!" లాల్ అన్నాడు.

"కాదు, గాలి ఎక్కువేం లేదు. ఈ గాల్లో పుల్ల అసాంతం మండిస్తాను చూడండి—"

"అక్కర్లేదు, ఆగండి! ఇందులో కొన్ని పుల్లలు గీసి లేవు...."

కృష్ణన్ చూశాడు, "అవును, పెట్టె తొడుగులోంచి వూడిపడిపోయిందేమో?"

"టార్చి అలా వేయండి.... అదుగో, అదుగో, కమాన్ కృష్ణన్. పుల్లలు ఇంకా అలా వెళ్తున్నాయి—"

నల్గురూ ప్రతి అడుక్కీ ఒక పుల్ల చొప్పున పడివున్న

మార్గాన్ని అనుసరిస్తూ ఇంకా క్రిందికి వెళ్ళారు.

"ఆగండి, అక్కడేదో కన్పిస్తోంది...." కృష్ణన్ అన్నాడు, టార్చి దూరంగా వేస్తూ, చివరి పుల్ల దగ్గర ఆగిపోయి. అక్కడేదో వస్తువు మెరుస్తూ కన్పిస్తోంది. అది ఒక రాయి నానుకొని ఆగిపోయినట్టుంది....

"అది గాజు పెంకు" జాన్ అన్నాడు.

"చూస్తాను, మీ కర్చిఫ్ ఇలా ఇవ్వండి" కర్చిఫ్ తీసుకొని కృష్ణన్, మోకాళ్ళమీద చిన్నగా ప్రాకుతూ జరగసాగాడు. ఆ వస్తువు దగ్గర చేరుకొని, అటూ ఇటూ టార్చి వేసి చూస్తూ, "బాటిల్" అన్నాడు.

దాన్ని కర్చిఫ్‌తో ఎత్తి పట్టుకొని, "పెన్సిలిన్ ఇంజెక్షన్. ఈ బాటిల్ మీద లేబిల్ కూడా వుంది" అంటూ అందరికీ చూపించి, రబ్బరు బిరడా లాగి వాసన చూడబోయాడు.

"జాగ్రత్త, వాసన గట్టిగా పీల్చకండి!" లాల్ హెచ్చరించాడు.

"దేనికి?"

"మూర్ఛపోతారు, అది క్లోరోఫాం కావచ్చు?"

కృష్ణన్ దూరంగా వాసనచూసి, "అవును, ఇది క్లోరోఫామే," అన్నాడు గట్టిగా.

"ఆల్ రైట్ మీరిక వచ్చేయండి!"

కృష్ణన్ ఉత్సాహంగా పైకి వస్తూ అన్నాడు, "ఇప్పుడర్థమైంది! మన ఫ్రెండ్ అక్కడ కూర్చుని సిగరెట్ కాలుస్తూ పొరపాటున దీన్ని జారవిడుచుకున్నాడు. అది దొర్లుకుంటూ వచ్చి ఇక్కడ చిక్కుకుంది. దాని కోసం పుల్లను గీస్తూ అక్కడిదాకా వచ్చాడు. ఆపైన ఆశ వదులుకున్నాడు. బహుశ పుల్లలయిపోయి వుంటాయి—ఊఁహు,

కాదు—అగ్గిపెట్టె ఇక్కడ లేదు. వెనుక మోటార్ శబ్దం విని పరిగెత్తి వుంటాడు. ఈ బాటిల్ మనకు దొరికింది!"

అంతా పైకి వచ్చి రోడ్డుమీదకు చేరుకున్నారు.

"ఏం దొరికాయి?" సుధాకర్ అడిగాడు కుతూహలంగా.

"సిగరెట్ పీకలు, అగ్గిపుల్లలు, క్లోరోఫాం సీసా" చెప్పాడు లాల్, సర్దార్జీవైపు తిరుగుతూ. "ఇప్పుడు చెప్పు. సర్దార్జీ. నువ్వేలా చూశావు?"

కర్తార్‌సింగ్ గొంతు సరిచేసుకున్నాడు, "నేనిలా సిటీకి వస్తున్నాను, సాబ్. ఇక్కడే ఆ కారుని చూశాను. ట్రబుల్ ఇస్తోందేమో చూద్దామని బండాపి దిగాను. కార్లో ఒక్కడే వున్నాడు ముందుసీట్లో పడుకొని. నిద్ర పోతున్నాడనుకొని పిల్చాను, కానీ లేవలేదు. అనుమానం వేసి డోర్ తెరిచి తట్టాను. అప్పుడు తెలిసింది, అతడు తెలివిలో లేడని. ఏం జరిగిందో అర్థం కాలేదు. ఆక్సిడెంట్ జరగలేదు. కార్లో సామాను లేదు. దారిదోపిడీ జరిగిందేమోనని అనుమానం వేసింది. వెంటనే సిటీలోకెళ్ళి పోలీసులకి చెప్పాను. కాని మేం వచ్చి చూస్తే ఇక్కడా కారు లేదు, సాబ్. లేచి తోలుకెళ్ళి పోయాడు."

"నీ వెనుకే వెళ్ళాడు, అందుకే మీరొస్తున్నప్పుడు ఎదురు పడలేదు" అన్నాడు లాల్, "సరే, నువ్వెక్కణ్నించి సిటీకెళ్తున్నపుడు దార్లో ఎవరైనా పోతూ కన్పించాడా?"

"లేదు, సాబ్. ఎవరూ కన్పించలేదు."

"వాహనాలు—సైకిలు.... స్కూటరు...."

"లేదు, సాబ్."

కృష్ణన్ అన్నాడు: "దొంగకి స్వంత వాహనం వున్నట్లు లేదు. ఎవరినైనా లిఫ్ట్ అడిగి వుండాలి. కానీ ఇంతరాత్రి, ఇలా దార్లో లిఫ్ట్ ఇవ్వరు. ఆగంతకుల్ని ఎక్కించుకో డానికి వెనుకాడుతారు. ఆ పెట్రోల్ బంకు వరకూ నడిచి వుండాలి—వచ్చే వాహనాల్ని, పోయే వాహనాల్ని దృష్టిలో పడకుండా తప్పించుకొంటూ. అలా బంకుదగ్గర చేరుకొని ఏ ట్రక్కులోనో లిఫ్ట్ సంపాదించి వుండొచ్చు"

"నో, అక్కడ అనుమానిస్తారు. గుర్తు పెట్టుకుంటారు. అలా చెయ్యడు."

"మరి?"

లాల్ కాస్సేపాగి అన్నాడు, "కృష్ణన్ దొంగదాడి జరిపి దోచుకోవడం; కారుని రోడ్డువారగా ఆపడం; కర్తార్ సింగ్ వచ్చి వెళ్ళడం—అంతా పదిహేను నిమిషాల వ్యవధిలో—రావ్ తిరిగి కళ్ళు తెరిచేలోపులో జరిగి పోయాయి. కారు రోడ్డువారగా ఆపాక దొంగ సర్దార్జీ లారీ రావడం చూసి వుంటే వెంటనే రోడ్డు దిగి దాక్కుంటాడు. అప్పుడు సర్దార్జీ బండాపి మంచీచెడ్డా చూస్తోంటే దొంగ ఏం చేస్తాడనుకున్నారు? అతనికో ఆలోచన మెరుస్తుంది. ఏది? లిఫ్ట్ సమస్య. అప్పుడు ఎం చక్కా ఆగివున్న లారీ వెనుక లోడ్ మీద ఎక్కి పడు కొని సిటీకి చేరుకొంటాడు. పోలీస్ స్టేషన్ ముందు దర్జాగా దిగి వెళ్ళిపోతాడు."

"అంత ధైర్యం చేస్తాడా?"

"ధైర్యం ప్రసక్తే లేదు. సర్దార్జీ పోలీసుల దగ్గరికే వెళ్తాడని అప్పుడతనికి తెలీదు."

"అయితే అలా జరిగిందంటారా?"

"అలాగే జరిగి వుండాలి" అన్నాడు లాల్, "అయినా

మా అనుమాన నివృత్తికోసం బంక్స్ దగ్గరా, మీకు తోచిన ప్రతిచోటా దర్యాప్తు చేయండి. నార్థ్ స్టేషన్ దగ్గర మాత్రం కాస్త గట్టిగా చెయ్యండి. అక్కడ అవ కాశం చాలా వుంది. సర్దార్జీ వేలిముద్రలు కూడా తీసు కోండి. అతను కారుని ముట్టుకున్నాడు. పార్కింగ్ చేసే టప్పుడు గుర్తించడానికి పనికి వస్తాయి. ఎక్కడైనా లీడ్ దొరికితే వదలకండి. దాన్ని పట్టుకొని సాగిపోండి. వీలయినంత త్వరగా, వేగంగా .... సిటీలో ఆపరేట్ చేస్తున్న దొంగల ఘట్టు పూర్వోత్తరాలన్నీ మీకు తెలుసు....”

## 4

ఉదయం సరిగ్గా పది గంటలకి కృష్ణన్ ఫోన్ చేశాడు.

“లాల్! రాత్రి మీరు చెప్పినట్టు చేశాం. లారీ వెనుక బాడీమీద కొన్ని వేలిముద్రలు దొరికాయి. వాటిలో కొన్ని బాటిల్ మీద వేలిముద్రలతో కలుస్తున్నాయి— క్లోరోఫాం బాటిల్. అయితే రావ్ కారుమీద—లెఫ్ట్ డోర్, స్టీరింగ్ వీల్, డాష్‌బోర్డు మీద అలాంటి వేలి ముద్రలు లేవు. ఇవతలి డోర్ మీద, బానెట్ మీదా సర్దార్జీవి, రావ్‌వీ వున్నాయి. దొంగ వాటిని తుడిచేసి వుంటాడు.”

“ఐసీ....”

“మిస్టర్ లాల్, మీరు చెప్పింది నిజమే అయింది. వేలిముద్రల్నిబట్టి దొంగ ఆ లారీ మీదెక్కి వచ్చాడు. కానీ అక్కడతడు దిగినప్పుడు ఎవరూ చూడ్లేదు. సమీ పంలో యే ఇరానీ హోటల్ లోనూ అతను వెళ్ళలేదు. ఆటోలో ఎక్కినట్లు ఎవరూ చూడ్లేదు. లారీ దిగి యెటు

మాయమయ్యాడో ఇంతవరకు లీడ్ దొరకలేదు. ఇక - ఈ వేలిముద్రలు రికార్డ్సులో ఇంకా కలవడంలేదు. డ్రైవింగ్ వచ్చిన దొంగల ఫైల్స్ అన్నీ తిరగవేస్తున్నాం.... నమ్మకం తక్కువ. మాకు తెలిసిన దొంగలు ఎవరు యే ప్రాంతాల్లో ఆపరేట్ చేస్తారో చాలామంది వున్నారు గానీ, ఎవరితోనూ యీ వేలిముద్రలు కలవడంలేదు. కనుక, యెవరినీ కస్టడిలోకి తీసుకొని ప్రయోజనంలేదు. ఇప్పుడేమిటి లీడ్?"

లాల్ ఆలోచిస్తూ అన్నాడు, "క్రొత్త దొంగ కావచ్చు. దొంగని లారీ ఆగిన చోట, సరూర్ నగర్ పోలీస్ స్టేషన్ ముందునుంచి ట్రేస్ చెయ్యాలి."

"శక్తివంచన లేకుండా చేశాం—జీరో రిజల్ట్."

"ఓ.హ్హో క్లోరోఫాంని ట్రేస్ చెయ్యండి, కృష్ణన్! ఏమి టంత మందకొడితనం? దొంగకి అదెక్కడిది? కొన్నాడా? అడిగి తెచ్చాడా? ఆ సీసా మీద లేబిల్ వుందన్నారు. కంపెనీ పేరు చూడండి. బ్యాచ్ నెంబరు, తయారైన తేది చూడండి. అప్పుడది ఏ స్టాకిస్టునుంచి ఏ రిటెయిలర్ కి చేరిందో, ఆ రిటెయిలర్ నుంచు ఏ కస్టమర్—డాక్టర్ కి అందిందో, అక్కడనించి పరాయి చేతుల్లో ఎలా, ఏ పరిస్థితుల్లో పడిందో దర్యాప్తు చెయ్యండి, దట్సాల్!"

లాల్ ఫోన్ పెట్టేసి జాన్ వైపు చూశాడు.

"కృష్ణన్ ని చంపావు, బ్రదర్. అది సాధ్యమా?" జాన్ అన్నాడు.

"ఐ డోంటో్న. అన్ని రాళ్ళూ విసిరి చూద్దాం. ఏదైనా తగలచ్చు."

మళ్ళీ ఫోన్ మ్రోగడంతో లాల్ రిసీవరు ఎత్తాడు: "యస్, హలో....ఎవరది?"

"నేను సుధాకర్‌ని, మిస్టర్ లాల్."

"ఓహో, ఏమిటి సంగతి? అన్నయ్య క్షేమమేనా?"

"క్షేమమే. లాల్, రాత్రి నేనొక సంగతి చెప్పడం పూర్తిగా మరిచాను."

"వెల్, ఏమిటది?"

"రాత్రి నాకెవరో ఫోన్ చేశాడు."

"అయితే?"

"ఫోన్ చేసి అన్నయ్య ఎప్పుడొస్తాడని అడిగాడు."

లాల్ ముఖం చిట్లించాడు, "ఎవరతను?"

"తెలీదు. పేరడిగినా చెప్పలేదు. కాని అతనిది బొంగురు గొంతు. అప్పుడు ఎనిమిదవుతోంది; ఫోన్ చేసి అన్నయ్యను గురించి అడిగాడు. పదిగంటలకి వస్తాడని చెప్పాను."

"అది మీకెలా తెలుసు?"

"అన్నయ్య నిన్న మధ్యాహ్నం ట్రంకాల్ చేసి చెప్పాడు, విజయవాడనుంచి. నాలుగ్గంటలకి బయల్దేరి పది గంటలకు ఇక్కడ వుంటానని. అదే మాట అతనితో చెప్పాను. థాంక్స్ చెప్పి పెట్టేశాడు."

"ఈ సంగతి మీ అన్నయ్యతో చెప్పారా?"

"చెప్పాను."

"ఏమన్నాడు?"

"ఆ మనిషి ఎవరో తెలీదన్నాడు. ఎవరై వుంటాడో వూహించలేనన్నాడు. నాకూ అతనెవరో యిప్పటివరకూ తెలీదు. కానీ యిప్పుడే నాకో అనుమానం వచ్చింది—

"తెలుస్తున్న విషయాల్ని బట్టి కొంత వూహించగలుగుతున్నాను. అతడు నాకు తెలుసుననిపిస్తోంది....అతడే అన్నయ్యని దోచుకున్నాడనిపిస్తోంది....

"నాకు తెలిసిన ఒక రౌడీ వున్నాడు, వాకర్ టౌన్‌లో. వాడి గొంతు కూడా బొంగురుగానే వుంటుంది. కుడిచేతికి ఉంగరం కూడా వుంటుంది. పేరు తెలీదు. నా ఫ్రెండ్ యింటికి పోయేదార్లో వాణ్ని చాలాసార్లు చూశాను. వాడు నన్ను ఆసక్తిగా గమనించడం కూడా చూశాను. ఒకవేళ వాడే అన్ని విషయాలు తెలుసుకొని అన్నయ్యని దోచుకున్నాడేమో? మీరేమంటారు?"

లాల్ తటపటాయించాడు. వెంటనే ఏమీ చెప్ప లేకపోయాడు. "విచిత్రంగా వుంది!" అన్నాడు కాస్సేపాగి.

"మీరు వెంటనే వాడింటికి వెళ్ళండి, లాల్! వాడే దొంగని నా గట్టి నమ్మకం. ఇంట్లోనే డబ్బుండొచ్చు. నాలుగు తగిలించి లాక్కోండి, వాణ్ని అరెస్టు చెయ్యండి!"

"అడ్రసు యేమిటి?" అన్నాడు లాల్, ఇంకా నిర్ణయానికి రాలేక.

సుధాకర్ చెప్పాడు.

"సరే, అలాగే చేసిచూద్దాం" అన్నాడు లాల్ చివరకి. "మేమిప్పుడు రికార్డ్సులో వున్న దొంగల్ని వేటాడ్డం లేదు, కొత్త దొంగల్ని. ఇతను కొత్త దొంగ కావచ్చా?"

"కావచ్చు....ముందు పట్టుకోండి మీరు!"

లాల్ ఫోన్ పెట్టేసి జాన్‌కు విషయం చెప్పాడు.

"వెల్! ఈ స్టోన్‌ని కూడా విసిరిచూద్దాం!" అన్నాడు జాన్ ఉత్సాహంగా లేస్తూ.

పావుగంటలో యిద్దరూ వాకర్‌టౌన్‌లో ఆ యింటి

ముందు కారు దిగారు.

వీధి తలుపు సగం తెరిచి వుంది. లోపల వాకిట్లో మోటార్ సైకిల్ వుంది. ముందు గదిలో టేబిల్ దగ్గర అటు తిరిగి కూర్చున్న మనిషి కన్పించాడు.

డిటెక్టివ్‌లు చప్పుడు కాకుండా లోపలికెళ్ళి ఆ గదిలో అడుగుపెట్టారు. ఆ మనిషి తిరిగి చూడలేదు. పెదవుల్ని వేగంగా కదిలిస్తూ, నోట్లు చక చకా లెక్క బెడ్తూ బిజీగా వున్నాడు.

"జీతం డబ్బులా?" వెనకనుంచి లాల్ అడిగాడు మృదువుగా, మర్యాదగా.

అతను అదిరిపడి వెనక్కి తిరిగిచూశాడు. వెంటనే నోట్లు సొరుగులో తోసి, కత్తి అందుకున్నాడు. దాంతో మెరుపులా మీదకి దూకబోయాడు. జాన్ కాలు జాడించి సునాయాసంగా ఆ కత్తి యెగరగొట్టాడు. రెండు చేతులూ బిగించి గడ్డంకింద కొట్టి కుర్చీలో కుదేశాడు.

"ఇవాళ పదిహేనో తారీకు—జీతం ఎలా వచ్చింది నీకు?" అన్నాడు అతని రెండు చెవులూ పట్టుకొని.

అతను ఉక్కిరి బిక్కిరవుతున్నాడు. "నా చెవు లొదులు!" అన్నాడు.

"వదలను. మిగతా డబ్బెక్కడ?"

"మిగతా డబ్బా....? యేమిటి మీర నేది? యెవరు మీరు?"

"పోలీసులం....అడిగింది చెప్పు! మిగతా డబ్బె క్కడ?"

లాల్ దగ్గరికెళ్ళి అతన్ని జాన్ నుండి విడిపించాడు.

"గెటవుట్! గెటవుట్ యూ...." అతను లాల్

మీద పడి వెనక్కి నెట్టేశాడు.

జాన్ వెనుకనుంచి మెడమీద ఒక్కటిచ్చాడు.

"ఇటు తిరుగు! డబ్బెక్కడ? రాత్రి దోచుకొన్న డబ్బు!"

"ఓహ్, ఏమిటిది! నే నెప్పుడు దోచుకున్నాను?"

లాల్ సొరుగు లాగి నోట్ల కట్ట తీశాడు. "ఇదెక్కడిది?"

"సంపాదించాను. నా సొంత డబ్బు."

"రాత్రి నువ్వు దారి దోపిడీ చేశావు. నలభై వేలు దోచుకున్నావు. బుకాయించకు. ముందునుంచీ పథకం ప్రకారం చేశావా పని. కమాన్ మిస్టర్, చెప్పు—"

"నా పేరు నిర్దోష్."

"ఓహ్, కానీ నువ్వు నిర్దోషివి కాలేవు."

"నేను నిర్దోషిని! నాకేమీ తెలీదు, సంతోష్! త్వరగా రా!"

"అతనెవరు? ఇంకెవరున్నారు లోపల?" జాన్ అడిగాడు వెనక్కి చూస్తూ.

"సంతోష్, త్వరగా రా!" మళ్ళీ అర్చాడతను.

"వెల్, నువ్వితన్ని చూడు లాల్. నేను లోపలి పార్టీనీ చూస్తాను" జాన్ అన్నాడు లోపలికి కదుల్తూ.

అవతల మరొక గది వుంది. అందులో ఎవరూ లేదు. అక్కడనించి వెనుక వసారాలో కెళ్ళాడు. బాత్ రూంలో నీళ్ళ చప్పుడు విన్పించింది. గబ గబా అక్కడ వెళ్ళి ఆగాడు. తలుపుమీద కొట్టాడు చిన్నగా.

"ఏమిటి నిర్దోష్?" అంది లోపలి గొంతు.

"బయటికి రా!"

"యెవరు, ఎవరది?" గద్దించింది లోపలి గొంతు.

"ముందు బయటికి రా!"

"ఎవరున్నవ్వు, మా యింట్లోకి వచ్చి దబాయిస్తు న్నావ్?" కోపంగా అర్చిందా గొంతు.

"సరే, దబాయించను. ముద్దు చేస్తాను...."

"వెళ్ళిపో యిక్కడ్నించి, నేను స్నానం చేస్తు న్నాను!"

జాన్ తలుపు కంతలోంచి లోపలికిచూశాడు. లోపల ఒక యువకుడు అండర్‌వియర్ మీద నిలబడి బకెట్‌లో నీళ్ళు నెత్తిమీద గుమ్మరించుకొంటున్నాడు.

జాన్ పిల్చాడు ముద్దుగా:

"బాబూ సంతోష్! ఇట్రావోడమ్మా ఇటూ!"

అతను ఠపీమని బకెట్ ఎత్తేసి, వెనక్కి తిరిగి చూసి, కోపంతో రెచ్చిపోయి గట్టిగా తిడుతూ, రెండంగల్లో వచ్చి విసురుగా తలుపు తీసి కాలెత్తాడు.

జాన్ చటుక్కున ప్రక్కకు తప్పుకొని ఆ కాలు పట్టి బయటికి లాగేశాడు.

అతను ఒంటికాలుమీద మూడు పల్టీలు కొట్టి, దూరంగా వెళ్ళి మట్టిలో బోర్లాపడ్డాడు. అలాగే వుండి పోయాడు.

జాన్ పరుగెత్తి చేరుకొనేంతలో చిరుతలా లేచి, పాదవాటి కాలెత్తి నడుము మీద తన్నాడు. జాన్ విసురుగా వెళ్ళి గోడ దగ్గరగా వున్న కుడితి కుండమీద పడ్డాడు. కుండ పగిలి నడుమువరకూ తడిసిపోయాడు.

సంతోష్ కాళ్ళు జాడిస్తూ, రెచ్చిపోతూ జాన్‌ని సమీపించాడు.

"అబ్బెబ్బె నన్నలా ముట్టుకోకు! బట్టలేసుకో ముందు!" జాన్ గబుక్కున లేచి, రివాల్వర్ తీసి చూపిం

చాడు.

సంతోష్ ఆగిపోయి కలవరంగా చూశాడు.

"కమాన్ యూ థగ్! అలాగే యింట్లోకి నడువ్."

లోపలికి వచ్చిన అతన్ని చూసి లాల్ పక పకా నవ్వాడు.

"ఏమిటది! బట్టలేమయ్యాయి!"

"స్నానం చేస్తూ తొందరపడ్డాడు, అలాగే తీసుకొచ్చాను" అన్నాడు జాన్, బట్టలు చూసుకుంటూ. "బద్మాష్ కుడితిలో ముంచాడు!"

"నిర్దోష్ ఏమిటిది? ఎవరు వీళ్ళు?" సంతోష్ గద్దించాడు.

"పోలీసులట! మనం ఎవర్నో దోచుకున్నామట!"

"పోలీసులా....ఎవర్ని దోచుకున్నాం?"

లాల్ అన్నాడు జాన్‌తో, "ఓ.కే. నువ్వీళ్ళని చూస్తూండు. నే నింటిని సోదా చేస్తాను."

లోనికి కదిలి అయిదు నిముషాల్లో తిరిగి వచ్చాడు.

"వెల్, ఇక్కడేమీ లేదు. నువ్వెళ్ళి కృష్ణన్‌ని పిలువ్, పక్కింట్లో ఫోన్ వుండొచ్చు."

"మేం నిర్దోషులం! మాకేం తెలీదు!" అన్నాడు నిర్దోష్ కంగారుగా.

"మీ రెప్పుడైనా పోలీస్ ఫైల్స్‌లో ఎక్కరా?"

"మే మసలు వీధికే ఎక్కలేదెప్పుడూ!"

"అయితే రాత్రి బుద్ధిపుట్టి ఎక్కే ప్రయత్నం చేసి వుంటారు," అన్నాడు లాల్ సిగరెట్ ముట్టిస్తూ.

పావుగంటలో కృష్ణన్ వచ్చి వాళ్ళిద్దర్నీ తీసుకు వెళ్ళాడు.

# 5

డిటెక్టివ్‌లు లంచ్‌కి వెళ్ళి వచ్చాక కృష్ణన్‌నుంచి ఫోన్ వచ్చింది.

"మిస్టర్ లాల్, ఈ బఫూన్స్‌ని మీ రనవసరంగా హింసించి మా కప్పగించారు. పని పెంచారు. వీళ్ళు నిజంగా నిర్దోషులు. వీళ్ళకేం తెలీదు. వాళ్ళకు ఎలిబీ వుంది. వేలిముద్రలు కలవలేదు."

లాల్ నిరుత్సాహపడ్డాడు. "మేం పొరబడి వుంటాం. వాళ్ళేం చేస్తుంటారట?"

"అది చెప్పడానికి నిరాకరిస్తున్నారు. కేసులో వీళ్ళకి సంబంధం లేనప్పుడు వాళ్ళ వృత్తిని ప్రశ్నించే హక్కు మనకి లేదు."

"ఆల్ రైట్, వాళ్ళని వదిలేయండి. క్లోరోఫాం ఏమైంది?"

కృష్ణన్ యేదో గొణుక్కుంటూ ఫోన్ పెట్టేశాడు.

జాన్ భుజాలెగరేసి, సుధాకర్‌కు ఫోన్ చేశాడు.

"హలో, సుధాకర్! మీ అనుమానం తప్పయింది...."

అప్పుడే కాలింగ్ బెల్ విని జాన్ వెళ్ళి తలుపు తీశాడు.

"గుడ్ మార్నింగ్. ఏమైంది, దొంగ దొరికాడా?"

"ఇంకా లేదు....లోనికి రండి."

జాన్ అచ్యుతరావుని ఆహ్వానించాడు.

లాల్ అంటున్నాడు ఫోన్‌లో, "....సరే, ఎవరో యే అవసరం వుండో అలా ఫోన్ చేసినంత మాత్రాన దాన్ని యీ సంఘటనకి కనెక్ట్ చెయ్యడం గందరగోళాన్ని సృష్టించడమే అవుతుందేమో! ఫర్గెటిట్.

మర్చిపోండి....”

లాల్ ఫోన్ పెట్టేసి సిగరెట్ వెల్గించాడు.

“ఆ దొంగ యెవరో మీరు వూహించాలి!” అన్నాడు జాన్.

“బాగుంది, అది వూహిస్తే మిమ్మల్నెందుకు వేధిస్తాను?”

“సరైన విధానంలో వూహించాలి.”

“ఏం వూహించాలో నాకు తెలీదు.”

“మీ కిందులో ఒక కిటుకు చెప్పనా?”

“కిటుకా?”

“అవును. కిటుకు. దొంగ మీకు ఎడమవైపుగా వచ్చి ఎందుకు నిల్చున్నాడనుకున్నారు? అలా దూరంగా వుండి బెదిరిస్తే మీరు తప్పించుకొనే అవకాశాల్ని యెక్కువ చేసినట్లే కదా? మీరన్నట్లు అప్పుడు కారు స్టార్ట్ చేసి వెళ్ళిపోతే అతనేమీ చేయలేడు కదా?”

“అవును. అయితే....?”

“అది సహజంగా లేదు. అందులో ఉద్దేశం వుంది. దొంగ మీకు యెందుకో దూరంగా వుండాలని ప్రయత్నించాడు. మీరు దగ్గరగా చూడకూడదనుకున్నాడు. అందుకే లెఫ్ట్ డోర్ దగ్గర వుండి బెదిరించాడు. లేకపోతే మీ వైపు వచ్చి కత్తిని చెంపకో, మెడకో ఆనించి బెదిరించేవాడు. తప్పించుకునే అవకాశాల్ని మృగ్యం చేసేవాడు. అసలలాగే బెదిరించాలి. అది పద్ధతి. కానీ, అతను మీకు దగ్గరగా రాదల్చుకోలేదు. మీరు గుర్తుపడ్తారు. అతని ముఖాన్ని పూర్తిగా చూడలేకపోయినా, అంత దగ్గర్లో మానసికంగా అతను మీకు తెలిసినవాడే అని ఫీలింగ్ కలుగుతుంది....అతని యేద్నో

చేష్ట—హావభావాల్ని మీరు పసిగట్టేస్తారు....”

“అంటే.... అతను నాకు తెలిసినవాడా!”

“అంతే! రాత్రి మీరు చెప్పినప్పట్నించి నా కిదంతా అసహజంగా తోస్తోంది. దానికి సరైన ఎక్స్‌ప్లనేషన్ ఇప్పుడు కనుక్కోగలిగాను. ఇంతకుమించి మరేమీకాదు- అతడు మీకు తెలిసిన మనిషి! అందుకే దగ్గరికి రాలేదు.”

రావ్ అయోమయంగా చూశాడు.

లాల్ సిగరెట్ నలిపేసి జాన్ వైపు తిరిగాడు తృప్తిపడి.

“పార్ట్‌నర్, ఇట్స్ గుడ్ పాయింట్.”

జాన్ అన్నాడు, “ఓ.కే. అందువల్ల మనమిప్పుడు బయటి దొంగల్ని వదిలేసి స్వంత మనుషుల్ని పరిశీలించాలి. రావుగారూ, మీ మనుషుల గురించి చెప్పండి”

“నా మనుషులా....?”

“అవును, షాపులో మీ ఉద్యోగుల గురించి చెప్పండి ముందు... మీరు విజయవాడ వెళ్ళినట్లు వాళ్ళందరికీ తెలుసు. డబ్బుతో వస్తారని కూడా తెలుసు. ఒంటరిగా వస్తారనీ తెలుసు. అయితే దారికాయడానికి నిర్ణీత సమయం కోసం ఫోన్ చేయవల్సి వచ్చింది మీ తమ్ముడికి, గొంతుమార్చి....”

“లేదు! నా ఉద్యోగులలాటివాళ్ళు కారు! అలా చెయ్యరు!”

“ఇప్పుడెవర్నీ నమ్మకండి. డబ్బు దొరకాలి మీకు. మీ ఉద్యోగుల్లో ఎవరికైనా ఉంగరాలున్నాయా?”

“లేవు, మీరనవసరంగా అభాండం వేస్తున్నారు....”

“మీ రెవర్నీ నమ్మకండి. దొంగని మీరు హెడ్‌లైట్స్ వెలుగులో కొద్దిసేపు—కొన్ని క్షణాలు

చూశాయి. ఆతని ఒడ్డూ పొడుగూ, నడక మొదలైన వాటిని మీకు తెలిసిన వాళ్ళలో ఎవరికి అన్వయిస్తారో మీ వూహాశక్తికే వదిలేస్తున్నాను. బాగా ఆలోచించండి...."

రావ్ చాలాసేపు ఆలోచించి అడ్డంగా తలూపాడు. "నాకెవరూ తెలీదు!"

"అదే మీతో వచ్చిన చిక్కు!" జాన్ విసుక్కున్నాడు.

"ఆగండి, ఆగండి.... నాకేదో గుర్తొస్తోంది...."

"అలా చెప్పండి. ఏమిటది?"

"దొంగ నామీదపడి కొట్టినప్పుడు గుప్పున విస్కీ వాసన వేసింది!"

"నో వాసన చూసి తాగిన మూతిని చెప్పలేం!"

"ఇహ నన్నేం అడక్కండి! నాకేం తెలీదు.... అసలీ చిక్కులేవీ వుండేవి కావు, నా దగ్గరప్పుడు రివాల్వర్ వుంటే!"

"మీ దగ్గర రివాల్వరా!" లాల్ అన్నాడు చటుక్కున ముందుకు వంగి.

రావ్ ఆవేశంలోంచి తేరుకున్నాడు, "అవును. దాన్ని ఇంట్లోనే వదిలి వెళ్ళాను. కూడా పట్టుకెళ్ళి వుంటే ఆ దొంగ వెధవ ఆట సాగేదా!"

"వెల్, వెల్, మీ దగ్గర రివాల్వర్ ఎక్కడిది?"

"ఎప్పుడో కొన్నాను, గుర్తులేదు. అది ముప్ఫై ఏళ్ళ క్రిందటి తయారీ—ఏమంత అందంగా వుండదు. కండిషన్ కూడా అంతంత మాత్రమే...."

"మీకు దాని అవసరమేమిటి?"

రావ్ చిన్నగా నవ్వాడు, "అదొక ప్రెస్టేజ్

సింబల్, అంతే."

"అటువంటి ప్రెస్టేజ్ ఆరోగ్యదాయకం కాదు."

"ఏమిటి, నా రివాల్వర్ నాకే అపాయకరమా?"

"రివాల్వర్ విశ్వాసంగల కుక్కలా కాదు మిస్టర్ రావ్, మిమ్మల్ని కరవదన్న ధీమా వుండడానికీ, అందుకు ఇతరులెవరూ ఉసిగొల్పలేరని నమ్మడానికీ! అది జడ పదార్థం. ఇనుపముక్క. దానికి విశ్వాసం, విధేయత వంటి ఫీలింగ్స్ తెలీవు. యజమానికీ, బానిసకూ విచక్షణ ఎరుగదు. ఎలా చెప్తే అలా వింటుంది. ఎవరెలా ఉపయోగించుకుంటే అలా చేస్తుంది...."

"థాంక్స్. నా రివాల్వర్ అలా చెయ్యదు. నా అధీనంలోంచి వెళ్తేకదా నాకు అపాయం? అదలా వెళ్ళదు. నాకే ఎసరుపెట్టదు. మీరు నిశ్చింతగా వుండండి."

"వెనక్కి పోదాం....అయితే ఆ దొంగ గురించి మీకింకేమీ చెప్పలేరన్నమాట?"

"నిజంగా నాకేమీ తెలీదు, లాల్."

"సరే, ఈ పజిల్‌ని మీ తమ్ముడితో పంచుకోండి. బాగా వూహిస్తాడు."

"బాగా వూహిస్తాడా? మీకెలా తెలుసు?"

లాల్ నవ్వాడు, "తెలుసు. రాత్రి అతనితో మీరు నాకు ఫోన్ చేయించినప్పుడు దొంగ దుస్తుల ప్రస్తావన వచ్చింది. అప్పుడతను బ్లూ షర్టు, తెల్ల ప్యాంటులో వున్నాడని చెప్పాడు మీ తమ్ముడు. నీలిరంగుని చీకట్లో మీరెలా గుర్తించగల్గారని నేనడిగాను. అందుకతను చాలా తెలివిగా సమాధానం చెప్పాడు. మీరు హెడ్ లైట్స్ వెలుగులో చూసి వుండవచ్చని...."

"ఏమిటీ....! మిస్టర్ లాల్, ఏమిటి మీరన్నది?"

"పారపాటా?"

"మీకతను దుస్తుల గురించి చెప్పాడా?"

"అవును, ఏం?"

"వాడికి నేనప్పుడు దుస్తుల గురించి చెప్పనేలేదు!"

ఈసారి ఆశ్చర్యపోవడం లాల్ వంతయింది. "మరి....?"

"అప్పుడు దుస్తుల గురించి చెప్పనేలేదు! ముఖానికి గుడ్డ కట్టుకున్నాడనే చెప్పాను!"

"పొరబడుతున్నారు, చెప్పే వుంటారు...."

"లేదు! మీకే చెప్పాను! వాడికి చెప్పలేదసలు!"

"మరి అతను ఎలా చెప్పగల్గాడు ఫలానా రంగు దుస్తులని?"

"అదే ఆశ్చర్యంగా వుంది...."

లాల్ ఆరాటం అణచుకుంటూ జాన్‌ని చూశాడు. కళ్ళతో జాన్ చేసిన సౌజ్ఞని పురస్కరించుకొని, "సరే, మీరు వెళ్ళండి. అతనితో మరోసారి రూఢీ చేసుకోండి" అన్నాడు.

రావ్ వెళ్ళిపోయాక జాన్ సుధాకర్ కోసం ఫోన్ చేశాడు: ఇంటికీ, షాపుకీ? దొరకలేదు.

ఎనిమిది గంటలవరకూ అలా చేస్తూనే వున్నాడు.... అతను మాత్రం దొరకలేదు.

# 6

రాత్రి తొమ్మిది గంటలకి కృష్ణన్ ఫోన్ చేసి విజయగర్వంతో వికట్టాహాసం చేశాడు.

"లాల్, చచ్చీ చెడీ ఆ క్లోరోఫాం ట్రేస్ చేశాను! ఎవరనుకున్నారు?"

"ఎవరు?"

"సుధాకర్. అచ్యుతరావు తమ్ముడు, అఫ్‌కోర్స్."

లాల్ ముఖం పాలిపోయింది, "ఎలా ట్రేస్ చేశారు?"

"నా మోడస్ అపరెండిని గూర్చి చెప్పడానికి టైం లేదు, అతన్ని అరెస్టు చెయ్యాలి. మీరిచ్చిన సూచన ప్రకారం సాగిపోయాం....పంజా గుట్టలోని శాంతా నర్సింగ్ హోమ్‌లో ఒక కాంపౌడర్‌కి మూఫ్పైరూపాయలు ఆశపెట్టి దాన్ని సంపాయించాడు, నిన్న సాయంత్రం. అతన్ని అరెస్టు చెయ్యాలి, ఎక్కడున్నాడిప్పుడు?"

"అదే తెలియడంలేదు మధ్యాహ్నం నించి!"

"మేన్‌హాంట్‌కి కాల్ ఇవ్వనా?"

"అది మీ ఇష్టం. మేం కూడా అతన్ని పట్టుకునేందుకు ప్రయత్నిస్తాం" ఫోన్ పెట్టేసి వెనక్కి వాలిపోయాడు లాల్.

"పార్టనర్, ఆ క్లోరోఫాం సుధాకర్ తెచ్చాడు" చెప్పాడు చిన్నగా.

జాన్ నిట్టూర్చాడు "మొదట దుస్తులు గురించి నోరు జారాడు. ఇప్పుడు క్లోరోఫాం రుజువు చేసింది. తనకొచ్చినట్లు చెప్పిన ఆ ఫోన్ కాల్‌ని కావాలని కల్పించి చెప్పాడు, అనుమానం నిర్దోషిమీద మళ్ళించడానికి.... అతని చేతికి నువ్వు ఉంగరం గమనించావా? నేనూ గమనించలేదు. ఇప్పుడు దాన్ని తీసేసి వుంటాడు. కాని వేలి ముద్రలెక్కడికి పోతాయి?"

"కానీ జాన్, రావ్ మరో సంగతి చెప్పాడు—దొంగ తాగివున్నాడని."

"సుధాకర్ అప్పుడు తాగివుంటాడు, భయాన్ని అణచుకోడానికి."

"కాని రాత్రి నా కలాంటి చిహ్నాలు కనిపించలేదు అతనిలో."

"ఇంటికెళ్ళాక గబగబా ఓ నాలుగు కప్పుల కాఫీ పట్టించి వుంటాడు—వాసన అరికట్టడానికి. మనతో పాటు కూడా ఓసారి తాగాడు. భయాన్ని అణచుకోడానికి తాగాడంటే ఒళ్ళు తెలియకుండా తాగాడని కాదు, మామూలుగా తాగి వుంటాడు. డోస్ మించితే ఆ స్థితిలో అలాంటి పనికి పూనుకోవడం క్షేమం కాదని అతనికి తెలుసు."

జాన్ ఫోన్ ఎత్తి రావ్ షాపుకి డయల్ చేశాడు. కానీ అతను పలకలేదు. గుమాస్తా అన్నాడు, "ఆయన ఎనిమిది గంటలకే పోయారు ఇంటికి. నన్ను మూసేసి రమ్మన్నారు తొమ్మిదింటికి. నేను మూసేసి పోతున్నాను ఆయనింటికి."

"సుధాకర్ ఇంకా రాలేదా?"

"సుధాకర్ ఇంకా రాలేదు, ఇహ రాడు."

"రాడా? ఎందుకు రాడు?"

"ఎందుకు రాడంటే మేమిప్పుడు షాపు మూసేస్తున్నాం గనుక!"

జాన్ విసురుగా ఫోన్ పెట్టేశాడు.

కానీ వెంటనే నెమ్మది పడుతూ రావ్ ఇంటికి డయల్ చేశాడు. రెస్పాన్స్ లేదు. "ఈయనెక్కడికి కెళ్ళాడో!" అన్నాడు వెనక్కి వాలిపోతూ.

"ఇంట్లో లేడా?" అన్నాడు లాల్ కళ్ళు తెరిచి.

అప్పుడే ఫోన్ మ్రోగింది హఠాత్తుగా. లాల్ అందుకున్నాడు.

"మిసెస్....మిస్టర్ లాల్!" అర్చింది అవతలి గొంతు.

లాల్ ఉలికిపడి నిటారుగా అయ్యాడు. "సుధాకర్, మీరా!"

"అవును, నేనే! త్వరగా రండి! నన్ను కాపాడండి!"

"ఎందుకు ఏమైంది?"

"తర్వాత చెప్తాను, ముందు రండి ప్లీజ్!"

"ఎక్కడికి? మీరెక్కడున్నారు?"

"నేనిక్కడ — ఇక్కడే — విద్యానగర్ లో —" అంటూ గబగబా అడ్రసు చెప్పింది అవతలి గొంతు.

"లాల్! వాళ్ళొచ్చేశారు! నేను తప్పించుకోలేను! తలుపేసు కూర్చున్నాను. వాళ్ళు వీధిలో కాచుకున్నారు. ఎప్పుడైనా జొరబడి నన్ను—"

"ఎవరు వాళ్ళు? ఎంతమంది వున్నారు?"

సమాధానంగా అవతల పెద్ద ప్రేలుడు వినిపించింది.

# 7

"వాట్ హేపెండ్?" జాన్ అన్నాడు ఆందోళనగా.

లాల్ ఇంకా అలాగే వున్నాడు స్తంభించిపోయి. అవతల మళ్ళీ ఏమీ వినిపించలేదు.... ఫోన్ వ్రేలాడుతూ దేనికో కొట్టుకుంటున్నట్లు చప్పుడవుతోంది.... కొన్ని క్షణాల్లో అది కొట్టుకోవడం మానేసి కీ్ మని శబ్దమైంది.

లాల్ తేరుకొని ఫోన్ పెట్టేశాడు. గడియారం చూసుకొని విసురుగా లేచి, "కమాన్, జాన్, కమాన్! సమ్‌థింగ్ టెరిబుల్ హేపెండ్!" అన్నాడు తలుపు వేపుకు వేగంగా దారితీస్తూ, "ఇట్ మే బి మర్డర్!"

డిటెక్టివ్‌లు ఆ ఇంటిని చేరుకొనేటప్పటికి అక్కడ జనం బాగా పోగయివున్నారు. వాళ్ళని తోసుకొంటూ వెళ్ళారు. అంతా కోలాహలంగా వుంది.

"ఏం జరిగింది?" లాల్ అడిగాడు.

"ఎవరో అతన్ని చంపేశాడు!" అన్నారెవరో.

"మీరంతా వెనక్కి వెళ్ళండి! పోలీసుల్ని పిలవండి!" లాల్ అన్నాడు, గేటులోంచి లోనికెళ్తూ. ఇంట్లోకి వెళ్ళి ముందు గదిలో ఆగిపోయాడు. అక్కడ నేలమీద రక్తం మడుగులో పడివున్నాడు సుధాకర్. అతని గుండెలో గాయమైంది. ప్రాణంలేదు. అతను వెల్లకిలా పడివున్నాడు.

ఎవరో ఇద్దరు లోనికి రావడానికి ప్రయత్నిస్తున్నారు. జాన్ నివారిస్తున్నాడు. లాల్ సమీపించి సంగతి అడిగాడు.

"మేం అతన్ని చూశాం!"

"ఎవర్ని?"

"హంతకుణ్ని! కారెక్కి పారిపోయాడు!"

"ఎటు?"

"మెయిన్ రోడ్డుకేసి."

"ఏ కారది? నెంబర్ చూశారా?"

"తెల్ల అంబాసిడర్. A P T 4421."

డిటెక్టివ్‌లు ముఖాలు చూసుకున్నారు.

"అతడెలా వున్నాడో చూశారా?"

"చీకట్లో కన్పించలేదు, పైగా వేగంగా వురికాడు."

లాల్ గిరుక్కున జాన్ వైపు తిరిగాడు. "వెల్, కృష్ణన్‌కి ఫోన్ చేసి పిలువ్. ఇక్కడి తతంగం చూడు. నేను రావ్ దగ్గరికెళ్తున్నాను. ఏదైనా విషయముంటే అక్కడికి ఫోన్ చెయ్. ముందు ఫోన్ జాగ్రత్త. దాన్ని హంతకుడు క్రెడిల్ చేశాడు. వేలిముద్రలు తీయించు!"

బయటకు పరిగెత్తి కారెక్కి బయల్దేరాడు.

పదినిముషాల్లో రావ్ ఇంటిముందు కారు దిగి, గేటు

తెరిచి లోనికెళ్తూ ఆగివున్న కారుకేసి చూశాడు— దాని నెంబర్‌ని నిర్ధారణ చేసుకున్నాడు—APT4421.

తలుపు కొట్టిన వెంటనే రావ్ వచ్చి తీసి భయంగా చూశాడు.

"ఏమిటి, సుధాకర్ కన్పించాడా?"

"మీ రెప్పుడొచ్చారు?"

"నే నిప్పుడే వస్తున్నాను...."

"ఎక్కడనుంచి?"

"షాపునుంచి!"

"షాపునుంచి ఎనిమిది గంటలకే బయల్దేరారు. ఈ మధ్యంతా యెక్కడ తిరిగారు?"

"నే నెక్కడ తిరిగితే మీ కెందుకు?"

"మీ తమ్ముణ్ని చంపినందుకు!"

రావ్ ఒక్క అడుగు వెనక్కు వేసి స్తంభించి పోయాడు. ముఖం ఎర్రబడింది.

"యేమిటి మీర నేది? సుధాకర్ చనిపోయాడా?"

"మీరే చంపారు. మీ కారు హత్యాసమయంలో అతనింటి ప్రాంతాల కన్పించింది, విద్యానగర్‌లో. మీరు చంపి అందులో పారిపోయారు. రాత్రి డబ్బు దోచుకుంది మీ తమ్ముడని మీకు తెలిసింది. అతనా డబ్బుతో ఆ యింట్లో రహస్యంగా వుంటున్నాడని తెలుసుకొని మీరు—"

"నో! నో! నేను నమ్మను! వాడలా చెయ్యడు!"

"అతడేం చేశాడన్నది కాదిప్పుడు ముఖ్యం, మీ రతన్ని యేం చేశారన్నది కావాలి. కమాన్, మీ రివాల్వర్ ఎక్కడ?"

"ఎందుకు? దాంతోనే హత్య జరిగిందా?"

"అవును. అది మీరే చేశారని కూడా ఋజువవు తుంది?"

"ఎలా? నన్నెవరయినా చూశారా?"

"మిమ్మల్నెవరూ స్పష్టంగా చూడలేదు. సర్క్యుమ్ స్టేన్షియల్ ఎవిడెన్స్ యింకా నిర్ధారణ కాలేదు. కానీ మెటీరియల్ ఎవిడెన్సు సరిపోతుంది. దానివల్ల హత్య రుజువవుతుంది."

"యెలా? యేమిటా యెవిడెన్స్? యెక్కడ వుంది?"

"ఫారాఫిన్ టెస్టులో అది వెల్లడి అవుతుంది."

"పారాఫిన్ టెస్టా.... అంటే?"

"మిస్టర్ రావ్," లాల్ చెప్పాడు ఓపిగ్గా, "మధ్యాహ్నం మీ రివాల్వర్ గురించి చర్చ జరిగింది, గుర్తుందా? వెల్, మీ రివాల్వర్ చాలా పాతిదన్నారు. దాదాపు శిధిలావస్థలో వుంది.... అవునా? పైగా అప్పటి రివాల్వర్స్-ముఖ్యంగా ఏభ్భై క్రితానివి - ఇప్పటిలాగా టెక్నికల్ గా వృద్ధి చెందలేదు.... వాటిలో కొన్ని లోపాలుండేవి.... ఈ వివరణ అంతా అనవసరం. కానీ ఇది చెప్పడం ద్వారా పరిస్థితి మీకు బోధపడి మా శ్రమ పెంచకుండా సులువుగా లొంగిపోతారనే ఆశతో వివరిస్తున్నాను...."

"చెప్పండి__"

"ఆ రివాల్వర్ మీద మీ వేలిముద్రలుండొచ్చు. అది సహజం. అంతమాత్రాన మీరే హత్య చేశారని చెప్పలేం. కానీ మీరు దాన్ని షూట్ చేసినప్పుడు మీకు తెలియకుండా అది మీ చేతులమీద ఎవిడెన్స్ ని వదిలింది....

అటువంటి కాలం చెల్లిన రివాల్వర్‌ని ప్రేల్చినప్పుడు బ్రీచ్‌లోనుంచి మెత్తటి ఘూళివంటి గన్‌పౌడర్ బ్యాక్ ఫైర్ అయి చేతులమీద చర్మానికి అంటుకొంటుంది. ఈ రేణువులు చాలా సూక్ష్మంగా, కంటికి కన్పించని పరిమాణంలో వుంటాయి....

"ఇప్పుడు—మీరు రివాల్వర్ ప్రేల్చారా, లేదా అన్నది అలా నిర్ణయిస్తారు: ముందు మీ చేతులమీద ఒక నిర్ణీత ఉష్ణోగ్రతవద్ద కరిగించిన పారాఫిన్‌ని పోస్తారు. అది ఆరి గట్టిపడ్డాక ఆ పోతాను మీ చేతులనుంచి వేరు చేసి, దానిమీద ఒక రియేజెంట్—డిఫినైలమైన్‌ని—స్ప్రే చేస్తారు. అప్పుడు మీ చేతులమీద గన్‌పౌడర్ తాలూకు ఘూళివుంటే, ఆ రియేజెంట్ అందులోని నైట్రేట్స్‌తో చర్య జరిపి ఆ ప్రాంతాన్ని నీలిరంగులోకి మారుస్తుంది. అప్పుడు మీరు రివాల్వర్ ప్రేల్చారని తెలిసిపోతుంది....

"కాబట్టి మీరిప్పుడు ఆ టెస్టుకి సిద్ధపడ్తారా, లేక రివాల్వర్ స్వాధీనం చేసి లొంగిపోతారా చెప్పండి."

రావ్ ముఖం అకస్మాత్తుగా ఎర్రబడింది. గబుక్కున చేతులెత్తి చూసుకున్నాడు. అవి సన్నగా వణుకుతున్నాయి. చటుక్కున వాటిని వెనుక దాచుకుని, లాల్ కేసి చూశాడు.

లాల్ అతన్ని శ్రద్ధగా గమనిస్తున్నాడు.

"ఆల్‌రైట్!" అన్నాడు రావ్ గంభీరంగా, ఒక నిర్ణయాని కొచ్చినట్లు. "రండి, రివాల్వర్ మీకు స్వాధీనం చేస్తాను."

లాల్ తలూపాడు. "దట్స్ గుడ్, బట్ నో ట్రిక్స్. అదెక్కడుందో చెప్పండి, నే వెళ్ళి తీసుకొంటాను."

"పైన బెడ్‌రూంలో, బీరువాలో" చెప్పాడు రావ్ తాళాలందిస్తూ.

లాల్ తీసుకొని వేగంగా పైకి మెట్లెక్కాడు. రావ్ వెంబడించాడు.

లాల్ బెడ్‌రూంలోకి ప్రవేశించి బీరువా దగ్గరికి నడిచాడు.

కానీ వెనుకేదో వింత ధ్వనులు విని గిరుక్కున తిరిగాడు—

అప్పటికే రావ్ బెడ్ మీద దిండు కిందనుంచి రివాల్వర్ తీసేసుకున్నాడు. లాల్ తన్ని చూడ్డంచూసి, ఉలిక్కిపడి; బెదిరిపోయి; తొందరగా వేగంగా ఎదురుగా వున్న కిటికీ దగ్గరికి పరిగెత్తి, తెర లాగి బయట చీకట్లోకి షూట్ చేసేశాడు.

పెద్ద ప్రేలుడుతో పరిసరాలు దద్దరిల్లాయి.

అప్పుడు లాల్ తేరుకొని ముందుకి దూకాడు. రావ్ రెక్కపుచ్చుకొని బలంగా వెనక్కి లాగేస్తూ అరిచాడు.

"యూ!! ఎంత పని చేశావు!"

రావ్ అతన్ని ఒక్క విసురుతో విదిల్చికొట్టాడు. వెనక్కి వెళ్టేస్తూ బెడ్ మీద వెల్లకిలా పడేశాడు. రివాల్వర్ నేలమీదకు విసిరి, గిరుక్కున తిరిగి కిటికీలోంచి మళ్ళీ బయటికి చూశాడు. ఆయాసం తీర్చుకోసాగాడు.

లాల్ నెమ్మదిగా లేచి కూర్చున్నాడు. పెచ్చుమీరుతోన్న కోపాన్ని అణచుకొంటూ రివాల్వర్‌నీ, రావ్‌నీ చూశాడు. బెడ్ దిగి రివాల్వర్ అందుకొని, "హంతకుడివి నువ్వు!" అనరిచాడు గట్టిగా.

"కాదు, నేను హంతకుణ్ని కాను!" అన్నాడు రావ్ వెనక్కి తిరక్కుండానే, వణుకుతున్న కంఠంతో,

"మీ పిచ్చిగాని, వాణ్ని నేనెందుకు చంపుతాను? వాడు నా తమ్ముడు. వాడు నా దిక్కు. వాడు నా రక్తం.... బిడ్డ! సర్వస్వం! వాడొక్కడే నాకీ ప్రపంచంలో! వాణ్ని ఈ చేతులతో చంపుకొని దిక్కూ దివాణంలేని బ్రతుకును మాయలఫకీరులా ఎన్నాళ్ళీడుస్తాని లోకంలో?"

లాల్ మాట్లాడలేదు, వింటున్నాడు.

"వాణ్ని ఈ చేతులమీద పెంచాను. వాడు అడిగిందల్లా ఇచ్చాను. చెప్పిందల్లా చేశాను. ఏ లోటూ వాడికి రానివ్వలేదు. సరస్వతి వాణ్ని బిడ్డలా చూసుకుంది. సరస్వతికి నేను మాటిచ్చాను, వాణ్ని కంటికి రెప్పలా చూసుకుంటానని. వాణ్ని నేనెంతగా ప్రేమించానంటే, నిజంగా వాడు చెడిపోతున్నాడని తెలిసినా ఏమీ చేయలేని స్థితి—బలహీనత నాకొచ్చేసింది....

"ఇప్పుడు మీరీ దుర్వార్త చెప్పి నన్ను పూర్తిగా ఆశ్చర్యపరుస్తున్నారు. ఆ దోపిడీ వాడు చేశాడంటే నమ్మలేకపోతున్నాను. డబ్బడిగితే నేనెప్పుడు కాదన్నాను? బహుశ ఏదో పెద్ద అవసరం వచ్చి వుంటుంది.... వాడు గాంబ్లింగ్ లో పడ్డాడు. కొత్తలో తెలిసి మందలించాను. మంచీ చెడ్డా చెప్పాను. వినలేదు.. అతన్ని మార్చడం నావల్ల కాదు. శాసించడానికి చిన్న పిల్లాడు కాదు. వాణ్ని దూరం చేసుకోవడం భరించలేను. వాడు నన్ను త్యజించడం తట్టుకోలేను!"

"మిస్టర్ లాల్," రావ్ అన్నాడు అప్పుడు వెనుదిరిగి, "వాడే దోపిడీ చేశాడని తెలిసే నేనేమీ చేసే వాణ్ని కాదు, నమ్మండి. మీ చేత కేసు మాన్పించి, అది నాకు తెలిసినట్లు వాడికి తెలియకుండా ముభావంగా వుండిపోయేవాణ్ని. నమ్మరా?"

లాల్ అడ్డంగా తలూపాడు.

"ఇదంతా మీరు ముందే చెప్పివుంటే నమ్మేవాడి నేమో. ఇందాక మీరు రివాల్వర్ షూట్ చేసి నమ్మ వీల్లేకుండా చేశారు."

"నో, మీరనుకొంటున్నది పొరపాటు. అసలు నేనేం చేశానో మీకు తెలియదు. నేను సుధాకర్‌ని చంపలేదు, ఎవరినీ చంపలేదు. ఇందాకటిలాగే అప్పుడు గాల్లోకి ప్రేల్చాను, అంతే."

"అరెరె, ఎందుకలా చేశారు?"

"అది అనుకోకుండా జరిగింది. నా చేతిలో రివాల్వరు అనుకోకుండా ప్రేలింది. రివాల్వరుని నేను ఇంట్లోంచి తీసుకెళ్ళలేదు. దాన్ని ఎవరు తీసుకెళ్ళారో తెలీదు. ఎనిమిది గంటలకి నేను షాపునుంచి సుధాకర్ వేటలో బయల్దేరాను. వాడు నాకు మధ్యాహ్నంనించి కన్పించలేదు, మీతో మాట్లాడి వెళ్ళినప్పట్నుంచీ. మీరు తెచ్చిన దొంగదుస్తుల ప్రస్తావన నన్నెంతో అశాంతికి లోను చేసింది.... నేను చెప్పకుండానే వాడికెలా తెలిసిందో బోధపడలేదు. వాణ్ని పట్టుకొని తెలుసుకోవాలని అప్పటివరకూ ఎదురు చూశాను...."

చివరకి ఎనిమిది గంటలకి నేనే బయలుదేరాను. అంతటా గాలించాను. ఫ్రెండ్స్ అందరి దగ్గరా వాకబు చేశాను. చివరకు వెలింకర్ క్లబ్బుకి కూడా వెళ్లాను. అక్కడా లేడు—"

"వెలింకర్ ఎవరు?"

"అతను మరాఠీ. గన్ ఫౌండ్రీలో గాంబ్లింగ్ క్లబ్ నడుపుతుంటాడు. నేనక్కడికి చాలాసార్లు వెళ్లాను, సుధాకర్ రావడం ఆలస్యమైతే. వాడు గడిపే క్లబ్

అదే. ఈ రోజు వాడక్కడలేదు. నేను 9-30కి వెళ్లాను. అక్కడ రెండునిమిషాలకంటే ఎక్కువ లేను. వెలింకర్‌తో మాట్లాడి వచ్చేశాను. ఎక్కడ కెళ్ళి వుంటాడో ఇంక బోధపడలేదు. ఈ విద్యానగరు ఇంటి సంగతి నాకు తెలీదు, మీరు చెప్పేవరకూ. నేను క్లబ్‌లోంచి బయట కొచ్చి కారెక్కాను. అప్పుడు చూశాను డాష్‌బోర్డు మీద—ఆ రివాల్వరుని. నా రివాల్వరుని. గాభరాపడి ఎందుకో తెరిచి చూశాను. ఇంకేముంది! ఒక బుల్లెట్ అందులో తక్కువ వుంది."

"చాలా బాగా చెప్తున్నారు, వెల్, వెల్."

"మీరు నమ్మరు. అది నా ఖర్మ."

"ఆల్ రైట్, రివాల్వరులో ఒక బుల్లెట్ తక్కువ వుందనే మాటను వత్తిపలికి నన్ను ఎగతాళి చేస్తున్నారా?"

"కాదు, కాదు. ఆ పాయింట్‌ని జారిపోకుండా బ్రెయిన్‌లో గట్టిగా బిగిస్తున్నాను."

"మీ బ్రెయిన్‌లోంచి ఏ పాయింటూ జారిపోదు, డోంట్ వర్రీ!" అన్నాడు రావ్ తీవ్రంగా, "బుల్లెట్ తక్కువ వుందని తెలిసి నేను భయపడ్డాను. ఆ క్షణంలో నేనేం చేస్తున్నానో తెలీదు! ఎక్కడో, ఎవరిదో హత్య జరిగింది! అది నా రివాల్వర్‌తోనే జరిగింది! అందులో నన్నిరికించడానికి రివాల్వర్‌ని ఇలా కార్లో పెట్టాడు హంతకుడు! తక్షణం దాన్ని వదిలించుకోవాలి! వాడు పోలీసుల్ని హెచ్చరిస్తాడు, ఆలస్యం చెయ్యకూడదు! అంతే! ఇలా ఆలోచించి వెంటనే హాయత్ నగరులో ఒక నిర్జన ప్రాంతానికి వెళ్ళిపోయాను."

"ప్రొసీడ్. అక్కడేం చేశారు?"

రావ్ ఊపిరి పీల్చుకున్నాడు: "అక్కడంతా చీకటిగా వుంది. ఎవరూ లేరు. కనుచూపు మేరలో వాహనాల లైట్లు కూడా కనిపించలేదు. అక్కడ దిగి రివాల్వరుని బలంగా, దూరంగా విసిరేయబోయాను. కానీ, ఎలా జరిగిందో తెలియదు, నా వేలు ట్రిగర్ గార్డులో ఇరుక్కుని రివాల్వరు ఎగిరి వెళ్ళకపోగా, అకస్మాత్తుగా పేలింది!"

"వెరీ ఇంట్రెస్టింగ్. ప్రొసీడ్!"

"థాంక్ గాడ్, మిస్టర్ లాల్, గుండు నాకు తగల్లేదు! ఎటో దూసుకుపోయింది. రివాల్వరు నా చేతిలోనే వుండిపోయింది గమ్మత్తుగా. అప్పుడు నేను తెలివిలో కొచ్చాను. ఆ షాట్ నాలో వివేకాన్ని తట్టి లేపింది— నే చేస్తున్నది ఎంత పొరపాటో తెలియ చెప్పింది. హత్యాయుధాన్ని నేను అదృశ్యం చేస్తున్నాను! నా రివాల్వరుతో హత్య జరిగి వుండవచ్చు—కాని నేను చెయ్యలేదు. అటువంటపుడు రివాల్వరుని మాయం చెయ్యడం కావాలని చిక్కులు తెచ్చుకోవడమే! కష్టాల్ని ధైర్యంగా ఎదుర్కోవాలి—

"నా దగ్గర రివాల్వరు వుందని చెప్పి మీ దగ్గర కమిట్ అయ్యాను మధ్యాహ్నం. అది నా ఆధీనం నుంచి వెళ్ళదని కూడా వాదించాను. ఇప్పుడా హత్య నా రివాల్వరుతోనే జరిగిందని మీరొస్తే—హంతకుడి టిప్ అందుకొని — నేనేం సంజాయిషీ చెప్తాను? దాన్ని ప్రొడ్యూస్ చేయకపోతే నా మీద అనవసరంగా అనుమానం బలపడుతుంది. నాకు బలమైన ఎలిబీ వుంది. ఆఫ్టరాల్, ఈ రివాల్వరు ఏమీ చేయదని గ్రహించాను. అప్పుడు వెంటనే నేను పేల్చిన బుల్లెట్ స్థానే ఖాళీ

షెల్ తొలగించి, ఇంటికొచ్చి కొత్త బులెట్ ని నింపాను. సిలిండరుని వెనక్కి తిప్పి, హంతకుడు ప్రేల్చిన ఖాళీ షెల్ ఫైరింగ్ పిన్ కెదురుగా వుండేట్లు సెట్ చేశాను."

"ఇంకా... ?"

"అంతే. ఇంతలో మీరొచ్చి ఆ టెస్టు గురించి చెప్పి హడలగొట్టారు! దాన్ని నా మీద ప్రయోగించి గుడ్డిగా హంతకుణ్ని చేస్తారు. అందుకే ఇందాక అలా రివాల్వరు షూట్ చేశాను. ఇప్పుడు నా చేతుల మీద మీరు చెప్పిన ధూళివుంటే అది ఇప్పుడే—మీ కళ్ళముందు ప్రేల్చి నప్పటిదే అని అంటాను!"

లాల్ నవ్వాడు.

"అలా మీ మోటివ్ ని మీరే స్పష్టం చేసుకొం టున్నారు, మిస్టర్ రావ్. మీరిదివరకు రివాల్వరు ప్రేల్చారని ఒప్పుకొంటున్నారు. కానీ దానికి చెప్పిన ఎక్స్ప్లనేషన్ నిలవదు. దానికి రుజువు లేదు. సాక్షులూ లేరు; అంతేగాక హత్యాసమయంలో మీకు ఎలిబీ కూడా లేదు గనుక, అది హత్యను బుకాయించడానికి మీరు కల్పించిన కథగా తేలిపోతుంది...."

"అంటే—హత్య మీ చేతులతోనే జరిగిందనీ, మీ చేతులమీద నే చెప్పిన ఎవిడెన్స్ కోసం జరిగే తంతు నుంచి తప్పించుకొనడానికి మీరీ చిట్కా ప్రయోగించి బుద్ధి పూర్వకంగా ఆ ఎవిడెన్స్ని ధ్వంసం చేశారనీ స్పష్టమవుతోంది.

"సుధాకర్ నాకు ఫోన్ చేసినప్పుడు 9-12 అయింది. సరిగ్గా అప్పుడే హత్య జరిగింది. అప్పుడే మీ కారక్కడ కనిపించింది. డబ్బుతో పారిపోయి మీరు 9-3 కి

వెలింకరు క్లబ్బుకెళ్ళి సుధాకర్ కోసం వాకబు చేస్తున్నట్లు నటించి ఇంటికి తిరిగి వచ్చారు, అంతే."

"సరే, అలాగే అనుకోండి. ఇప్పుడేం చేస్తారు?" అన్నాడు రావ్ భుజాలెగరేసి.

"డబ్బెక్కడ దాచారు? ఆ డబ్బుతోపాటు స్టేషన్‌కి పదండి!"

"మిమ్మల్ని చూస్తే నాకు జాలివేస్తోంది."

"మిమ్మల్ని చూస్తే నాకసహ్యమేస్తోంది!"

క్రింద హఠాత్తుగా ఫోన్ మ్రోగింది.

రావ్ విసురుగా వెళ్ళిపోయాడు. లాల్ వారించి తను ముందు వెళ్ళాడు.

క్రిందకి వచ్చి ఫోన్ ఎత్తాడు.

"హలో, లాల్?"

"యస్, జాన్?"

"లాల్, హంతకుణ్ని ఎవరూ స్పష్టంగా చూడలేదు, దుస్తుల్ని కూడా. కానీ కారుని చూశారు. అది రావ్ కారని నా అనుమానం. హంతకుడు దాన్ని మూడిళ్ళవతల ఆపి వచ్చాడు. హత్యచేసి అందులో ఎక్కి పారిపోయాడు. ఇంట్లో బ్రీఫ్‌కేసుగానీ డబ్బుగానీ లేవు. ఈ ఇంటిని సుధాకరు రెండు నెలల క్రితం అద్దెకు తీసుకొన్నాడట. ఇక్కడ రీనా అగర్వాల్ అనే డాన్సరుని అతను అడపాదడపా కలుసుకొంటూంటాడట. ఆమె గన్‌ఫౌండ్రీలోని వెలింకరు క్లబ్బులో పనిచేస్తోందని వీధిలో కొందరు చెప్తున్నారు. కానీ క్లబ్‌కి ఫోన్‌చేస్తే ఆమె లేదు. ఇంట్లో కూడా లేదు. ఆమె హత్యకు అరగంట ముందు ఇక్కణ్నించి వెళ్ళిందట."

లాల్ ఆసక్తిగా వింటున్నాడు. "ఇంకా?"

"సుధాకరు తలు పేసు కున్నాడని ఫోన్‌లో చెప్పాడన్నావు. అయితే హంతకుడెలా ప్రవేశించాడు? తలుపులు బలవంతంగా తెరిచిన చిహ్నాలు లేవు. కిటికీలు విరగ్గొట్టిన సూచనలు కూడా లేవు. పార్ట్‌నర్, ఒక పాయింట్: సుధాకర్ ఫోన్‌లో 'వాళ్ళు' అని బహువచనంలో చెప్పాడన్నావు. హంతకుడొక్కడే వస్తే బహువచనమెందుకు? కాబట్టి మరి కొందరొచ్చారు— ఇద్దరో ముగ్గురో.

"వీధిలో కారాగడం ఎవరూ చూడలేదు గానీ, హత్యకు సుమారు అయిదు నిముషాలముందు ఎవరో ఇద్దరు సుధాకర్ ఇంటిముందు తచ్చాడుతూ కన్పించారు. కాస్సేపట్లోనే వీధి చివరికి వెళ్ళిపోయారు. అప్పుడే ఇంట్లోంచి షాట్ విన్పించింది. ఆ వెంటనే తలుపుతీసి ఒకడు వేగంగా వీధిలో కురికి కాగెళ్ళాడు. కారు స్టార్టయి వెళ్ళిపోయింది. అరమవుతోందా?"

"అరమవుతోంది, చెప్పు."

"దీన్నిబట్టి దుండగులు ముగ్గురు—ఇద్దరు ఇంటిముందు తచ్చాడుతూంటే సుధాకర్ చూసి, భయపడి, తలుపులు బిగించి మనకు ఫోన్ చేశాడు. కానీ అంతకుముందే మూడో ఆగంతకుడు—హంతకుడు—పెరటి తలుపుగుండా ఇంట్లోకి ప్రవేశించాడు. పెరట్లో అడుగుజాడలున్నాయి. అప్పుడు సుధాకర్ ఫోన్ చేస్తున్నప్పుడు షూట్ చేసేసి ముందు తలుపు తెరిచి పారిపోయాడు.

"కానీ పారిపోతున్నప్పుడు చేతిలో బ్రీఫ్‌కేసుగానీ, మరేమీగానీ లేవు!

"హంతకుడు వురికిన వేగాన్ని బట్టి అతడు యువకుడు అయివుండాలని కొందరి అభిప్రాయం. అయితే సుధాకర్

కోసం ఇంటికి ఆ డాన్సరు తప్ప యువకులెవరూ వచ్చే వారు కాదు.

"శవం వెళ్ళిపోయింది. శవం చేతికి మనం అనుకున్నట్టుగానే ఉంగరం లేదు. దాన్ని జాగ్రత్తపడి తీసేశాడు. ఫోన్ మీద వేలిముద్రలు లేవు. నేనిప్పుడు ఈ రీనా సంగతి తెలుసుకోడానికి బయలుదేరుతున్నాను. నువ్వేం చేస్తున్నావక్కడ?"

లాల్ తేరుకున్నాడు. "ఏమీ లేదు...." నవ్వి ఫోన్ పెట్టేశాడు.

మళ్ళీ అకస్మాత్తుగా ఫోన్ మ్రోగింది.

లాల్ ఫోన్ అందుకొని "యస్—" అనబోయి, అవతలి గొంతు, "సుధాకర్....?" అనడంతో చటుక్కున ఆగిపోయి కలవరపడ్డాడు.

"యస్....సుధాకర్...." అన్నాడు తేరుకొని జాగ్రత్తగా.

అవతలి గొంతు కఠినంగా, వేగంగా మాట్లాడింది.

"బేటా, ఏమనుకున్నావ్? మమ్మల్ని పోలీసుల చేత కొట్టిస్తావా? మామీద దోపిడీ బనాయిస్తావా? సరే, నీ రోగం కుదర్చడానికి మరి మేమేం చేశామో తెలుసా? నీ లవర్‌ని ఎత్తుకొచ్చి ఈ ఇరుకు గదిలో కుదేశాం! దొంగవి నువ్వు! ఆ డబ్బు నువ్వే దోచుకున్నావని మాకు తెలుసు! ఇప్పుడు నీకు—నువ్వు పడి చచ్చే స్వీట్ హాట్ లవర్ కావాలంటే ఆ నలభై వేలూ తెచ్చి తీసుకుపో చచ్చినట్టు! లేకపోతే లవరూ దక్కదు, పైగా పోలీసు లొచ్చి లాక్కుపోతారు నిన్ను డబ్బుతోపాటు. నేనే పంపిస్తాను."

"వద్దు....వద్దు, నిద్దోష్. ఎక్కడికి తేను డబ్బు?"

"అది రేపు రాత్రి చెప్తాను. సుధాకర్ భాయ్, నిన్నో ముప్పై గంటలు—పద్దెనిదివందల నిమిషాలు టెన్షన్‌లో వుంచాలి. మాకు తృప్తి!"

వికటంగా నవ్వు వినిపించి లైను డెడ్ అయింది.

లాల్ అలాగే చూస్తూండిపోయాడు ఫోన్ కేసి.

"ఎవరది?"

రావ్ మాటలకి తేరుకొని ఫోన్ పెట్టేశాడు.

"మీరిక్కడే వుండండి. ఎక్కడికీ వెళ్ళొద్దు. మీ వ్యవహారం సందిగ్ధంగా వుంది. ముందు వాడి ఉబలాటం అణిస్తేగానీ—"

మాట పూర్తి చేయకుండానే బయట కురికి కారెక్కాడు.

## 8

వారిస్ గూడలో ఆ ఇంటిముందు కారు దిగి లాల్, స్కెలిటన్ కీస్‌తో రెండు నిముషాల్లో తాళం తెరిచేసి లోనికెళ్ళాడు.

తననెవరైనా గమనిస్తున్నారేమోననే పట్టింపులేదు. ఇంట్లోకి నడచి ముందు గదిలో ఆగాడు. లైటు వేసి కొన్ని క్షణాలు పరీక్షగా చూశాడు. తరువాత వెనుక గదిలో కెళ్ళాడు. నిశితంగా చూస్తూ హేంగర్‌కి వ్రేలాడుతోన్న దుస్తుల్ని సోదా చేశాడు. బీరువా తెరవడానికి ప్రయత్నించాడు. కాని రాలేదు. తిరిగి ముందు గదిలో కొచ్చి టేబిల్ సొరుగులు లాగాడు. వాటిలో ఏవో కాగితాలూ, నోటుపుస్తకాలూ, విజిటింగ్ కార్డులూ వగైరా కన్పించాయి.

ఓపిగ్గా ఒక్కొక్క కాయితమూ తీస్తూ పరిశీలించాడు. అందులో కొన్ని ఉత్తరాలున్నాయి. కొన్ని రసీదు

లున్నాయి. ఉత్తరాల్లో ఏమీ ఆకర్షించలేదుగానీ, రసీదులు కొన్నింటిని ఆసక్తిగా చూశాడు. అలాంటి రసీదులు అయిదు వున్నాయి. అవి పెట్రోలు పోయించు కొన్న బిల్లులు. బంకు కూకట్ పల్లిలో వుంది. ప్రతి రెండు మూడు రోజులకొక బిల్లు చప్పున వున్నాయి. సరి క్రొత్త బిల్లు నిన్నటిది.

లాల్ వాటి నలాగే పెట్టేసి సిగరెట్ వెలిగించాడు. లైటార్పేసి ఆలోచిస్తూ వచ్చి తలుపుకి తాళం వేశాడు.

అప్పుడు కారెక్కి అతివేగంగా సాగిపోయాడు.

కూకట్ పల్లిలో ఆ బంకుకి చేరుకునే టప్పటికి సమయం పన్నెండు దాటి ఇరవై నిముషాలైంది. లోని కొచ్చిన అతన్ని చూసి అటెండర్ గాభరాపడ్డాడు.

“టేకిట్ ఈజీ....నిర్దోష్ కావాలి” అన్నాడు లాల్.

అటెండర్ అర్థంకానట్లు చూసి, “హిందీ మే బోలో!” అన్నాడు.

లాల్ హిందీలో అదేమాట తిరిగి చెప్పాడు.

“ఎవరతను?” అడిగాడు అటెండర్ మొఖం చిట్లిస్తూ.

“ఇక్కడ తరచు మోటార్ సైకిల్ లో పెట్రోలు పోయించుకొంటూంటాడు. నిన్నకూడా పోయించు కున్నాడు. నెంబర్ AAY 6671, బుల్లెట్.”

“ఓహ్, వాళ్ళిద్దరా? తెలుసు. కాని పేర్లు తెలీవు. ఇందాకే కదా ఇక్కడకొచ్చి ఫోన్ చేసింది- తెలుగులో?”

“వాళ్ళే. వాళ్లెక్కడికెళ్ళారు?”

“సిటీలోకి.... కానీ వాళ్ళు తరచు ఇటు పోతూంటారు, బాంబే రూట్లో. అక్కడ 30వ నెంబర్ రాయికి ఎడమవైపునుంచి వెళ్ళే అడ్డదారిలో దూరంగా

మైదానంలో ఒక పాడుబడ్డ ఇల్లుంది—అక్కడికి తీసుకెళ్తుంటారు. ఏంచేస్తారో తెలీదు." అతను ఆగిపోయి భయంగా చూశాడు. "ఇంతకీ మీ రెవరు? ఈ సంగతి వాళ్ళకి తెలిస్తే...."

"భయపడకు. వాళ్ళిక ఇటువైపు రారు."

లాల్ బయటకు నడిచి తిరిగి కారెక్కాడు.

పదినిముషాల డ్రైవింగ్‌లో అటెండర్ చెప్పిన చోటుకి చేరుకున్నాడు.

అక్కడంతా చీకటిగా, నిశ్శబ్దంగా వుంది. గాలి కూడా లేదు. కంటికేమీ కన్పించడంలేదు. లాల్ కారు దిగి అవలీలగా కన్పిస్తోన్న తెల్లగోడలకేసి చూశాడు. ఆ రెండు గోడలమధ్యనుంచి ద్వారం వుందిగానీ, గేటు లేదు. గోడలు అయిదడుగుల ఎత్తు వున్నాయి.

లాల్ వాటి దగ్గరాగి కళ్ళు చిట్లించి లోనికి చూశాడు. ఇంటి ఆకారం మాత్రం కన్పిస్తోంది. దీపాలు లేవు. అలికిడి లేదు. జాగ్రత్తగా గేటులోంచి అడుగువేసి ఇరవై గజాల బాట నడిచి, మెల్లెక్కాడు. కాళ్ళకింద ఎండుటాకు పేలుతున్న చప్పుడు విపరీతంగా వుంది. వరండా చేరుకుని తలుపు దగ్గరికెళ్ళాడు. దాన్ని తడిమిచూశాడు. జవాబులేదు.

"మిస్ రీనా అగర్వాల్!" పిల్చాడు చిన్నగా.

అప్పుడే వెనుకేదో అలికిడైంది. గబుక్కున తిరిగి చూసి, రెండంగల్లో వెళ్ళి వరండా స్తంభం చాటున నక్కాడు. జాగ్రత్తగా తల జరిపి చూశాడు.

ఒక ఆకారం మెల్లెక్కి వస్తోంది. అది ముందూ వెనుకా చూడకుండా తలుపు దగ్గరకెళ్ళి ఆగింది.... తాళం తిప్పుతూ చప్పుడు చేసింది. ఇంతలో అనుకో

కుండా లాల్ పాదం క్రింద పేలిన ఆకు చప్పుడికి చటుక్కున తిరిగి చూసింది. విసురుగా ముందుకు రాబోయింది—

లాల్ క్షణం కూడా ఆలస్యం చేయలేదు. జేబు లోంచి రివాల్వర్ తీసి ఎగిరివెళ్ళి దాని నెత్తిమీద మోదాడు, బలాన్నంతా ఉపయోగించి.

ఆ ఆకారం కిక్కురుమనకుండా కుప్పకూలిపోయింది.

లాల్ చటుక్కున వంగి దాని మొహంలో మొహం పెట్టి చూశాడు. పొరపాటు చేశాడు—ఒక్క విసురుతో వచ్చి ముష్టిఘాతం ఒకటి మొఖంమీద పడింది. తూకం తప్పి వెల్లికిలా విరుచుకుపడ్డాడు. తేరుకొని లేచేంతలో మరోఘాతం నడుముకి కాస్త పైన కొండచరియ విరిగిపడ్డట్టు పడింది. తాళలేక దొర్లుకుంటూ వెళ్ళి మెట్లమీద పడ్డాడు.

శత్రువు ఆగలేదు. రెండంగల్లో వచ్చి మళ్ళీ కాలెత్తాడు. లాల్ తేరుకొని, బాధని ఓర్చుకొంటూ బలాన్ని కూడదీసుకొంటూ, ఆ లేచిన కాలు మళ్ళీ తన్ని స్పృశించకుండా సకాలంలో ఒడిసి పట్టుకొని లాగేశాడు.

శత్రువు అమాంతం గాల్లోకి లేచి, కిందపడ్డం ఇష్టం లేక కాబోలు ఎగిరివెళ్ళి ప్రక్కనే వున్న చెట్టుకొమ్మని పట్టుకున్నాడు. చెట్టెక్కేశాడు.

లాల్ అప్పుడు ఆవేశంగా, ఉద్రేకంగా లేచి రివాల్వర్ ప్రేల్చాడు గాల్లోకి.

"స్టాప్ దేర్! నువ్వు పారిపోలేవు!"

వెంటనే రెస్పాన్స్ వచ్చింది పైనుంచి.

"ఛీ, ఆగు! ఎవర్నువ్వు?"

లాల్ కొయ్యబారిపోయాడు. తలెత్తి పైకి చూశాడు.

"ఓహ్, గాడ్! నువ్వెవరు?"

"నేను జాన్‌ని!"

"నేను లాల్‌ని!"

"ఓహ్ డామిట్! డామిట్! డామిట్!"

"లైటు....లైటు వేద్దాం!"

"నీ మొఖం! నా నెత్తి బద్దలు చేసి!" చెట్టు దూకి వచ్చి అరిచాడు జాన్.

లాల్ అతన్ని ఆదుర్దాగా తడిమిచూశాడు, "సారీ జాన్....నువ్వనుకోలేదు."

"ఓహ్, ఏ సినిమాలో అన్నదమ్ములిలా కలుసుకొంటారు? నువ్వు కావాలని చేశావు—"

"లేదు, జాన్....నిజంగా నిన్ను గుర్తించలేదు. నువ్వు మాత్రం తక్కువ తిన్నావా? కాస్తలో నా తుంటి ఎముక విరిగేదే!" అన్నాడు లాల్ నడుము పట్టుకొంటూ.

జాన్ ఆందోళనగా లాల్ నడుముని తడిమాడు.

"ఎందుకిలా జరిగింది? విధి ఎందుకిలా...."

"ఓ.కే! ఇక మర్చిపోదాం. నువ్వెలా వచ్చావు? ఆమె లోపల వుందా?" అన్నాడు లాల్ మెట్టుమీద కూలబడుతూ.

జాన్ పక్కనే కూలబడి సిగరెట్ అందించాడు, "లోపలే వుండాలి.... నేనొచ్చి చాలా సేపయింది. తాళం తీయడానికి నా దగ్గరేమీ లేదు. ఇంటిచుట్టూ తిరిగాను. తలుపులన్నీ లోపలినుంచే వేసివున్నాయి. పిలిస్తే ఆమె పలకలేదు. భయపడి వుండాలి...."

"ఆమెని ఇంటి దగ్గరే కిడ్నాప్ చేశారు. ఆమె సుధాకర్ దగ్గరనుంచి ఇంటికి వచ్చాక ఎవరో మోటార్ సైకిల్ మీద వచ్చి ఆమెని తీసుకెళ్ళాడట—బుల్లెట్

బండి. ఎదురింటి వాళ్ళు చెప్పారు. నాకప్పుడు నిర్దోష్ మెదిలాడు. ఉదయం వాళ్ళింట్లో బుల్లెట్ ని చూశాను. వెంటనే వాళ్ళింటికెళ్తే అక్కడెవరూ లేరు. వీధిలో ఎవరో చెప్పారు, వాళ్ళిద్దరు గాంబ్లర్స్ అని. అయితే వెలింకర్ క్లబ్ తో సంబంధం వుంటుందని అక్కడికి వెళ్ళాను. అక్కడొక చంద్రముఖికి నలభై రూపాయలు నజరానా ఇచ్చుకొని వాళ్ళ స్థావరం ఇక్కడుందని తెలుసు కొన్నాను. వచ్చాను, వాళ్ళిక్కడ లేరు—"

"కాస్సేపట్లో రావచ్చు," అన్నాడు లాల్. "తప్ప కుండా వస్తారు. ఉదయం సుధాకర్ వాళ్ళమీద దోపిడీ మోపి కొట్టించిన కసితో ఈ పని చేశారు. ఆమె విడు దలకి ఆ నలభై వేలూ డిమాండ్ చేశారు. ఆ ఫోన్ కాల్ రావ్ ఇంట్లో ఉండగా నేనే అందుకున్నాను. పూర్ ఫెలోస్, వాళ్ళకి సుధాకర్ చనిపోయాడని తెలీదు.

"వెల్, నువ్విక కారు లోనికి తీసుకొచ్చి ఆ మూల గోడవారగా పెట్టు. నేను తాళంతీసి ఆమెని తీసు కొస్తాను. అప్పుడు వాళ్ళకోసం ఎదురుచూద్దాం."

లాల్ లేచి, మెట్లెక్కి వెళ్ళి మారుతాళాలు తీశాడు.

మూడు నిమిషాలు ప్రయత్నించి తాళం తీసేశాడు.

తలుపు నెట్టి లోనికి చూశాడు. చీకటిగా వుంది. అగ్గిపుల్ల గీసి లోనికెళ్తూ "మిస్ రీనా! మీరిక వచ్చే యండి" అన్నాడు.

సమాధానం లేదు. లాల్ అలాగే ముందుకెళ్ళాడు.

"ఎవరు, ఎవరది!" కెవ్వుమంది స్త్రీ గొంతు.

లాల్ ఆగిపోయి, "భయపడకండి!" అన్నాడు, "మీ కోసమే వచ్చాం, మిమ్మల్ని విడిపించడానికి.

కమాన్, వాళ్ళొచ్చేస్తారు."

అడుగులు వేగంగా దగ్గరయ్యాయి. లాల్ మరో పుల్లగీసి ఆమె మొఖం మీద వేశాడు. ఆమె కళ్ళు భయంతో మెరుస్తున్నాయి.

"మీ రెవరు?"

"డిటెక్టివ్ ని."

"డిటెక్టివ్! సుధాకర్ పంపాడా?"

"రండి, బయటికెళ్ళి మాట్లాడుకుందాం."

లాల్ ఆమెతో బయటకొచ్చి జాన్ తీసుకొచ్చి ఆపిన కారు దగ్గరికెళ్ళాడు. ముగ్గురూ కారెక్కి కూర్చు న్నారు.

ఎక్కడో గుడ్లగూబ ఒకటి వికారంగా అరిచింది.

"వెల్, మీరిక చెప్పండి." అన్నాడు లాల్.

"నాకేం తెలీదు, నన్ను సుధాకర్ దగ్గర చేర్చండి!" అందామె ఆందోళనగా.

"మీరు చెప్పాలి, మీ నుంచి చాలా తెలుసు కోవాలి."

"నా నుంచి ఎందుకు? నేనేం చేశాను?"

"మీ రేమీ చెయ్యలేదు, కానీ సుధాకర్ చని పోయాడు."

ఆమె చటుక్కున లాల్ చెయ్యి పట్టుకుంది, "చని పోయాడా!"

"చంపేశారు."

"ఏమిటి....ఏమిటి .... సుధాకర్ ని చంపేశారా!" అర్చిందామె.

"అవును. ఇప్పుడు మీ రేం దాచినా అది మీకే మంచిది కాదు." అన్నాడు లాల్ ఆమె చల్లబడ్డ చేతిని

తప్పిస్తూ.

ఆమె అలాగే వుండిపోయింది మంచు బొమ్మలా.

"చెప్పండి," అన్నాడు లాల్.

ఆమె ఉలికిపడి తిరిగి చూసింది. "సుధాకర్! సుధాకర్ని.... సుధాకర్.... ఎలా.... ఎలా.... ఓహ్, ఎలా జరిగిందిది! మీరు చెప్పేది నిజమేనా? చెప్పండి— నిజమేనా? సుధాకర్ చనిపోయాడా! అతన్ని నేనెంత- నన్ను అతనెంత— మేమిద్దరం ఎంత ప్రేమించుకున్నాం!" అరుస్తోందామె.

"ప్లీజ్, తేరుకోండి!"

"అయితే నేనింకేమీ దాచను! వాణ్ని పట్టుకోండి! వాడే ఈ పని చేశాడు!"

"ఎవరు?"

"వెలింకర్. నాకు తెలుసు. వాడు దుర్మార్గుడు! సుధాకర్ని నేను హెచ్చరించాను కూడా. లక్ష్యపెట్టలేదు. అతను వెలింకర్కి పదివేలు బాకీపడ్డాడు గాంబ్లింగ్లో. అతను గాంబ్లింగ్లో రాబట్టుకొన్నదేమీ లేదు, పోగొట్టుకున్నదే ఎక్కువ. నేనా క్లబ్లో డాన్సర్ని. మేమిద్దరం ఒకర్నొకరు ఇష్టపడ్డాక అతన్ని మందలించాను, వారించాను ఇటువైపు రావద్దని. కానీ వినిపించుకోలేదు. అతని పట్టుదల వేరు.

"మా వివాహాన్ని అతని అన్న అంగీకరించడు. ఆస్తిలో వాటా ఇవ్వడు. అది తండ్రి ఆస్తి కాదు, అతని స్వార్జితం. అందువల్ల మేం ఎక్కడికైనా వెళ్ళి బ్రతకాలంటే డబ్బుకావాలి. ఆ డబ్బుకోసమే ఈ గాంబ్లింగ్లో పడ్డానని సమర్థించుకునేవాడు.

"తర్వాత నేను వూరుకున్నాను. అతని పరిస్థితి రోజు రోజుకీ హీనమవుతోంది. వెలింకర్ దగ్గర అప్పు పెరిగి పోయింది. అదిప్పటికి పదివేలకి చేరుకుంది. వాడు తొందరచేస్తున్నాడు. బలవంత పెడ్తున్నాడు. ఇంకేదో చెప్పి బ్లాక్ మెయిల్ కూడా చేశాడని అనుమానం. ఆ డబ్బు గురించే ఇప్పుడు సుధాకర్‌ని చంపేశాడు!"

"కానీ, సుధాకర్ ఆ బాకీ తీర్చేసే వుండాలి."

"లేదు, తీర్చలేదు."

"అతను మీకేం చెప్పలేదా?"

"ఏ విషయం?"

"ఆ బాకీ తీర్చేశానని? చెప్పలేదనుకొంటాను. నిన్న రాత్రి అతను అన్న దగ్గర నలభై వేలు దోచుకున్నాడు."

"ఏమిటీ! సుధాకర్ డబ్బు దోచుకున్నాడా!"

"అవును, మీకు తెలీదా?"

"కాదు, నేను నమ్మను! సుధాకర్ అలా చెయ్యడు!"

"రుజువులున్నాయి...."

"మీరలా మాట్లాడకండి! సుధాకర్ అటువంటి పని చెయ్యడు!"

లాల్ నవ్వాడు. "మీరు చాలా అమాయకుల్లా వున్నారు. అతడా డబ్బు దోచుకున్నాడు కాబట్టే దాన్ని రాబట్టుకోడానికి నిర్దోష్ మిమ్మల్ని కిడ్నాప్ చేశాడు. మీరంత సులువుగా బైక్ ఎక్కి ఎలా వచ్చారు?"

"వాడు ఇలా మోసం చేస్తాడనుకోలేదు. నేను సుధాకర్ దగ్గర్నుంచి ఇంటికి రాగానే వాడొచ్చాడు. క్లబ్ మీద రెయిడింగ్ జరిగిందనీ, వెలింకర్‌నీ మరి కొందర్నీ అరెస్టు చేశారనీ, సుధాకర్ తప్పించు

కొన్నాడనీ, అతన్నీ నన్నూ తననీ పోలీసులు గాలిస్తున్నారనీ చెప్పి హడలగొట్టాడు. సుధాకర్ కూకట్‌పల్లిలోని ఒక ఇంట్లో దాక్కొని నన్ను తీసుకరమ్మని చెప్పాడన్నాడు. ఆ కంగారులో నేనేమీ ఆలోచించకుండా మోటార్ సైకిల్ ఎక్కేశాను."

లాల్ నవ్వాడు. "బాగుంది. సుధాకర్‌తో అతను గొడవపడ్డాడని మీకు తెలియదా?"

"గొడవపడ్డాడా? ఏమో నాకు తెలీదు."

"వాళ్ళిద్దరికీ శత్రుత్వం వుంది. అందుకే సుధాకర్ ఆ దోపిడీ వాళ్ళమీద మోపి మా చేత కొట్టించాడు. ఆ కసితో వాళ్ళు మిమ్మల్నిలా కిడ్నాప్ చేసి—"

"అదేమీ నాకు తెలీదు."

"సుధాకర్ మీనుంచి చాలా దాచాడు."

"నేను మీనుంచి ఏమీ దాచడంలేదు."

"సరే, వెలింకర్ ఆ బాకీ డబ్బులకోసం చంపాడన్నది సబబుగా లేదు. సుధాకర్ ఆ బాకీ తీర్చేసి వుండాలి. అందుకే హంతకుడు పారిపోతున్నాడు. చేతిలో ఏమీ లేదు. మిగిలిన డబ్బుని సుధాకర్ ఎక్కడ—"

"నన్ను నమ్మండి! సుధాకర్ దోపిడీ చెయ్యలేదు, బాకీ తీర్చనూ లేదు!"

"ప్రేమ గుడ్డిది, మిస్ రీనా అగర్వాల్ ...." అంటూ లాల్ ఆగిపోయి చెవులు రిక్కించాడు. "మోటార్ సైకిల్ శబ్దం .... వాళ్ళొస్తున్నారు!" అన్నాడతను చటుక్కున కారు దిగుతూ.

## 9

డిటెక్టివ్‌లు ఇద్దరూ గోడ దగ్గర నిలబడి అవతల చూశారు.

బైక్ శబ్దం తీవ్రంగా, దగ్గరగా విన్పిస్తోంది. ఇంతలో లైటు కన్పించింది... మరి కాసేపట్లో బైక్ ఇంటిని సమీపించి, గేట్లోంచి దూరి వంకరటింకరగా వెళ్ళి మెట్ల దగ్గర ఒక్క కుదుపుతో ఆగింది.

వాళ్ళిద్దరు దిగారు. స్టాండువేసి ఈలవేసుకొంటూ చకచకా మెట్లెక్కి వెళ్ళారు. ఆ తర్వాత వాళ్ళ ఆకారాలు కన్పించలేదు. వరండాలో చీకటిగా వుంది.

కాస్సేపేవో చప్పుళ్ళు విన్పించాయి....

ఇంతలో విసురుగా బయటకు పరిగెత్తుకొచ్చారిద్దరూ.

"పారిపోయింది! పిట్ట ఎగిరిపోయింది దేవుడా!"

అప్పటికే డిటెక్టివ్‌లు గేటు దగ్గర సిద్ధంగా కాచుకునున్నారు.

ఆ యిద్దరూ వురికి వస్తోన్న వాళ్ళల్లా పదిగజాల దూరంలో సడెన్ బ్రేకుతో ఆగిపోయి, హృదయ విదారకంగా కేక వేశారు.

"భయపడకండి, మేం మనుషులమే!" అన్నాడు లాల్ రివాల్వర్ పట్టుకొని.

"ఎవరు....ఎవరు మీరు?" సంతోష్ గొంతు గద్దించలేకపోయింది.

"ఉదయం నిన్ను అండర్‌వియర్‌తో ఫీట్స్ చేయించిన వాణ్ని," చెప్పాడు జాన్.

"మీరా! సి.ఐ.డీలు! పారిపోవాలి!" అరిచాడు నిర్దోష్. గబుక్కున తిరిగి యిద్దరూ ఇంటి వెనక్కి పరుగు తీశారు.

జాన్ అన్నాడు లాల్‌తో. "నేనట్నుంచి తరుము కొస్తాను, నువ్విక్కడే వుండు."

వేగంగా వాళ్ళు ఉరికిన దిశలో పరిగెత్తి యింటి వెనక్కి వెళ్ళాడు జాన్. అప్పటికే వాళ్ళు అవతల చివర వున్నారు. జాన్ వెనుకనుంచి అదిలించాడు. వాళ్ళు ఆగి వెనుదిరిగి చూసి, బెదురిపోయి ఇంకా వేగంగా పరిగెత్తారు. అట్నుంచి వచ్చి తిరిగి యింటి ముందుకు తేలారు.

రహదారిలో అడ్డంకులేవీ లేవనితోచి, ముక్కు సూటిగా కూడబలుక్కొని గేటులోంచి పరారవుతోండగా, లాల్ తాపీగా ముందుకు జరిగి కాలుజాపాడు. ఒక్కొక్కరే మూదేసి గంతుల చొప్పున అవతలకు గెంతి, చీకటి మైదానంలో కన్పించకుండా బోర్లాపడి, అదే సౌఖ్యమన్పించి అలాగే అతుక్కుపోయారు.

"కమాన్, లేచి రండి!" అన్నాడు లాల్. "నా చేతిలో రివాల్వర్ వుంది, అనవసరంగా గాయపడ్తారు. మీకు వీధికెక్కాలని ఒకటే ఉబలాటంగా వుంది కదూ? యిదే మంచి ఛాన్సు! పదండి, కారెక్కండి!"

జాన్ వెళ్ళి వాళ్ళిద్దర్నీ లేపి కట్టేసి లాక్కొచ్చి కార్లో కుదేశాడు.

"గుడ్, ఇక బయల్దేరుదాం!" అన్నాడు లాల్.

దూరంగా అస్పష్టంగా ఏదో శబ్దం విన్పించింది.... మోటారు శబ్దం. అది క్రమంగా పెద్దదవుతూ, దగ్గరవుతూ, హఠాత్తుగా సద్దుమణిగిన వాతావరణంలో ఉత్సుకతను రేపింది.

డిటెక్టివ్‌లు వేగంగా గోడచేరుకొని చూశారు. రెండు హెడ్ లైట్లు చీకటిని చీల్చుకొంటూ సమీపిస్తున్నాయి.... కారు యింజన్ శబ్దం ఇప్పుడు స్పష్టంగా విన్పిస్తోంది.

ఆ కారు కొంతదూరంలో ఆగిపోయింది. లైట్లు ఆరి పోయాయి. మూడు ఆకారాలు దిగి గబగబా నడిచి వస్తున్నాయి.

లాల్ వంగి నిల్చొమ్మని వారించాడు, తనూ వంగుతూ.

ఆకారాలు వేగంగా నడిచివచ్చి గేటుదగ్గర ఆగాయి.

జాన్ తల కొద్దిగా పైకెత్తి ఊపిరి బిగబట్టాడు.

"ఏమిటిది?" అన్నాడు లాల్.

మధ్య ఆకారాన్ని చూపిస్తూ అన్నాడు, "వెలింకర్!"

వెలింకర్ ముందుకు అడుగువేసి అన్నాడు, "కమాన్! బైక్ ఇక్కడే వుంది. వాళ్ళింట్లోనే వున్నారు. చప్పుడు గాకుండా వెళ్ళి సఫాచెయ్యాలి!"

అతని గొంతు వింటూనే నిర్దోష్, సంతోష్‌లకు నిలువుగుడ్లు పడ్డాయి.

## 10

వాళ్ళు ముగ్గురూ చకచకా కదిలి లోనికొచ్చేశారు. వడివడిగా నడిచివెళ్ళి వరండా చేరుకొని ఆగిపోయారు. కాస్సేపు నిశ్శబ్దం. తర్వాత వెలింకర్ కంఠం అంది, "మన రాక వాళ్ళకింకా తెలియదు. చీకటిగా వుంది, కునుకు తీస్తున్నట్లున్నారు. కానీ తలుపు తీసేవుంది. మీరిద్దరూ లోనికెళ్ళండి. బయటికొస్తే నేను చూసుకొంటాను. జాగ్రత్త. పుల్ల గీయకండి."

అనుచరులిద్దరూ నిశ్శబ్దంగా లోనికెళ్ళిపోయారు. వెలింకర్ ద్వారాని కడ్డంగా కాళ్ళుజాపి నిలబడ్డాడు. మళ్ళీ నిశ్శబ్దం అలుముకుంది.

లాల్, జాన్‌వేపు తిరిగాడు, "ఇంట్లో ఎవరూ లేరని తెలుసుకొని వాళ్ళు బయటికొచ్చేస్తారు. అప్పుడు మన కారూ, మనమూ కంటబడిపోతాం. బెదిరిపోతారు.

వాళ్ళు బయటికొచ్చి రావడంతోనే లొంగదీసుకోవాలి."

జాన్ తలూపాడు.

ఒక శోకపూరితమైన గట్టికేక లోపలినుంచి కెవ్వున వచ్చింది. మరో కేక అంతకు రెట్టింపు స్థాయిలో, సహజత్వం ఉట్టిపడ్తూ ప్రసారమైంది.

డిటెక్టివ్‌లు ఉలికిపడి చూశారు—

లోనికి వెళ్ళిన రెండు ఆకారాలు బయటపడి ఉరికి వచ్చాయి. వెలింకర్ వెనక్కి తూలి నిలదొక్కుకొని, "ఏమైంది?" అని కేక పెట్టాడు.

"నన్ను జబ్బలో పొడిచాడు!" డిక్లేర్ చేసింది మొదటి ఆకారం.

"నన్ను చంకలో పొడిచాడు!" సపోర్టు చేసింది రెండో ఆకారం.

"యూ కవర్డ్లీ బాస్టర్డ్స్!" వెలింకర్ విసురుగా లోని కెళ్ళబోతే అనుచరులు పట్టి వెనక్కి లాగారు.

లాల్ చిటికేసి ముందుకు పరుగెత్తాడు. వెనుక జాన్ ఉరికాడు. కళ్ళుమూసి తెరిచేంతలో మెట్లెక్కి వరండా చేరుకొని దుండగులు ఏం జరుగుతోందో గ్రహించేలోపు అనుచరుల దవడలు వాయగొట్టి జాన్, వెలింకర్ మెడకి రివాల్వర్ ఆన్చి లాల్, తమ స్థానాల్ని పదిలపర్చు కొన్నారు.

"కదలకు, వెలింకర్. కత్తిని పడెయ్యి. వాళ్ళనెవరూ పొడవలేదు. ఇంట్లో ఎవరూ లేరు. చీకట్లో ఒకర్నొకరు పొడుచుకున్నారు. అంతే! నువ్విక మర్యాదగా నడిస్తే మనమంతా ఒకే పార్టీగా రవాణా అయి వెళ్ళచ్చు."

"ఎక్కడికి?"

"పోలీసులవద్దకి."

"మీ రెవరు?"

"డిటెక్టివ్ లం."

వెలింకర్ మాట్లాడలేదు. కత్తి పడేసి అలాగే నిల బడ్డాడు, చేతులెత్తి.

వెనకనుంచి లాల్ రివాల్వర్‌తో నొక్కాడు, "పద! నువ్వు ఎదురుతిరిగి లాభంలేదు. సుధాకర్ హత్యాభియోగం నీ మీద వుంది, లొంగిపోవడం మంచిది."

జాన్ గాయాలతో మూల్గుతోన్న అనుచరుల్ని బంధించి కారువద్దకి లాక్కెళ్లాడు.

వెనుక లాల్ వెలింకర్‌ని నెట్టుకెళ్లాడు. వెలింకర్ ఎదురు తిరగకుండా మౌనంగా నడిచాడు.

వెలింకర్ అనుచరులతో, రీనాతో, జాన్ కారెక్కి స్టార్టు చేశాడు.

వెలింకర్, నిర్దోష్, సంతోష్‌లతో లాల్ బయట ఆగివున్న కారువద్దకి నడిచాడు. కారును చేరుకొని ఆశ్చర్యంగా చూశాడు. తెల్ల అంబాసిడర్.

"వెల్, వెల్, ఈ కారెక్కడిది?"

"దొంగిలించాను."

"నెంబర్ ప్లేట్లు?"

"నేనే మార్చాను."

"గుడ్, వెరీ గుడ్, ఇక కారెక్కు."

ముందు సీట్లో వెలింకర్, వెనుక సీట్లో నిర్దోష్ సంతోష్‌లు చేతులకు బంధాలతో కూర్చున్నారు.

తర్వాత లాల్ ఎక్కి స్టార్టు చేశాడు. జాన్ కారు ముందుకెళ్లాక నెమ్మదిగా పోనిచ్చాడు.

"వెల్, ఇప్పుడు చెప్పు సుధాకర్‌ని ఎందుకు చంపావు?"

"అతడు నన్ను బ్లాక్ మెయిల్ చేశాడు."

"బ్లాక్ మెయిల్ చేశాడా, నీకు బాకీపడి?"

"అవును...." వెలింకర్ అన్నాడు తలొంచుకుని. "నేను దురాశపడ్డాను."

"నువ్వు దురాశపడ్డావా....అంటే?"

"ఆ మొత్తం డబ్బు నాది చేసుకోవాలనుకొన్నాను. అతడు బాటిల్ మీద వేలిముద్రలున్నాయని బెదిరించాడు."

"ఏం బాటిల్?"

"క్లోరోఫాం బాటిల్, పోలీసులకి దొరికింది."

"అవును. దానిమీద నీ వేలిముద్ర లెక్కడివి?"

"అది నా చేతిలోంచే అక్కడ జారిపడిపోయింది.."

"ఏమిటీ! నీ చేతినుంచా!" అన్నాడు లాల్ కలవరంగా.

"అవును, నా చేతినుంచి!"

"ఎలా?"

వెలింకర్ చటుక్కున తల తిప్పి చూశాడు. "మీకు తెలీదా? ఆ దోపిడీ చేసింది నేనేనని!"

"ఏమిటీ! ఆ దోపిడి చేసింది నువ్వా!"

"నేనే" అన్నాడు వెలింకర్ ప్రశాంతంగా. "అచ్యుతరావ్‌ని దోచుకుంది నేను, ఆయన తమ్ముణ్ణి చంపింది కూడా నేనే."

"ఆశ్చర్యంగా వుంది!"

"ఆశ్చర్యమేమీ లేదు, అర్థం చేసుకుంటే. సుధాకర్ నాకు పదివేలు బాకీపడ్డాడు. అది తీర్చే మార్గం కన్పించలేదు. అతడి అన్న అప్పటికే చాలా ఇచ్చాడు. ఇంకా అంత పెద్ద మొత్తం ఒకేసారి ఇస్తాడనుకోవటం భ్రమ. అందుకే ఈ పథకం వేశాడు. నాతో దోపిడీ చేయిం

చాడు—అతనికి ధైర్యంలేదు. ఈ పనిచేసి రెండువేలు అదనంగా తీసుకోమ్మని ప్రాధేయపడాడు. ఒప్పుకున్నాను.

"అనుకొన్న విధంగా నిన్న రాత్రి రావ్‌ని దోచుకున్నాను. అతను నన్ను గుర్తించకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నాను. నాతో అతనికి పరిచయం వుంది—తరచు తమ్ముడి కోసం క్లబ్‌కి వస్తూంటాడు.

"రావ్‌ని దోచుకొని నేను సిటీకి వచ్చేశాను— అప్పుడే అక్కడ వచ్చి ఆగిన లారీ మీదెక్కి వాడు చిన్నగా తీసుకెళ్ళి పోలీసు స్టేషన్ ముందాపాడు. ఎలాగో దిగి తప్పించుకున్నాను. ఉదయం సుధాకర్ వచ్చి నా పన్నెండువేలు తీసుకొని మిగతా డబ్బిచ్చేయమన్నాడు. కానీ నాకు మనసొప్పలేదు. ఆ బ్రీఫ్‌కేసు తెరిచిచూసిన క్షణానే నా మనసు మారిపోయింది. నలభై వేలు! నా కళ్ళు తిరిగాయి. దురాశ కల్గింది. డబ్బంటే నాకెంతో ప్రీతి. డబ్బుకోసం నేరాలు చాలా చేశాను. ఆ డబ్బంతా అట్టి పెట్టుకోవాలనుకొన్నాను. అక్కడే వచ్చింది పేచీ మా యిద్దరికీ!"

"అందువల్ల అతనికి నయాపైసా ఇవ్వనన్నాను. అప్పుడతను నన్ను బెదిరించాడు. పోలీసులకి క్లోరోఫాం సీసా దొరికిందనీ, దానిమీద నా వేలిముద్రలున్నాయనీ. తను ఫోన్ చెయ్యడమే ఆలస్యం వచ్చి నన్ను అరెస్టు చేస్తారన్నాడు. పరిస్థితి నాకు బోధపడింది. నన్ను డిఫెన్స్‌లో పెట్టేవాళ్ళని సహించను. నేనెప్పుడూ అఫెన్స్‌లోనే వుండాలని కోరుకొంటాను. అందువల్ల నాకు అపాయకరంగా తయారైన సుధాకర్‌ని అంతం చేయాలని నిశ్చయించాను."

"ఏం చేశావు?"

"హత్యను అన్నగారిమీద బనాయిస్తే కన్విన్సివ్ గా వుంటుంది. ఏర్పాట్లు చేశాను. వైట్ అంబాసిడర్ ఎక్కడో దొరక్కపోదు. ముందు మధ్యాహ్నం నెంబర్ ప్లేట్స్ సిద్ధం చేసుకున్నాను. సుధాకర్ మధ్యాహ్నం నించీ లవ్ స్పాట్ లోనే వున్నట్లు తెలుసుకున్నాను. తమ ఇంట్లో రివాల్వర్ వుందని ఒకసారి నాతో అన్నాడు. సాయంత్రం వెళ్ళి అది తెచ్చుకున్నాను.

"అప్పటినించీ రావ్ ఇంట్లోనూ షాపులోనూ వుండని సమయం కోసం ఎదురు చూడసాగాను. అప్పుడు 9 కావస్తోండగా నా ఫ్రెండ్ నించి ఫోన్ వచ్చింది—రావ్ సుధాకర్ కోసం తిరుగుతూ తన దగ్గర కొచ్చాడని. అదే మంచి అవకాశమనుకున్నాను. సాయంత్రం సిద్ధం చేసుకొన్న కార్లో నా మనుషులతో వెళ్ళి షూట్ చేసి వచ్చేశాను."

"అప్పుడు?"

"అప్పుడు నాకో సమస్య ఎదురైంది. అసలు నేను సుధాకర్ ని చంపుతానని కలలో కూడా అనుకోలేదు. కానీ అంత డబ్బు పూరికే భయపడి వదులుకో బుద్ధి కాలేదు. చంపాక సమస్య ఏర్పడింది. మా డాన్సర్ రీనా—వాళ్ళిద్దరు లవర్స్.

"ఆమెని నేను బొంబేనించి రప్పించి బ్రతుకు తెరువు చూపిస్తే, ఆమె నన్నే కాదని అతనివైపు మళ్ళింది. సహించాను. నన్ను కాదన్న మగువల్ని వాళ్ళ మానాన వాళ్ళని వదిలేస్తాను. ఒక్కర్నే పట్టుక్కూర్చుని దేవదాసులా అరిచి గీపెట్టడం నావల్లగాదు. మగువల షార్టేజీ లేదు నాకీ లోకంలో.

"కానీ ఇప్పుడామె నా భద్రతకు ప్రమాదకరంగా

పరిణమించింది. సుధాకర్ ఆమెకి నా గురించి—ఈ దోపిడీ గురించి చెప్పేవుంటే ప్రమాదం. హంతకుడిగా పట్టుబడ్తాను. అందువల్ల ఆమెని నంపేసి రమ్మని మనుషుల్ని పంపాను. ఈ లోపు క్లబ్ కి సుధాకర్ కోసం రావ్ వచ్చాడు. ఆ అదను చూసుకొని రివాల్వర్ ని ఆయన కార్లో పెట్టించేశాను.

"కానీ రీనా కోసం వెళ్ళిన మనుషులు పని పూర్తి చేయలేక పోయారు. ఆమెని అంతకుముందే ఎవరో బుల్లెట్ మీదెక్కించుకొని వెళ్లారట. వేగంగా ఆలోచించాను. చీకటయ్యేసరికి క్లబ్ లో బిచాణావేసే ఈ డాంగ్రేగాళ్ళు అప్పుడు గైర్ హాజర్ వున్నారు. వీళ్ళకు బుల్లెట్ వుంది. అయితే అది వీళ్ళ పనే అనుకున్నాను.

"ఈమధ్య వీళ్ళకీ సుధాకర్ కీ పడ్డంలేదు. వీళ్ళు సుధాకర్ ని ఏదో మోసంచేశారు. సమయం వచ్చినప్పుడు బుద్ధి చెప్తానని సుధాకర్ బెదిరించాడు.... బహుశ, ఆ దే గొడవలో రీనాని వీళ్ళు ఎత్తుకుపోయారేమోనని అనిపించింది."

"అప్పుడేం చేశావు?"

"వెంటనే వాళ్ళింటికెళ్ళాం. కానీ అక్కడలేరు. అయితే రాజధానికి వెళ్ళివుంటారనుకొన్నాను. ఈ కూకట్ పల్లి ఇల్లు వీళ్ళ రాజధాని. కానీ బయలుదేరివచ్చి నేను చాలా పొరపాటే చేశాను. ప్చ్, మీరు రాకపోతే రీనాతో పాటు ఈ బఫూన్ గాళ్ళిద్దర్నీ ఒక్కొక్క పోటుతో సఫాచేసి చక్కాపోయేవాళ్ళం. బ్రతికిపోయారు."

లాల్ వింటున్న వాడల్లా చటుక్కున తిరిగి, "నీ

చేతికి ఉంగరం వుందా?" అన్నాడు.

"ఉంగరమా?" అన్నాడు వెలింకర్, చెయ్యి ముందుకు చాపి. "ఇదుగో ఉంగరం!"

లాల్ చూసి తల తిప్పుకొని ఆలోచనల్లో పడ్డాడు.

"ఈ సమోసా గాడు మధ్యలో రాకపోతే ఇంత త్వరగా దొరికేవాణ్ని కాదు" అన్నాడు వెలింకర్.

"సమోసా గాడా?"

"నిర్ఘోష్—వాడు సమోసాలాగా ఉబ్బిలేడూ?"

"వెలింకర్! నువ్వలా పేర్లు పెట్టావంటే పకోడీలు చేసి నమిలేస్తా!" గర్జించాడు సంతోష్ వెనకనుంచి, నిర్ఘోష్ తరఫున.

"వీణ్ని చూడండి! వీడు జీవితంలో క్షణం కూడా సంతోషంగా వున్నట్టు నే చూడలేదు" అన్నాడు వెలింకర్ మళ్ళీ.

లాల్ పకపకా నవ్వేసి వేగం పెంచాడు.

నిర్ఘోష్ నిండు కుండలా తొణకలేదు.

చీకటి హైవేమీద కార్లు రెండూ శరవేగంతో దూసుకుపోతున్నాయి....

—:ఐ పో యిం ది:—

# రచయిత బందిఖాన

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

"మీ కోసం ఎవరో వచ్చి వెళ్ళారు!" అన్నది సత్య.

నేను జోళ్ళయినా విప్పకుండా, కుర్చీలో కూలబడ్డాను. తిరిగి తిరిగి రావడం వలన అలసటగా వుంది. రచనలు అచ్చుకావడం ఒక ఎత్తు అయితే ఆయా పత్రికలలో వచ్చిన రచనలను సేకరించుకోవడం మరో ఎత్తు. ఎక్కువ పత్రికలు రచనలను గురించి తెలుపకుండా నే అచ్చువేసుకోవడం వలన ఇలాంటి యిబ్బంది నాకు తరచుగా ఎదురౌతోంది.

"ఎవరు వచ్చి వెళ్లారో పేరు చెప్పారా?" అడిగాను మా ఆవిడను.

"పేరు చెప్పలేదు. మరల వస్తామన్నారు. మీ స్నేహితుడి యింటికి వెళ్తే ఆయనే స్వయంగా వచ్చి మన యిల్లు చూపించారు!"

"మనిషి ఎలా వున్నాడు?"

"ఖరీదయిన గ్లాస్కో పంచెమీద సూరత్ సిల్కు

చొక్కా వేసుకున్నారు. భుజాన ఖరీదయిన కండువా వేసుకున్నాడు. రెండు చేతులకు మూడేసి చొప్పున రాళ్ల ఉంగరాలు, కన్వూర్ తోలు చెప్పులు. మారానికే ఖరీదయిన సెంటు వాసన!"

"నేను మనిషిని గురించి వర్ణించమంటే నువ్వు అతడి వేషం విషయం చెప్పావు!"

సత్య నవ్వింది. "ఆరడుగుల ఎత్తూ, ఎర్రటి ఛాయా! తేనెరంగు కళ్ళూ. కళ్ళలో ఎర్రటి జీరలూ..."

నా మెదడు ఆలోచిస్తోంది. సత్య వర్ణించిన వ్యక్తి బడా కాపిటలిస్టు అయివుండాలి. అటువంటి వ్యక్తి ఎవరూ నాకు తెలిసిన వాళ్ళలో లేరు. ఆ వ్యక్తికి నాతో పని ఏమిటి? విచిత్రం!

బట్టలు మార్చుకుని వ్రాతకి కూర్చున్నానన్న మాటే కాని నా కలం కదలనని మొరాయిస్తోంది. లేచివెళ్ళి మా యింటి తోటలో పచార్లు చేయసాగాను. తోటలోంచి వీధి కనిపిస్తోంది. ఒక కుర్రవాడు మా యింటివైపు వచ్చాడు.

"ఎమ్. వి. వి. .... గారిల్లు ఇదేనాండీ?" అడిగాడు ఆ కుర్రవాడు.

నేను తలూపాను.

ఆ కుర్రవాడు చటుక్కున తోటకి వున్న కంచెకు దగ్గరగా వచ్చి చెయ్యి చాపాడు. అతడి చేతిలో రోజా రంగు కవర్ వుంది.

"డిటెక్టివ్ శిరీష్‌గారు అట! ఆ రోడ్డుమీద కారు ఆపి నన్ను పిలిచి మీకు యివ్వమని అడ్రసు చెప్పి కారులో వెళ్ళిపోయారు" అన్నాడు ఆ కుర్రవాడు.

నేను కవరు అందుకున్నాను.

"కారా? పోలీసు జీపా?" అడిగాను.

"అవునండి. పోలీసులు వెళ్ళే కారు. అంబాసిడర్ కారు. నీలం రంగు! పైన పోలీస్ అని యింగ్లీషులో రాసివుంటుంది."

"వెరీగుడ్. శిరీష్ గారి ప్రక్కన ఎవరయినా కూర్చుండి వున్నారా?"

"వున్నారండి. పోలీస్ ఇన్స్పెక్టర్ గారు కాబోలు!"

గేటు తెరుచుకుని అవతలకు వెళ్ళి ఆ కుర్రవాడిని భుజం తట్టి పంపేశాను. తిరిగి ఇంట్లోకి వచ్చి కవర్ తెరిచి చూశాను. తెల్ల కాగితం వుంది. తీసి చదివాను.

"డియర్ సత్యనారాయణా!

అత్యవసరంగా, ఈ దారిన వెళ్తో కూడా మీ యింటికి రాలేకపోయాను. మేనకాలో పదో నెంబర్ రూంలో వుంటాను. ఇన్స్పెక్టర్ కుమార్ నాతోబాటు ఈ రోజంతా వుంటాడు. క్రైం బ్రాంచ్ కేసులు చెలుతాడు. రా! నీకు కావలసినంత మేటర్!"

—శిరీష్."

చదవడం అయ్యాక నవ్వుకున్నాను. వాళ్ళిద్దరి అనుభవాలూ నాకు క్రైం సాహిత్య రచనలో తోడ్పడుతున్నాయి. శిరీష్ని కలుసుకోవాలి. మేనకా హోటలుకి వెళ్ళాలి.

గుమ్మం వద్ద చప్పుడయింది. మా ఆవిడ లోపలికి వచ్చింది....

"ఆయన వస్తున్నానండి! కాఫీలు కలాపాలా?" అడిగింది సత్య.

"ఆ, కలుపు!" అంటూ సమాధానం కోసం ఎదురు చూడకుండానే డ్రాయింగ్ రూంలోకి నడిచాను. ఆయన అప్పటికే గుమ్మంలోకి వచ్చి నిలబడ్డాడు. సెంటు వాసన లోపలికి వస్తోంది. నిండైన ఆయన విగ్రహం మా యింటి గుమ్మానికే నిండు తెచ్చింది.

"లోపలకు రండి సార్!" అన్నాను గుమ్మం దగ్గర నిలబడి.

ఆయన నావంక చూచి నవ్వాడు. పెదిమలు నవ్వుతున్నాయి కాని కళ్ళలో జేగురు రంగు చారలు మెదలుతూండటం వలన కాబోలు ఆయన నవ్వు హృద్యంగా లేదు. ఆయన తలూపి లోపలకు వచ్చాడు. సోఫాల్లో కూర్చున్నాం యిద్దరమూ.

"నన్ను శంకరరాజన్ అంటారు!" అన్నాడు ఆయన.

నా మెదడు కొన్ని క్షణాలపాటు కడిగివేసినట్టు తెల్లగా అయిపోయింది. శంకరరాజన్ అంటే దక్షిణ భారత చిత్రసీమలో పేరొందిన డిస్ట్రిబ్యూటర్. శంకర్ రిలీజ్ కంపెనీతోబాటు ఆయనకి నాలుగైదు డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలున్నట్టు నాకు తెలుసు. ఆ శంకర్ రాజన్ మా ఇంటికి వచ్చాడా? ఇప్పుడు నా ఎదురుగా వున్న శంకర్ రాజన్ ఆయనేనా?

ఆలోచనల దాడిని తట్టుకోలేక తల విదిలించాను.

"మీరు.... మీరు...." తడబబడ్డాను.

ఆయన సోఫాలో వెనక్కి జారగిలబడి కాలుమీద కాలువేసుకూర్చున్నాడు. జేబులోంచి బంగారపు సిగరెట్ కేసు తీశాడు. కేసు తెరచి నాకు ఆఫర్ చేశాడు. సిగరెట్స్ అలవాటు చేసుకోలేకపోయినందుకు

నాకా క్షణంలో చిన్నతనంగా తోచింది.

"నో సర్ .... కాల్చను!" నోరు పెగిలింది.

ఆయిన సిగరెట్ ముట్టించుకుని, గుండెలనిండా పొగ పీల్చుకున్నాడు.

"వింతగా వుంది. ఫీల్డులో రచయితలు కాగితాలను వూదరు. సిగరెట్లనే!" అన్నాడు ఆయన పొగ వదులుతూ.

పొగ తాలూకు సువాసన సోఫాలచుట్టూ అలుము కుంది.

ఈయన డిస్ట్రిబ్యూటర్ శంకర్ రాజన్ గారే! అయినా నాకు మనసు సమాధానపడటంలేదు. ముక్కూ మొహం తెలియని నాతో ఈయనకి పనేమిటి?

"మీరు మరీ అంతసేపు నా గురించి తర్జన భర్జనలు పడనక్కరలేదు. నాకు మీతో ఒక చిత్రానికి కథ రాయించుకోవాలనిపించింది!"

ఆయన మాటలు నాకు బుర్రలో ప్రవేశించి స్పృహ తప్పేలాగా చేయబోయాయి. అదృష్టవశాత్తు మా ఆవిడ ట్రేతో కాఫీలు తెచ్చి పెట్టింది. నేను నిలద్రొక్కు కున్నాను. కాఫీలు సర్వ్ చేసి మా ఆవిడ వెళ్ళిపోయింది. ఇద్దరం కాఫీలు త్రాగాం.

"నాతోనా! చిత్రానికి కథ రాయించడమా?" అడగగలిగాను చివరకు.

"అవును. మీ విశాఖపట్నం పరిసరాల్లోనే ఆ పిక్చర్‌ను నెలరోజులపాటు షూట్ చేసెయ్యాలని మా పథకం! అందుకే ఇంత హడావుడిగా బయలుదేరి మీ వద్దకు వచ్చాను."

"నెల రోజులే! ఇంత తక్కువ కాలంలోనా?"

"అవును. పై నెల పదిహేనో తారీఖుకల్లా షూటింగ్

ముగియకపోతే నాకు కొన్ని రకాల ఇబ్బందులు ఎదురౌతాయి."

"షూటింగ్ ఎప్పటినించీ షెడ్యూలు చేశారు?"

"మీరు కొన్ని సీనులను ముందు ఇచ్చెయ్యండి. వాటికి లొకేషన్స్ ఎన్నుకోవాలి."

"తారలూ, వాళ్ళ కాల్ షీట్సూ...."

ఆయుని పెళ్ళున నవ్వాడు. "నా పిక్చర్ లో నటించడమే గొప్ప.... కాల్ షీట్స్ నేను ఫిక్స్ చేయవలసిన తారలు నాకున్నారు."

నాకు ఆయనపట్ల గౌరవం రెట్టింపయింది. జగత్తుకు మూలం ధనమే—

"ఏం పిక్చర్ తీయాలనుకుంటున్నారు? జానపదమా?" నేను చాలా కాలంనుండి పిల్లల రచయితను.

"కాదు క్రైం చిత్రం!"

"క్రైం చిత్రమా! నేను ఈ మధ్యనే మొదలు పెట్టాను క్రైం సాహిత్యం రాయడం. నాకంటె చేయి తిరిగిన వాళ్ళ రచనలు...."

"సత్యంగారూ .... నేను ఇలా షార్ట్ కట్ తోనే పిలుస్తాను. మీరు రెండు రోజుల్లో మాకు ఒక కథ ఇవ్వండి. డైలాగ్స్ రాయించి ట్రీట్ మెంట్ ఇప్పిస్తాను. స్క్రీన్ ప్లే చదివితే మీరే దంగయిపోతారు."

నేను అయోమయంలోంచి ఇంకా తేరుకోలేదు.

"కథకి అయిదు వేలు యిస్తాను."

ఓ హెన్రీ కథల్లో కొసమెరుపులలాగా నా మస్తిష్కం మీద ఆయన మాటలు ఒక్కొక్కటి ఒక్కో హ్యాంటర్ దెబ్బలాగా తగులుతున్నాయి.

"ఏమండీ మాట!" తలుపు వెనకనుండి కోకిల కంఠం

వినిపించింది. అవతల పెద్దమనిషి మాట్లాడుతోన్నా, డబ్బు ప్రసక్తి వచ్చినా ఆడవాళ్ళ కంఠాలు మాధుర్యాన్ని అద్దుకుంటాయి. నేను లేచి ఆయినకి క్షమాపణ చెప్పుకుని లోపలకు వెళ్ళాను.

"సినిమా కథకి బోడి అయిదువేలు ఏమిటండీ? పదివేలు అడగండి!" గదిమింది మా ఆవిడ.

నేను బిత్తరపోయాను.

నాబోటి రచయితకి సినిమా ఛాన్స్ రావడమే గొప్ప! బేరం పెడితే ఏం బావుంటుంది?

"మనం రేటు పెంచితే ఆయన మరొకళ్ళకి ఇచ్చుకుంటాడేమో—"

"ఏమీ యివ్వడు. లక్షలు పెట్టి తీసే సినిమాకి కథా రచయితకి కేవలం ముష్టి అయిగువేలేనా?"

"వెర్రి మొహమా! యాభై తెలుగు కథలు రాసినా అయిదువేలు రావే!"

"ఖీ మొహం! తెలుగు కథకీ— తెలుగు సినిమాకీ లంకె ఏమిటి? పత్రికలు కొనేవాళ్ళెందరు? సినిమాలు అందరూ చూస్తారు."

"ముందు నేను రెండు రోజులలో కథ రాయాలి గదా!"

"ఏం? ఎందుకు రాయలేరు! రాయటం కొత్తా?"

"రాసింది ఆయనకి నచ్చాలిగదా!"

"నచ్చేదేమిటి నా మొహం? ట్రీట్‌మెంటు వాళ్ళే యిచ్చుకుంటారు!"

"ట్రీట్‌మెంటు అంటే కళాయి పూత అనుకున్నావా?"

"ఏదో గోల....ముందు పదివేల రూపాయలకు

ఖాయం చేసుకోనండి. అంతకీ మీరు రాయలేకపోతే అప్పుడు చూద్దాం"

"నవ్వు రాస్తావా ఏమిటి కొంపతీసి?"

"నేను రాయగలిగితే ఇంత రభస దేనికి? ఆయన్ని అక్కడే కూర్చోబెట్టి రాసి యిచ్చేదాన్ని! అంతకీ మీరు యిప్పుడు రాసియిచ్చే కథ ఆయనకి నచ్చకపోతే.... మన "నల్లకారు" నవలిక యివ్వండి. నచ్చితీరుతుంది."

"అసలు 'నల్లకారు' నవలిక చదివే ఆయన మన దగ్గరకు వచ్చివుంటాడులే....ఆ నవలిక కావలిస్తే దాన్నే కొనుక్కునేవాడు కదా!"

"హుమ్! అవతల పెద్దమనిషి కూర్చుండివుంటే ఈ వితండవాదం ఏమిటి?" అన్నది సత్య, తప్పంతా నాదే నన్నట్టు.

స్త్రీ జాతి సహజగుణం తప్పును నెట్టడం అను కున్నాను.

"పదివేల మీదే వుండండి!" అంటోంది మా ఆవిడ.

నేను డ్రాయింగ్ రూంలోకొచ్చి శంకరరాజన్ గారి ఎదుట కూర్చున్నాను. ఆయన చూపులు నన్ను ఎక్స్‌రే తీస్తున్నట్టు ఫీలయ్యాను. ఇబ్బందిగా కదిలాను.

"అరిక విషయాలలో ఆడవాళ్ళ ఔక్యంచేసు కున్నట్టున్నారు!" ఆయన నవ్వాడు. ఈ మాట కూడా మా ఆవిడకు వినపడే వుంటుంది.

"అబ్బే...." తేలు కుట్టినట్టు చూశాను.

"ఫరవాలేదులెండి....ఎంత కావాలి కథకు?"

"ప....పదివేలు!"

ఆయన బోళాగా నవ్వి "పదివేలకు మీకు ఎన్ని క్రైం నవలలు కావాలి?" అన్నాడు.

ఆడదాని మాట వింటే బేరం చెడిపోదా.... నిట్టూర్చాను. కాళ్ళ దగ్గరకు వచ్చిన బేరం! ఈయనను సవరించుకోవడం ఎలా? ఆయనవైపే చూస్తూ ఆలోచనలో పడ్డాను.

"ఆల్ రైట్! పదివేలు యిస్తాను" అన్నాడు ఆయన.

నా గుండె తెగి తిరిగి అతుక్కున్నట్టయింది. ఎలాగయినా మా ఆవిడ గట్టిదే! శంకర్ రాజన్ కడుపులోని వ్యూహాను పసిగట్టకలిగింది!

"అయితే ఆ చిత్రం తమిళంలో, కన్నడంలో, మళయాళంలో ఒకేసారి తీస్తాను. హక్కులు నావే!"

నా మనసు పొంగిపోయింది. నా కథ అన్ని భాషలలోకి వెళ్తోంది.

అంగీకారంగా తలాడించాను. శంకరరాజన్ తలుపు వైపు చూశాడు. రెస్పాన్స్ రాలేదు. నన్ను చూచి నవ్వాడు. నేను వెర్రి నవ్వు నవ్వాను.

పదివేలు వినిపించిన చెవులకు పరభాషల గురించిన వివరాలు వినిపించి వుండవు అని సరిపెట్టుకున్నాను.

"మీరు బయటకు వస్తారా సత్యంగారూ!" అడిగాడు శంకర్ రాజన్.

"వస్తానండి. ఎంతవరకూ వెళ్ళాలి మనం?" అన్నాను.

శంకర్ రాజన్ కొత్త సిగరెట్టు తీసి ముట్టించాడు. "భీమునిపట్నం వెళ్ళే రోడ్డుమీద ప్రయాణించారా?" అన్నాడు.

"లేదు. ఎప్పటికప్పుడే బీచ్ ఒడ్డునే వేసిన రోడ్డు మీద ప్రయాణం చేయాలనుకుంటూనే వాయిదా వేస్తున్నాను."

"ఇప్పుడు రండి... నా కారులో వెళ్దాం."

"ఎందుకు?"

"బీచ్ రోడ్ లో గంభీర గడ్డ వుంది. ఆ గడ్డకి మైలు దూరంలో తుప్పలమధ్య పాడుబడిన భవంతి ఒకటి వుందట. అచ్చంగా అది భూత్ బంగ్లా. ఆ లొకేషన్స్ చూస్తే మీకు కొత్త ఆయిడియాలు రావచ్చును.

ఆ భవంతిలో హీరోయిన్ ని బంధిస్తారు. డిటెక్టివ్ సినిమా చివరలో ఆమెను హంతకుల ముఠాతో వీరోచితంగా పోరాడి రక్షించి తన దాన్ని చేసుకుంటాడు. మీరు కథను ఆ రకంగా మలుచుకోవాలి!"

నన్ను అనవసరంగా కథలు రాసి యివ్వమని కోరుతున్నాడు కాని, శంకర్ రాజన్ పొట్టలోనే పుట్టెడు కథలున్నాయి!

ఇంట్లో చెప్పి ఆయనవెంట బయలుదేరాను. మా యింటికి వున్న సందు దాటగానే రోడ్డుమీద ఎర్రటి చెవర్లెట్ కారు కనిపించింది. ఇద్దరమూ కారు సమీపించాం. కారులో ఎవరో కూర్చుండి వున్నారు. అతడు చటుక్కున డోర్ తెరిచి పట్టుకున్నాడు. అతడు డ్రైవింగ్ సీటు ముందునుండి వంగాడు.

ఇద్దరము వెనక సీట్లో కూర్చున్నాము. డ్రైవింగ్ సీట్లో కూర్చున్న వ్యక్తి కారును స్టార్టుచేశాడు.

చెవర్లెట్ కారు హైవేమీద దూకింది. యింజనీరింగ్ హాస్టల్స్ రోడ్డులో ప్రవేశించి మలుపు తిరిగి పెద వాల్తేరు రోడ్డు పట్టింది.

"అతడు మా బావమరది. పరాంకుశం!" అన్నాడు శంకర్ రాజన్.

అలాగా అన్నట్టు చూచి డ్రైవింగ్ సీట్లోని వ్యక్తికి నమస్కార బాణం విసిరాను. అతను తలాడించి, "నమ

స్కారం!" అన్నాడు. పరాంకుశం గొంతు పెలుసుగా వుంది. లోహం రేకుమీద గీతగీచినట్టుగా వుంది.

"మావాడు కూడా కథలు రాస్తాడు. మద్రాసులోని పరాంకుశం పబ్లికేషన్ మావాడిదే!" అన్నాడు శంకర్ రాజన్.

"చాల సంతోషం సార్!" అన్నాను ఆనందంగా. పనిలో పనిగా పబ్లిషర్ కూడా పరిచయమవుతున్నాడు. నా రచనులను తన పబ్లికేషన్లో తీసుకువస్తాడేమో చూడాలి.

"సత్యనారాయణగారూ! మీరు నాకు నెలలో నవల చొప్పున అందించగలరా?" అడిగాడు పరాంకుశం.

"ప్రాయత్నిస్తాను!"

కారు బీచ్ రోడ్డు మీద పరుగెత్తుతోంది. దారినపోయే జనం చాలమంది ఎర్రటికారును ఆశ్చర్యంగా చూస్తోన్నట్టు నాకు వాళ్ళ చూపులు చెబుతున్నాయి.

శంకరరాజన్ మెల్లగా దగ్గాడు. "చూడండి సత్యం గారూ! మీరు రాయబోయే కథలో మన కారెక్టర్ యాక్టర్స్‌లో ఇద్దరికి అవకాశముండాలి. కమిడియన్ వుండాలి. డిటెక్టివ్ కి అసిస్టెంటుగాగానీ, విలన్ వద్ద వుండేటట్టుగాగానీ సృష్టించాలి. డిటెక్టివే హీరో.... అతడికి హీరోయిన్‌తో నాలుగయిదు పాటలు రాసి సిద్ధంగా వున్నాయి."

"కథకీ పాటలలోని సాహిత్యానికీ అతుకుతుందా?"

"సాహిత్యమా?" ఫెళ్ళున నవ్వాడు శంకర్ రాజన్. "తెరమీద సాహిత్యం ప్రదర్శిస్తామా? రెండు కాబరే డాన్సులను చూపిస్తానంటున్నాడు డైరెక్టర్. హోటలు సెట్టు వేయిస్తున్నాడు."

"నాకు అయోమయంగా వుంది సార్ ....ఇంకా కథా కాకరకాయా లేగు. అప్పుడే పాటలూ, సెట్టింగులూ.... నటులూ...."

నా అమాయకత్వానికి జాలి పడినట్టుగా చూచి నవ్వాడు శంకర్ రాజన్. పరాంకుశం శృతికలిపాడు. బీచ్ గాలి నాకు కితకితలు పెడుతోంది.

"సినిమా అంటే అతుకుల బొంత! ఏ విభాగానికి ఆ విభాగం అతుక్కురావడమే....ఆ విషయాలు చూసుకోవడానికి వేరే మనుషులూ వాళ్ళ విభాగాలూ వున్నాయి. రచయిత పని కథను సమకూర్చడం వొక్కటే!"

"పరాంకుశంగారివంటి రచయితను ప్రక్కన పెట్టుకుని నాకోసం వెతుక్కు రావడం నాకు ఆశ్చర్యంగా వుంది."

నా మాటలకు పరాంకుశం నవ్వాడు. శంకరరాజన్ అతడిని సీరియస్‌గా చూశాడు. "మావాడి సంగతి నాకు తెలుసు! అంటాడు మా బావ. ఏమయినప్పటికీ పెరటి మొక్క మందుకు పనికిరాదు సుమండీ!" అన్నాడు పరాంకుశం.

శంకర్ రాజన్ మెల్లగా నవ్వి, "నేను పదిసంవత్సరాలకు పైగా సాహిత్యం గురించి ఆలోచిస్తున్నాను. నా నిర్ణయాలు నావి!" అన్నాడు.

నేను దూరంగా పరచుకున్న సముద్రంవైపూ, దిగంతరేఖవైపూ చూచి ఆనందపడుతున్నాను. ఈ ప్రకృతిని చూచి చాలకాలమయింది. చల్లటి గాలితో మనసు సేద దీరుతోంది.

"పరాంకుశం! కారును ఆ ప్రక్క మట్టిరోడ్‌కి మళ్ళించు. అక్కడే ఆపి నడిచి వెళ్ళాలి మనం" అన్నాడు శంకర్ రాజన్.

ఇటు వైపు కొండలమధ్య లోయ. లోయ పచ్చగా చెట్లతో, పొదలతో అల్లిబిల్లిగా అల్లుకుపోయి వుంది.

మట్టి రోడ్డుమీద కారు ఆగింది. డోర్ తెరిచి పరాంకుశం కారు దిగాడు. నేనూ, శంకర్ రాజన్ చెరోక వైపూ కారు దిగాం. చుట్టూ నిశ్శబ్ద ప్రకృతి! ఎక్కడి నుండో పక్షి అరుస్తోంది. అంతే!

మట్టిరోడ్డు లతలతో మూసుకుపోయి కాలిబాట చిక్కిపోయి వుంది. ముగ్గురమూ కాలిబాట పట్టుకున్నాం.

"వైజాగ్‌లో పిక్చర్ తీస్తే మీకు నిర్మాణం ఖర్చులు ఎక్కువవుతాయేమో!" అడిగాను.

నిర్మాణం ఖర్చుల గురించి శంకర్ రాజన్ చెప్పుకు పోతున్నాడు.

## 2

చెవర్లెట్ కారు తిన్నగా మేనకా హోటలు ఆవరణలో ప్రవేశించింది. పార్కింగ్ ప్లేస్‌లో హుందాగా ఆగింది.

నేను చప్పున కారు దిగి హోటలులోకి నడిచాను. పరాంకుశం, శంకర్ రాజన్ కారులోనే కూర్చున్నారు.

పదో నెంబర్ రూం ముందు ఆగాను. పిడితిప్పాను. తాళం పెట్టి వుంది. గోడమీద వున్న స్విచ్ బోర్డులో చిన్న అట్టముక్క పెట్టివుంది. చటుక్కున దాన్ని అందుకుని చూశాను.

"డియర్ సత్యనారాయణా,

రాత్రికి రూంలోనే వుంటాను. సారీ ఫర్ మిస్సింగ్ —

శిరీష్."

అని వుంది.

నిట్టూర్చాను. కార్డును యథాస్థానంలోనే వుంచి నేను తిరిగి కారు వద్దకు వచ్చాను.

"మా ఫ్రెండు లేడు" అని చెప్పి కారు ఎక్కి కూర్చున్నాను.

కారు నన్ను మా యింటివద్ద రోడ్డు మీద డ్రాప్ చేసి వెళ్ళిపోయింది.

నేను మెల్లగా నడుచుకుంటూ ఇంటికి వచ్చాను. డ్రాయింగ్ రూంలో కూలబడ్డాను. మెల్లగా బట్టలు మార్చుకుని భోజనం చేశాను. కొంతసేపుపాటు నడుం వాల్చుదాం అనుకుంటూండగానే గుమ్మం దగ్గర చప్పుడయింది. చటుక్కున లేచి బయటకు వెళ్ళబోయి ఆగాను. అప్పటికే మా ఆవిడ తలుపు తీసింది. మా యిద్దరు పిల్లలూ బిలబిలాడుతూ స్కూలునుండి కాబోలు పరుగెత్తుకు వచ్చారు.

"ఏమండోయ్.... ఇటురండి...." పిలిచింది మా ఆవిడ.

నేను బెదురుగా ఆవులించి గుమ్మంవైపు నడిచాను. నా బెదురు దిగిపోయింది. డ్రాయింగ్ రూంలో ఒక మెరుపుతీగ సోఫాలో కూర్చుని వుంది. ఆమె నన్ను చూడగానే లేచి నిలబడి చేతులు జోడించింది.

నేను ఆమెకు ప్రతి నమస్కారం చేసి సోఫాలో కూర్చుండమని సైగచేసి నేనూ ఎదుటి సోఫాలో కూలబడ్డాను.

"నా పేరు వనజ" ఆమె గొంతులో కోయిల తిష్ట వేసినట్టుంది.

"సంతోషం. అందమైన పేరు" అన్నాను. ఆమె అప్పాయమ్మ అయినప్పటికీ ఆ పేరుకే అందం మరి!

"మీ క్రయిం కథలు నాకు బాగా నచ్చుతాయండి!

ఒకరకంగా నేను మీ కథలంటే పడిచస్తాను!" ఆమె చక్రాల్లాంటి కళ్ళు నల్లగా మిలమిలలాడాయి.

"క్రయిం కథలను సమర్థవంతంగా రాస్తే ఎవరి కథలయినా అందరికీ నచ్చుతాయి. అయ్‌మీన్ ఆ సాహిత్యం నచ్చేవారికి!"

"క్రయిం సాహిత్యం చదివాక మిగతా సాహిత్య ప్రక్రియలు చప్పగా తోస్తాయి. ఏమంటారు?"

నేను ఏమంటాను? అపరాధ పరిశోధన సాహిత్యం ఇలాంటి మెరుపు తీగకు నచ్చి చరితార్థమయింది?

"ఆమె మీ శ్రీమతిగారా?" అడిగింది వనజ.

నేను తల త్రిప్పి గుమ్మంలో నిలబడిన మా ఆవిడను చూశాను. నవ్వబోయి ఆగాను. మా ఆవిడ కళ్ళు ఎర్రగా వున్నాయి. వాటి ఎరుపుదనం నాకే తెలుసు! ఆమె కోపంగా నావైపు చూస్తోంది.

దీపం వెలిగింది. వనజ పల్చటి పమిట వేసుకుంది. ఎర్రటి ఆమె శరీరచ్ఛాయనూ, యవ్వనం హొయలనూ ఆమె దుస్తులు దాచడంలేదు. ఎర్రటి లిప్‌స్టిక్ వేసుకోవడంవలన కాబోలు ఆమె పెదిమలు దొండపండ్లలాగా మెరుస్తున్నాయి. ఒకచేతికి నల్లటి బెల్టున్న రిస్ట్‌వాచీ, రెండో చేతికి రెండు బంగారు గాజులూ, మెడలో ఒంటిపూస ముత్యాలహారం....

నేను చటుక్కున చూపు మరల్చుకున్నాను. ఇబ్బందిగా కదిలాను.

వనజ కొద్దిసేపు అవీ ఇవీ మాట్లాడి, లేచింది. "నన్ను హైవేమీద వరకూ దిగబెట్టండి. వెళ్ళిపోతాను. ఇంట్లో మావాళ్ళు నాకోసం ఎదురుచూస్తూ వుంటారు" అన్నది.

నేను బతుకుజీవుడా! అనుకుంటూ లేచి లోపలికి

నడిచి బట్టలు వేసుకున్నాను.

మా ఆవిడ నా వంక కోరగా చూచి వంటయింట్లోకి వెళ్ళింది.

వనజా నేనూ యింట్లోంచి బయటకు నడిచాం. వీధిన వెళ్ళేవాళ్ళు వనజను ఒకటికి పదిసార్లు చూస్తున్నారు. ఆమె చీరకట్టు సినీతారల తలదన్నినట్టు కట్టింది మరి!

ఇద్దరం హైవేమీదకు వచ్చాం.

"సత్యనారాయణగారూ! కాస్త కాఫీ త్రాగి వెళ్దాం" అంది వనజ.

ఆమెకు కాఫీ యివ్వలేని సమయంలో వనజ మా యింటికి వచ్చింది. ఆమె తనంత తాను అడిగినప్పుడు తప్పదు. ఇద్దరమూ హోటలువైపు నడిచాం. చిన్న హోటలు అది! హోటలు ఖాళీగా వుంది. ఇద్దరమూ ఒక టేబులువద్ద కూర్చున్నాం. సర్వర్‌ని రానిచ్చి ఒక ప్లేటు పకోడీ. రెండు కాఫీ ఆర్డరిచ్చాను.

సర్వర్ పకోడీ తెచ్చాడు. వనజ తింటోంది.

"అరరె! వక్కపొడి వుందా మీ దగ్గర?" అడిగింది వనజ.

"లేదు. మీకు వక్క అలవాటుందా?"

"అవునండి. కాఫీ త్రాగగానే వక్క నమలాలి" అంది వనజ, లేవబోతూ....

"అక్కరలేదు. నేను వెళ్ళివస్తాను. మీరు తింటూండండి!" నేను బయటికి వెళ్ళి వక్కపొడి కొని తెచ్చాను. వచ్చేసరికి టేబులు మీద రెండు కప్పులు సాసర్లు మూసివున్నాయి.

"కాఫీలు వచ్చాయి రండి!" అంది వనజ. ఆమె కళ్ళు వింతగా మెరుస్తున్నాయి. నేను నా కుర్చీలో

చారగిలబడి కాఫీ సిప్ చేశాను. ఆమె తన చేతిలోని గ్లాసును ఖాళీచేసి బల్లమీద పెట్టింది. ఆమె వెనుక నే నేనూ గ్లాసును పెట్టి వక్కపొడి అందించాను. నా చెయ్యి వణుకుతోంది. వళ్ళంతా వూగుతోంది. తల తిరుగుతోంది. నరాలు సాగుతున్నట్టూ, నా ఒంట్లో ఎవరో సుత్తులతో కొడుతోన్నట్టూ శరీరమంతా నొప్పులు.

తలను బల్లమీద వాల్చాను. నేలమీద వక్కపొడి పడిపోయి వుంది. చేతినిచాపి అందుకోబోయాను. అంతే! నా చెక్కిలి బల్లను తాకుతోంది. చెయ్యి అలాగే వుంచాను. కళ్ళు మూతలు పడిపోయాయి.

# 3

డిటెక్టివ్ శిరీష్ బద్ధకంగా లేచాడు. బెడ్ దిగాడు. ఒళ్ళు విరుచుకున్నాడు. వాచీ చూసుకున్నాడు. సాయంకాలం మూడు దాటుతోంది. నుదురు చిట్లించాడు.

సత్యనారాయణ పదకొండు గంటలకు తాను లేకుండా చూచి ఈ హోటలుగదికి వచ్చాడు. తాను స్విచ్ బోర్డులో పెట్టిన కార్డు చూచి వెళ్ళిపోయి వుంటాడు. అతడు వచ్చి వెళ్ళినట్టు కౌంటర్‌లోని మేనేజర్ చెప్పాడు. తాను ఒంటిగంటకి అతడి యింటికి వెళ్ళాడు. అప్పుడే అతడు ఎవరో అమ్మాయితో బయిటికి వెళ్ళాడట. వెళ్ళి గంట అయినా రాలేదని అతడి భార్య చెప్పింది.

ఇంత సేపు ఎక్కడికి వెళ్ళివుంటాడు? ఎక్కడా గంటలతరబడి గడిపే సమయం ఉత్సాహం అతడికిలేవు. అయితే ఆ అమ్మాయితోనే ఎక్కడికో వెళ్ళాడా? అసలు ఆ అమ్మాయి ఎవరు? ఆమెను ఇంతవరకూ ఎక్కడా చూడనట్టు సత్యనారాయణ వాళ్ళ యింట్లో తెలిసింది. ఇక్కడికి రాకపోతే మానె ఇంకా ఇంటికయినా చేరు

కున్నాడో లేదో—

డిటెక్టివ్ శిరీష్ చకచక తయారై హోటలు గదిలోంచి బయటపడ్డాడు. టాక్సీ మాట్లాడుకుని హైవే మీద దిగాడు. చకచక సందులోంచి నడిచివచ్చి సత్య నారాయణ ఇంటిముందు ఆగాడు.

సత్యవతి గుమ్మంలోనే దిగులుగా నిలబడి చూస్తోంది. సత్యనారాయణ ఇంకా రానట్టు ఆమె మొహంలో ఆవేదన స్పష్టంగా వ్యక్తమవుతోంది. శిరీష్ నోట్ బుక్ తీసి, "సత్యనారాయణగారు వెంట తీసుకువెళ్ళిన స్త్రీ పోలికలు చెప్పమ్మా! అతడిని వెతికి పట్టుకుంటాను!" అన్నాడు.

"ఆయనకి ఏమయిందంటారు?" ఆమె గొంతు వణికింది.

"ఏమీ అయుండదు. ఆయన క్షేమంగా తిరిగి వస్తాడు."

ఆమె ధైర్యం తెచ్చుకున్నది. వనజను వర్ణించింది. శిరీష్ నోట్ చేసుకుని ఆమెవద్ద సెలవుపుచ్చుకుని వెనక్కి తిరిగాడు. దారిపొడుగునా ప్రతి యింట్లోనూ అడుగుతూ హైవేమీదకు వచ్చాడు.

అక్కడినుండి బస్ స్టాప్ ఫర్లాంగు దూరం వుంటుంది. వనజను సిటీబస్సు ఎక్కించి వుంటాడా? ఆమెకు ఇంట్లో సత్యవతి అతిథిసత్కారం చేయలేదట. వనజ కట్టూ బొట్టూ ఏమంత గౌరవప్రదంగా లేవట!

సత్యనారాయణ ఆమెను ఏ పాన్ షాపుకో తీసుకెళ్ళి డ్రింక్స్ ఆఫర్ చేసి వుంటాడు. పురుష మన స్తత్వం బల హీనమైనది.

శిరీష్ తలపంకించి పాన్ షాపువైపు నడిచాడు.

"ఆ అమ్మాయితో వచ్చినతనాండి? కాఫీ హోటలుకి వెళ్ళారు. ఈ ప్రక్క హోటలే! చాల సేపయింది. 12 గంటలతర్వాత అనుకుంటాను. ఆ తర్వాత ఇద్దరూ ఆటో ఎక్కి కాబోలు వెళ్ళారు" అన్నాడు పాన్ షాపతను.

శిరీష్ అతడికి థాంక్స్ చెప్పి హోటలువైపు నడిచాడు. చిన్న సైజు హోటలది.

"అతడు వక్కపొడి తీసుకురావడానికి వెళ్ళివచ్చి కాఫీ త్రాగాడు సార్! తరువాత బల్లమీద తలపెట్టి పడుకున్నాడు. ఆమె దారినపోయే ఆటోను పిలిచి అతడిని నడిపించుకుంటూ ఆటో ఎక్కించి తీసుకువెళ్ళి పోయింది సార్!" అన్నాడు సర్వర్.

శిరీష్ నుదురు చిట్లించాడు. సత్యనారాయణకి వక్కపొడి అలవాటు లేదు.

"వాళ్ళిద్దరూ కూర్చున్న సీట్లు చూపిస్తావా?" అడిగాడు శిరీష్.

సర్వర్ అతడికి మూలగా వున్న రెండు కుర్చీలూ బల్లా చూపించాడు. శిరీష్ వాటిని పరీక్షగా చూచి, నేలమీదకు చూశాడు. నేలమీద అయిదుపైసల వక్కపొడి పొట్లం పడివుంది.

వనజ తనకి వక్కపొడి కావాలని సత్యనారాయణను బయటికి పంపివుంటుంది. ఎందుకు? కాఫీ త్రాగి స్పృహ తప్పి పడిపోవడానికి సత్యనారాయణ శరీరారోగ్యంలో ఆ మార్పు ఎలా వచ్చింది? వనజ అతడి కాఫీలో ఏదో కలిపివుండాలి.

'మై గుడ్ నెస్!' తల విదిలించాడు డిటెక్టివ్ శిరీష్. వక్కపొడికి కొంతదూరంలో చిన్న కాగితం మడత

వుంది. జేబు రుమాలుతో ఆ కాగితం మడత విప్పాడు. కాగితంలో రోజ్ కలర్ పౌడర్ అంటుకుని వుంది. వక్క పొడి పొట్లాన్ని, కాగితాన్ని తన జేబులో భద్రపరచి సర్వర్ ను పరీక్షగా చూశాడు.

"నువ్వు ఆటో వరకూ వెళ్లావా?" అడిగాడు శిరీష్.

"లేదు సార్!"

"ఆటోలో ఎవరయినా వున్నారా?"

"డ్రయివర్ ఒక్కడే వున్నాడేమో సార్! వెనక సీట్లో ఎవరయినా వుంటే ఆ ఆటో తిరిగి అద్దెకు ఎలా వస్తుంది సార్?"

"కాఫీ తాగిన వ్యక్తి తనకి తానుగా ఆటో ఎక్కలేదు గాబట్టి!"

సర్వర్ తెల్లబోయాడు.

"ఆటో ఎక్కడ ఆగిందో చూపిస్తావా?"

"ఆటో ఆగడం ఏమిటి సార్? అది ఒక గంటముందు నుండీ అక్కడే వుంది!"

శిరీష్ కళ్లు ఎర్రబడ్డాయి. ముక్కుపుటాలు అదిరాయి.

"అదేలే....ఆ స్థలం చూపించు!"

సర్వర్ బయటికి నడిచి మట్టిరోడ్డుమీద ఒక ప్రదేశంలో ఆగాడు. నేలమీదకు శిరీష్ పరీక్షగా చూశాడు. చాల రకాల అడుగుజాడలు పడి టైర్ల ముద్రలు చెరిగిపోయాయి.

రెండు సిగరెట్ పీకలు టైర్ గుర్తులకు రెండడుగుల దూరంలో పడివున్నాయి. తన జేబులోని కాగితంలోనికి వాటిని భద్రంగా సేకరించాడు శిరీష్. సువాసన వెదజల్లే సిగరెట్ల పీకలవి! సర్వర్ కి కృతజ్ఞతలు చెప్పి బయలు దేరాడు. టాక్సీని మాట్లాడుకుని ఎక్కి కూర్చున్నాడు.

టాక్సీ హైవేమీద పరుగెత్తుతోంది.

శరీఫ్ కిటికీలోంచి బయటికి చూస్తూ ఆలోచనలో పడ్డాడు. సత్యనారాయణకి ఈ ఉదయాన్నే సినిమాకి కథరాసే అవకాశం వచ్చింది. ఆ వెనకనే అతడు నిర్మాత వెంట బయటికి వెళ్ళాడు. లొకేషన్స్ చూపించడానికని అతడిని తీసుకెళ్ళాడట శంకర్ రాజన్.

లొకేషన్స్‌నుండి తిరిగి వస్తోనే హోటల్ మేనకాకి వచ్చి వుంటాడు సత్యనారాయణ. క్షేమంగా ఇంటికి తిరిగివెళ్ళి భోజనం చేశాడు. ఆ తర్వాత అతడిని మాయం చేశారు. ఎవరు? అతడిమీద కక్ష పెంచుకోవడం ఎందుకు? శంకర్ రాజన్ అతడిచేత తప్పుడు ఎగ్రిమెంట్లు రాయించుకోవడానికి ఈ పద్ధతిని ఎన్నుకున్నాడా?

ఆటో దొరికినా తనకి పెద్ద ప్రయోజనం వుండదు. రెండుమూడు వాహనాలు మారి తమ స్థావరం చేరుకుంటారు వాళ్ళు.

"పోలీస్ స్టేషన్ ముందు ఆపు!" అన్నాడు డిటెక్టివ్ శరీఫ్.

## 4

కళ్ళు తెరిచి చూశాను.

విశాలమైన గది. నేను బెడ్ మీద పడుకునివున్నాను. బెడ్ మెత్తగావుంది. పైకప్పూ, గోడలూ ఎర్రటి రంగులో వున్నాయి. గదిలో ఒకే ఒక్క ఎలక్ట్రిక్ బల్బూ, మధ్యలో ఫాన్. బెడ్ కి కాస్త దూరంలో కుర్చీ వుంది. గోడలకి అటొకటి యిటొకటి కిటికీలు వున్నాయి. అవి మూసివున్నాయి.

గదిలోకి వెంటిలేటర్ ద్వారా వెలుగు వస్తోంది. పగలయి వుంటుంది.

ఉన్నట్టుండి లేవబోయాను. నా తలమీద ఎవరో సుత్తితో కొట్టినట్టయింది. కిటికీకి కాస్త యివతలగా పెద్ద సైజులో టెలివిజన్ సెట్టు స్టాండుమీద పెట్టివుంది. ఈ గది నాది కాదు. కనీసం నేను ఎన్నడూ ఎరిగినది కాదు. టెలివిజన్ సెట్టులు చూశాను. ఎంజాయ్ చేశాను. కాని ఇంత వైడ్ స్క్రీన్ వున్న సెట్టును చూడలేదు. నేను ఇప్పుడు ఎక్కడ వున్నాను? అన్నట్టు వనజ ఏదీ? కనిపించదేం? నన్ను ఈ గదిలోకి ఎలా తీసుకు వచ్చింది వనజ?

నా ఆలోచనలు చిన్న కాఫీ కొట్టుకు తగులుకుని ఆగి పోయాయి. అక్కడే కాఫీ త్రాగి బల్లమీద తలవాల్చాను. వనజ మెల్లగా నన్ను లేవనెత్తింది. కొన్ని అడుగులు నడవడం ఎక్కడో కూలబడటం జరిగింది. అంతే. ఆ తర్వాత ఏం జరిగిందో నాకు గుర్తులేదు. వనజ నన్ను ఎక్కడికి తీసుకువచ్చింది?

ఆమె నిజంగా సాహిత్యాభిమాని కాదా? సాహిత్యంలో చదువుకుని ఆనందించే సంఘటనలనూ, నేరాలనూ ఆమె ప్రాక్టికల్ గా చేయాలని కుతూహలపడుతుందా? అయినా నన్ను దాచి ఏం ప్రయోజనం? కోట్ల నల్ల ధనం మూలిగే సేట్ జీల సంతతి వాడిని కాను కూడానూ.

ఆలోచించే కొద్దీ నాకు మతిపోయింది. నేను ఇల్లు వదిలిపెట్టి ఎంత సేపయిందో? గంటలో, రోజులో! వాచీ చూసుకున్నాను. ఏడు గంటలు దాటి అయిదు నిమిషాలయింది. ఉదయం అయివుండాలి. వెంటిలేటర్ లోంచి వెలుగువస్తోంది. నాకు పిచ్చెత్తినట్టయింది.

నా రెండు చేతులకు తాళ్ళు కట్టివున్నాయి. ఆ తాళ్ళ కొసలు గోడవైపు వున్నాయి. తలవంచి చూశాను.

మొత్తం నాలుగు రింగులలో నాలుగు త్రాళ్ళు కట్టి వున్నాయి. మిగతా రెండు త్రాళ్ళు నా కాళ్ళవి. నా మీద వనజకు ఇంత కక్ష దేనికి? వనజలాంటి సౌందర్యవతికి నేను ఏం అపకారం చేశాను?

ఏమయినప్పటికీ వనజను అపరాధిగా ఎంచ బుద్ధి గావడంలేదు. వనజ ఎవరి ప్రోద్బలం మీదో నన్ను పట్టి బంధించడానికి సహకరించి వుంటుంది. ఆమె కళ్ళలో నాకు ఎలాంటి క్రూరత్వమూ కనిపించలేదు.

తల విదిలించాను. మెల్లగా మంచం దిగాను. నాలుగు త్రాళ్ళూ నన్ను మంచం దగ్గరే నిలబెట్టాయి. అంతకిమించి నడిచేలాగా అవకాశం యివ్వడం లేదు. నేను నిరాశగా చుట్టూ చూశాను. తాళ్ళను విప్పుకోవడానికిగానీ, కట్ చేయడానికిగానీ ఎలాంటి అవకాశమూ లేదు. సన్నటి తాళ్ళను రకరకాల ముడులు వేసి చేతులవద్ద ఇనుప రింగులు తొడిగారు. ఎవరో ఖైదీ తప్పించుకున్నట్టు వాటిని కొరికి కొరికి త్రాళ్ళను వదిలించుకోవాలి.

గదికి ఒకటే గుమ్మం వుంది. తలుపులు ఎలా తెరచు కుంటాయి? సినిమాలలో అయితే భుజాలతో తాకించి తలుపులను ఒక్క వుదటున పడగొట్టి హీరో విలన్ని దొరకబుచ్చుకుంటాడు. నేను హీరోను కాను.

"వెల్! నీ నటన చాలా బావుంది సత్యనారాయణా!"

నేను వులిక్కిపడి చుట్టూ చూశాను. ఎవరూ లేరు! వెంటిలేటర్ వద్ద నల్లగా కనిపిస్తోంది. మాత్ పీస్‌లా వుంది. వెంటిలేటర్ వద్ద నిలబడి ఎవరో ఆ మాత్ పీస్‌వంటి మినీ మైక్‌తో మాట్లాడారు.

"ఎవరినయినా బంధించితే వాళ్ళ నటన సహజంగా ఎలా వుంటుందో, ఆ వ్యక్తి ఎలా తెల్లబోయి అనుక్షణమూ

బెదిరిపోతూంటారో నిన్ను చూస్తే స్పష్టంగా అర్థమౌతోంది!"

"ఎవరు నువ్వు?" అరిచాను.

అవతల ప్రక్క నవ్వు వినిపించింది. తెరల తెరల నవ్వు!

క్షణాలు గడుస్తున్నాయి. తలుపువద్ద శబ్దమయింది. తలుపులు వున్నట్టుండి తెరుచుకున్నాయి. అవతల ఎవరో పనిమనిషి నిలబడివుంది. ఆమె చేతిలో తాళం చెవులున్నాయి. ఆమె నిస్సంకోచంగా లోపలకు వచ్చింది.

ఆమె దుస్తులు మాసివున్నాయి. జుత్తుకు చమురులేక ఎర్రబడివుంది. ఆమె చురుకుగా నా వద్దకు వచ్చింది.

నేను ఆమెను గమనిస్తూనే తలుపుల అవతలకు చూశాను. తలుపు అవతల గజం దూరంలో తెల్లటి గోడ తప్ప ఏమీ లేదు. వెలుగులో ఆ గోడమీద ఎవరిదో నీడ పడింది. మరుక్షణంలో గోడదగ్గర భారీ ఆకారం వున్న వ్యక్తి నిలబడివున్నాడు. అతడి చేతిలో మెషిన్‌గన్ నావైపే గురిపెట్టి వుంది.

పనిమనిషి తనవద్ద వున్న తాళంచెవులతో నా చేతుల రింగులు విప్పి, తర్వాత కాళ్ళ రింగులు విడదీసింది. నేను స్వతంత్రుడినయ్యాను. నాకు ఒక్క క్షణంపాటు పనిమనిషిని అతడిమీదకు విసిరికొట్టి తప్పించుకు పారిపోవాలనిపించింది. నాకు ఈ భవనంలోంచి పోగలనన్న ధైర్యం వుంది.

చటుక్కున పనిమనిషిని ఒడిసిపట్టుకుని నాకు కవచంగా పెట్టుకున్నాను. క్లిక్ మన్నది. ఆ శబ్దం మెషిన్‌గన్‌ది. సేఫ్టీకాచ్ తప్పించాడన్న మాట.

"నో ట్రిక్స్!" అరిచాడు అతను.

నేను పనిమనిషిని అలాగే పట్టుకుని గుమ్మంవైపు కదిలాను. వెంటిలేటర్ వద్ద తెరల తెరల నవ్వు వినిపించింది.

"ఇద్దరినీ షూట్ చేసెయ్యి!" అరిచాడు మైక్ లోంచి.

మెషిన్ గన్ పట్టుకున్న వ్యక్తి చటుక్కున హేండిలును కదపబోయాడు.

"ఆపండి!" అరిచాను. చటుక్కున పనిమనిషిని వదిలి పెట్టాను. వాళ్ళు టపాకాయలు కాల్చినంత సులువుగా మనుషులను కాల్చగలరు అనిపించింది. నా గురించి పని మనిషిని బలిపెట్టడం అవివేకం!

నేను పట్టు విడిచిపెట్టగానే పనిమనిషి ఏమీ జరగ నట్టుగా నడిచివెళ్ళి గదిగోడలో తాళంచెవిపెట్టి తిప్పింది. ఆశ్చర్యం! గోడలోకి తలుపు తెరుచుకుంది. అంటే అంతసేపూ తలుపు గోడ రంగులో కలిసిపోయిందన్న మాట!

"అది బాత్ రూం! త్వరగా కాలకృత్యాలు తీర్చుకో. పిచ్చివేషాలు వేయక! హింసలోకి దిగవలసి వస్తుంది!" మైక్ లోంచి అరిచాడు. నేను మౌనంగా బాత్ రూంలోకి నడిచి తలుపు మూసుకున్నాను.

## 5

స్పృహ వచ్చినప్పటినుండీ ఈ గదిలోనే ఒకరోజు గడిచిపోతోంది. చీకటిపడబోతోంది. చేతులవంక చూసు కున్నాను. మధ్యాహ్నం భోజనం అయిన తర్వాత నన్ను కుర్చీలో కట్టి వెళ్ళిపోయింది పనిమనిషి. ఒకే పద్ధతిలో కూర్చొండి వుండటం వలన నడుమునొప్పి పెడుతోంది. బోర్ గావుంది. కాలాన్ని అమూల్యంగా భావించవలసిన కాలం అది.

శంకర్ రాజన్ నాకు పదివేల రూపాయిలిస్తాడు. నా

కథను చిత్రంగా తీస్తాడు. ఈ రెండు రోజులూ నేను కనిపించకుండాపోతే ఆయన చిత్రం ఏంగాను?

నాకు వింత ఆలోచనలు వస్తున్నాయి. ఆయన చిత్రానికేం వచ్చింది? ఎందరో హేమాహేమీలు సిద్ధహస్తులు అయిన రచయితలనుండి ఆయన తన అభిరుచికి అనుగుణంగా రాయించుకుని వంద సినిమాలు తీయగలడు. కేవలం నా అదృష్టంకొద్దీ నాకు ఈ అవకాశం వచ్చింది.

అదృష్టాన్ని నమ్మకపోయినా ఇలాంటి ఛాన్స్‌ని ఏమంటారో వ్యవహారంలో లేదు. ఇలాంటి అపూర్వమైన ఛాన్స్‌ని పోగొట్టడానికి ఎవరో నన్ను కావాలని ఈ రకంగా కిడ్నాప్ చేసి వుంచారా? ఆశ్చర్యం! నామీద కోపం ఎవరికి? ఈ మాత్రం కక్ష గట్టవలసిన అవకాశాలు వచ్చేలాగా నేను యెవరితోనూ ఘర్షణలకి దిగేవాడిని కూడా కాదు.

ఉన్నట్టుండి గదిలో చిమ్మచీకటి అలుముకుంది. వెంటిలేటర్ వద్ద నల్లటి తెర అడ్డం వచ్చినట్టుంది. చీకట్లో చూడటానికి నా కళ్ళు అలవాటు పడుతున్నాయి. అకస్మాత్తుగా చక్ మన్న శబ్దమయింది. టెలివిజన్ ఆన్ అయింది. తరంగాలు అడ్డగీతలు చకచక కదులుతున్నాయి. మిలమిలలాడే అక్షరాలు కదిలిపోతున్నాయి.

టెలివిజన్‌ని ఎవరు ఆన్ చేశారు? దానికి స్విచ్ బోర్డ్ గానీ, విద్యుత్తు ప్రవహించడానికి తీగెలుగానీ ఉన్నట్టు నేను చూడలేదు. నాకు కాలక్షేపం కోసం టెలివిజన్‌ని ఏర్పాటు చేశారన్నమాట! వాళ్ళ మర్యాదకి ముచ్చటేసింది. మా ఆవిడా పిల్లలూ వుంటే వాళ్ళు బాగా యీ టెలివిజన్ ప్రదర్శనను ఎంజాయ్ చేసేవాళ్ళు. నా కళ్ళు స్క్రీన్ మీద నిలబడిపోయాయి. చిత్రం తాలూకా

టైటిల్సూ, సర్టిఫికేటూ కనిపిస్తున్నాయి. అక్షరాలు స్పష్టతను దిద్దుకున్నాయి. చదవసాగాను.

"డ్రాక్యులా హాజ్ రిజెన్ ఫ్రం ది గ్రేవ్!" ఆశ్చర్యం! ఈ చిత్రాన్ని పదేళ్ళక్రితం చూశాను. డ్రాక్యులా సీరీస్‌లో అదే నేను చూచిన మొదటి చిత్రం! స్క్రీన్ మీద రంగులు కదులుతున్నాయి.

పన్నెండు సంవత్సరాల కుర్రవాడు చర్చిలోకి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతడి కళ్ళలో మూగతనం, అమాయకత్వం. చర్చి మెయిన్ హాలులో పొడవుపాటి త్రాడు వ్రేలాడుతోంది. మూగకుర్రవాడు త్రాడు దగ్గరకు వచ్చాడు. చర్చి గంటకి కట్టిన త్రాడు అది. గంట మ్రోగించడానికి కాబోలు వాడు త్రాడును అందుకుని లాగాడు. గంట మ్రోగలేదు. నా గుండెలలో ఉద్రేకం మొదలయింది.

గంట యెందుకు మ్రోగలేదో గుర్తొస్తోంది. నాకు ఒళ్ళు చెమటలు పట్టింది. కుర్రవాడి చేతికి జిగటగా తగిలింది. వాడు ప్రశ్నార్థకంగా తాడు వెంబడే పైకి చూశాడు. సీలింగుకి వున్న రంధ్రంలోంచి త్రాడు పై అంతస్తుకి వెళ్తోంది. త్రాడు వెంబడే రక్తం కారి అంటుకుని గాలికి జిగటకట్టింది.

కుర్రవాడి కళ్ళలో ఆసక్తి! భయం! చకచక మెట్లు ఎక్కి వాడు పై అంతస్తుకి వెళ్ళాడు. బ్రహ్మాండమైన గంట వ్రేలాడుతోంది.

"డంగ్!" విపరీతమైన స్థాయిలో డ్రంస్ మ్రోగాయి. గదిలో స్టీరియో శబ్దం ఒక్కసారిగా నన్ను భయంకంపింతుడిని చేసింది.

గంటలో మధ్య రాడ్ వ్రేలాడే స్థలంలో స్త్రీ శవం

తల క్రిందులుగా వ్రేలాడుతోంది. ఆమె కంఠంలోంచి నెత్తురు పీల్చినట్టు గాయం! శవం కళ్ళు పత్తికాయల్లాగా పగిలివున్నాయి. నాకు కడుపులో దేవింది. నా చుట్టూ చీకటి. నన్ను ఒంటరిగాడిని చేసి ఈ హారర్ సినిమాను చూపిస్తున్నారు. పదేళ్ళక్రితం ఈ చిత్రం చూసి తారెత్తాను. ఇంగ్లీషు చిత్రాల్లోని చిత్రీకరణ అతిసహజంగా, మరీ భీభత్సంగా వుంటుంది.

మూగవాడు పెడబొబ్బలు పెట్టుకుంటూ బాణంలాగా రోడ్డుమీద దూసుకుపోతున్నాడు. నేను ఒక్క ఉదుటున లేచివెళ్ళి టెలివిజన్ని ఆఫ్ చేయాలనుకున్నాను. నా బంధనాలు నన్ను మరింత గట్టిగా వొరుసుకున్నాయి. చేసేదిలేక కళ్ళు మూసుకున్నాను. స్టీరియో శబ్దాలు చెవులను అదరగొడ్తున్నాయి.

అకస్మాత్తుగా శబ్దాలు ఆగి ఇంగ్లీషులో సంభాషణలు వినిపిస్తున్నాయి. మూగకుర్రాడిని గ్రామస్తులు ప్రశ్నలు వేస్తున్నారు. చర్చి అసమర్థంగా వూరుకోరాదని గ్రామస్తులు ప్రతిపాదనలు చేస్తున్నారు.

సినిమా చకచక సాగుతోంది. నాకు చూడ బుద్ధి కావడంలేదు. కాని యెంతసేపని కళ్ళు మూసుకోను? రెప్పలు నొప్పిపుడుతున్నాయి. ఇదో కొత్తరకం హింస అనుకుంటాను. హింస విషయం అలా వుంచితే నన్ను ఏ ప్రయోజనంతో ఈ రకంగా వుపయోగించుకుంటున్నారో మాత్రం తెలియరావడం లేదు.

కళ్ళు తెరిచాను. స్క్రీన్ మీద చర్చిఫాదర్ కనిపించాడు. అతని వెంట గ్రామపెద్ద కొండ ఎక్కుతున్నాడు. కొండమీద డ్రాక్యులా భవనం వుంది. 'గంటలో స్త్రీ శవం' గ్రామస్తులలో బాగా అలజడి

తెచ్చింది. ఆ శవం అక్కడ వుండటానికి కారణం డ్రాక్యులా తన భవనంలో తిరిగిబడికి చెలరేగడమా కాదా అన్నది తేల్చుకోవడానికి వాళ్ళిద్దరూ బయలుదేరుతున్నారు.

ఫాదర్ ఒకదారిన, గ్రామపెద్ద ఒకదారిన విడిపోయి కొండ యెక్కుతున్నారు. పెనుగాలికి వాళ్ళ దారులు విడిపోయాయి. ఫాదర్ తన సీసాలోంచి మద్యంతీసి తాగుతాడు. గాలి తాకిడికి క్రిందకు జారి పడతాడు. చర్మం చిట్లి రక్తం కారుతుంది.

ఆ రక్తం నేలలోకి ఇంకి సరిగ్గా అక్కడే పాతిపెట్టిన డ్రాక్యులా శవం పెదిమలకు అంటుకుంది. ఫాదర్ దగ్గరలో వున్న నీటిచెలమలో రక్తం కడుక్కోబోతాడు. ఆ నీటిలో పొడవుపాటి కోటు వేసుకున్న ఆకారం ప్రత్యక్ష్యమవుతుంది. కోల మొహం.

ఫాదర్ బెదిరి వెనక్కి తిరిగి చూస్తాడు.

డ్రాక్యులా. అతడి కళ్ళు పచ్చగా వున్నాయి. పొడవుపాటి ముక్కు, స్థిరమైన పట్టుదలా, ప్రపంచాన్ని జయించాలనే యావా అతడి కళ్ళలో రక్త పిపాసా.... ఫాదర్ ఠారెత్తిపోతాడు. పారిపోబోతాడు.

కుర్చీలో వెనక్కి వాలాను. స్టీరియో శబ్దం భయంకరంగా వుంది. కళ్ళు మూసుకున్నాను. నా ప్రక్కన అలికిడయింది. డ్రాక్యులా నా ప్రక్కకి వచ్చి నిలబడినట్టయింది.... అంతే! స్పృహ తప్పింది నాకు.

## 6

డిటెక్టివ్ శిరీష్ కారు ఆపాడు.

చుట్టూ కొండలు. ఒకప్రక్క సముద్రం. హోరుగాలి బట్టలనూ జుత్తునూ రేపుతోంది. కొండల మధ్య లోయ

లోకి సన్నటి కాలిబాట వెడుతోంది. శిరీష్ తను వచ్చిన కారుకి తాళంపెట్టి దిగి కాలిబాట పుచ్చుకున్నాడు. మెరక దాటి అర మైలు నడిచాక చెట్లగుబురులో అలజడి వినిపిస్తోంది. "లైట్స్....ఎస్....మూవ్....డైలాగ్" లాంటి మాటలను ఉండి ఉండి గాలి మోసుకు తెస్తోంది.

శిరీష్ గుబురువైపు నడిచాడు. చెట్లకి యివతల కొందరు మనుషులు ట్రాలీ బాగుచేస్తున్నారు. మరికొందరు వైరింగ్ పనులు చేసుకుంటున్నారు.

డిటెక్టివ్ శిరీష్‌ను వాళ్ళు పట్టించుకోలేదు. చెట్ల గుబురులో ప్రవేశించాడు.

ఎదురుగా లంకంత భూతాల కొంత. ఏ నాటిదో పాత బడి వర్షాలకు పుచ్చిపోయిన గుర్రపుబగ్గీ భూతాల కొంప ముందు పడివుంది. భవంతిగా వుండవలసిన ఆ కట్టడం అటూ యిటూ కూలిపోయి కొంపలాగా తయారయింది. దానిచుట్టూ వున్న ఆవరణలో వందలాది ప్రేక్షకులు నిల బడి వున్నారు.

ప్రేక్షకుల వలయం మధ్య షూటింగ్ జరుగుతోంది. పెద్దస్టాండు మీద కెమెరా దాని యెదురుగా ఫ్లడ్ లైట్స్ పట్టుకున్న మనుషులూ, లైట్స్‌కీ, కెమెరాకీ మధ్య నటీ నటులూ, కెమెరా ప్రక్కగా కెమెరామాన్, అతడి అసి స్టెంటూ....అతడి ప్రక్కగా....

డిటెక్టివ్ శిరీష్ చటుక్కున సూచనలిస్తోన్న శంకర రాజన్‌ని సమీపించాడు. శంకరరాజన్ సూచనలివ్వడం ఆపి వ్యూఫైండర్‌లోకి వొంగిచూచి, "ఈ కట్టడం బాక్ గ్రౌండ్‌తో హీరో హీరోయిన్‌లను రెండు షాట్స్— మొహంలో మొహంపెట్టి క్లోజప్‌లో .... లైటింగ్ మీడియమ్...." అంటున్నాడు.

షాట్ మొదలయింది.

"శంకరరాజన్ గారూ!" పిలిచాడు డిటెక్టివ్ శిరీష్.

శంకరరాజన్ తలత్రిప్పి చూశాడు. "హలో మీరు... శిరీష్ కదూ, '70 ఎం. ఎం. ఫిలిం' కేసులో మా స్టూడియోకి వచ్చారు" అన్నాడు శంకరరాజన్.

శిరీష్ తలూపి, "థాంక్యూ, మీ బిజీలో కూడా మీరు నన్ను గుర్తుంచుకున్నారు. మీకు కాస్త తీరిక దొరికితే నాతో ఒక పావుగంట స్పేర్ చేయగలరా?" అన్నాడు.

"తప్పకుండా! పరాంకుశం! నేను అలా వెళ్ళివస్తాను. షాట్ పెర్ఫెక్ట్‌గా రావాలి" అంటూ శిరీష్ వెంట నడిచాడు శంకరరాజన్.

ఇద్దరూ నడుచుకుంటూ చెట్ల గుబురువైపు వెళ్ళారు. శంకరరాజన్ తన చొక్కా జేబులోంచి గోల్డెన్ సిగరెట్ కేసుతీసి సిగరెట్ ఆఫర్ చేశాడు. శిరీష్ తల అడ్డంగా త్రిప్పి, "థాంక్స్!" అన్నాడు.

శంకరరాజన్ సిగరెట్టు ముట్టించి పొగపీల్చాడు. సువాసన గాల్లో వ్యాపించింది.

"అడగండి. మీకు నేను ఏం సమాచారం యివ్వగలను?"

శంకరరాజన్ వైపు చూశాడు శిరీష్.

"నా మిత్రుడి వ్యవహారంలో మీ చిత్ర నిర్మాణం గురించి కొన్ని వివరాలు అడుగుతాను. దయచేసి చెబుతారని నమ్ముతున్నాను" అన్నాడు శిరీష్.

"మీ మిత్రుడా? ఆయనెవరు?" అడిగాడు శంకరరాజన్.

"మీరు కథ రాయించుకోవాలనుకున్న ఎమ్.వి.వి..."

"అతడా! బలే రచయితండీ బాబూ! కాంట్రాక్టు

రాయించుకుందామనుకున్న సమయం నుండీ మనిషి మిస్సయిపోయాడు!"

"మీరు కథ రాయించుకోవడం కోసం మరొకరిని సంప్రదించవలసి వచ్చిందనుకుంటాను."

"అబ్బే! అదేంలేదు. నేను అతడి కథను సినిమాగా తీయాలనుకున్నప్పుడు నా నిర్ణయం మారే ప్రసక్తి లేదు. స్క్రిప్టు అతడిదే!"

శిరీష్ ఆశ్చర్యంగా చూశాడు.

"రెండు రోజులలో కొన్ని సీన్స్ ఇస్తానన్నాడు. లొకేషన్స్‌ని దృష్టిలో పెట్టుకుని రాశాడు. నాకు రోజుకి రెండు మూడు సీన్సు చొప్పున యిస్తున్నాడు. ఈ లోపులో నేను పాటలను చిత్రీకరించుకుంటున్నాను. మరో గంటలో సెకండ్ యూనిట్ యారాడ కొండ మీద షూటింగ్ మొదలుపెడుతుంది."

"స్క్రిప్టు భాగాలు మీకు ఎలా అందిస్తున్నాడు?"

"నా హోటలు రూంకి బాయ్ చేత పంపిస్తున్నాడు."

"అతడు యింట్లోంచి బయటికి వెళ్ళి మూడు రోజులయింది."

శంకరరాజన్ నవ్వాడు. "రచన సాగదని అజ్ఞాతవాసం చేస్తున్నాడన్న మాట! మా సినిమా రచయితలంతా మహాబలిపురంలో దాక్కుంటారు" శంకరరాజన్ సిగరెట్టు ఆర్పి క్రింద పారేశాడు.

"అతడిని ఎవరో ఎత్తుకుపోయారు?"

"ఈజిట్?"

"అవును. మూడురోజుల క్రితం ఎవరో అభిమానినని వనజ అనే అమ్మాయి వచ్చింది. అతడు త్రాగే కాఫీలో మత్తుమందు కలిపి ఆటోలో తీసుకువెళ్ళింది."

"నమ్మదగిందిగా లేదు."

"ఏం?"

"సత్యనారాయణ చంటిపిల్లవాడు కాదు!"

"కరెక్టు! వనజకి పరిసరాలూ, పరిస్థితులూ బాగా అనుకూలించాయి."

"అతడిని యెత్తుకుపోవలసిన అవసరం యెవరికి వుంటుంది?"

"అతడూ వనజా యెక్కిన ఆటో దగ్గర ఈ సిగరెట్ పీకలు రెండువున్నాయి" అంటూ శిరీష్ క్రిందపడిన సిగరెట్టుపీకను పెకితీశాడు.

"ఇదేమిటి? అనుమానం నా మీదకు వచ్చిందా?"

శిరీష్ చురుకుగా చూశాడు.

"ఈ బ్రాండ్ సిగరెట్టు తాగేవ్యక్తి ఆటోలో కూర్చుండి వుండగా వనజ సత్యనారాయణను నడిపించుకుంటూ వచ్చి ఆటోలో ఎక్కించింది!"

"నాకు అతడిని యెత్తుకుపోవలసిన అగత్యం ఏమిటి?"

"మీకు ఆ అగత్యం లేకపోవచ్చు. మొదటి అనుమానితులు మీరు."

"మై గుడ్ నెస్! అలాంటి చిన్నసైజు రచయితతో కాంట్రాక్టు రాయించుకోవడం నాదే తప్పు!"

"కాంట్రాక్టుకి సొమ్ము చెల్లించారా?"

"అయిదువేలు అడ్వాంసు యిచ్చాడు. పిక్చర్ రిలీజ్ నాడు మిగతా అయిదువేలూ యిస్తాను. నా దగ్గర పని చేసే ఆర్టిస్టులకూ, టెక్నీషియన్లకూ నేను ఈ పద్ధతిలోనే సొమ్ము చెల్లిస్తాను."

"రసీదు చూడనిస్తారా?"

"తప్పకుండా. రసీదు పంపుతూ యూనివర్సిటీ స్టేట్

బాంకులో తన అక్కౌంటుకి అయిదువేలూ క్రెడిట్ చేయించమని కోరాడు. అలాగే చేశాను."

శరీఫ్ తల విదిలించాడు.

"మిష్టర్ శరీఫ్! నేను సత్యనారాయణను కిడ్నాప్ చేస్తే నా మీద అనుమానం వచ్చేలాగా యెందుకు ప్రవర్తిస్తాను?"

"అంటే?"

"అసలు కాంట్రాక్టు వరకూ వ్యవహారం రానే రాదు కదా! పైగా సిగరెట్టు పీకలు—అవీ ప్రత్యేకంగా కొంత మందే వాడగలిగిన సిగరెట్లు అనుమానాస్పదమైన పరిసితులలో యెలా వదులుతాను?"

శరీఫ్ అతడిని పరీక్షగా చూచి, "ఈ సిగరెట్లు మీ యూనిట్లో మరెవరైనా కాల్చుతారా?" అన్నాడు.

శంకరరాజన్ చిరాకుగా చూశాడు. "ఏం చెప్పగలను? లెక్కా జమా తెలీని రంగం మాది! నా సిగరెట్స్‌ను యెవరయినా అపహరించి కాల్చగలిగే సావకాశాలు వుండవచ్చు. ఉండకపోనూవచ్చు. రండి రసీదులు చూపిస్తాను!"

## 7

క్రైంబ్రాంచి ఇన్స్‌పెక్టర్ కుమార్ నిట్టూర్చాడు. చురుకుగా శరీఫ్‌ని చూచి, "కేసు ముందుకు నడిస్తేనే కాని, మేము అడుగుపెట్టడానికిలేదు. పైగా సత్యనారాయణ తరఫున ఎవరూ ఎలాంటి ఫిర్యాదు చేయనిదే నేను అధికారికంగా ఈ విషయంలో ఏం కలగజేసుకోను?" అన్నాడు.

శరీఫ్ ఆశ్చర్యంగా చూచి, "అతడి భార్య కంప్లయింట్ ఇస్తానన్నది. ఇంతలో ఏమయింది?" అన్నాడు.

"కంప్లయింట్ ఇవ్వనున్నట్టు నీకు యెప్పుడు చెప్పింది?"

"నిన్న సాయంత్రం."

"యెందుకయినా మంచిది. అతడి ఇంట్లో ఎలాంటి ప్రమాదమూ రాలేదుకదా—కానిస్టేబులును అక్కడ మఫ్టీలో వుంచనా?"

"దటీజ్ బెటర్! నేను ఒకసారి చూసివస్తాను" డిటెక్టివ్ శిరీష్ లేవబోయాడు.

"పది నిముషాలు ఆగు. వేలిముద్రల రిపోర్టులు వచ్చాయి."

శిరీష్ ఆసక్తిగా చూశాడు.

"సత్యనారాయణా, వనజా యెక్కి వెళ్ళిన ఆటోవద్ద దొరికిన సిగరెట్ పీకలమీది వేలిముద్రలు శంకర్ రాజన్‌వి కావు."

శిరీష్ అలాగేనన్నట్టు తలూపాడు.

"పాత నేరస్తులివీ కావు. సిగరెట్ పీకలతో బాటు నీకు చిన్న హోటలులో దొరికిన వక్కపొడి పొట్లం మీద ఆడదాని వేలిముద్రలున్నాయి. ఆమె పాత నేరస్తురాలు కాదు."

"శంకర్ రాజన్‌తోనే ఆ సిగరెట్లు విశాఖపట్నం వచ్చినట్టున్నాయి. అవి ఇక్కడ దొరకవు. దిగుమతి సరుకులు అమ్మే వ్యక్తులందరినీ దర్యాప్తు చేశాను. మద్రాసులో స్మగుల్ అయ్యే సిగరెట్లు అవి!" అన్నాడు శిరీష్.

కుమార్ కోపంగా చూచి, "కస్టంస్ వాళ్ళకి తెలియపరిస్తేనో...." అన్నాడు.

శిరీష్ హేళనగా నవ్వాడు. "నీకు తెలియని ధర్మ

సూక్ష్మం కాదు. యెక్కడికక్కడ బిస్కట్లు పెట్టి మచ్చిక చేసుకునే తెలివైన మనుషులుంటారు ఈ పుణ్యభూమిలో. యెటొచ్చీ శంకర గిరి మన్యాలు పట్టిపోయేది నీలాగా నిజాయితీ ప్రదర్శించేవాళ్ళే!"

కుమార్ నవ్వలేక నవ్వి "సత్యనారాయణ రాసి యిచ్చిన కాంట్రాక్టూ, అయిదువేలు అందినట్టు రాసి యిచ్చిన రశీదూ శంకర్ రాజన్ వద్ద పరిశీలించావు కదా! వాటిమీద నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

"వాటిలో ఎలాంటి లోపమూ లేదు. సత్యనారాయణ అక్కౌంట్ లో జమ అయినట్టు బాంకులో తెలుసుకున్నాను."

"అయితే ఇక మనకి ముందుకుపోయేదారి ఏం తెలుస్తుంది?"

"నువ్వూరా! సత్యనారాయణ యింటికి వెళ్దాం. ఏమైనా వివరాలు తెలియవచ్చును."

కుమార్ జీపు బయలుదేరతీశాడు. పావుగంటలో ఇద్దరూ సత్యనారాయణ ఇంటికి వెళ్ళారు. డ్రాయింగ్ రూంలో కూర్చున్నారు.

"ఆయన వద్దనుండి ఈ వుత్తరం వచ్చింది. అందుకే నేను రిపోర్ట్ ఇవ్వలేదు" అంటూ సత్యవతి ఒక ముప్ఫై ఐదు పైసల కవర్ అందించింది.

డిటెక్టివ్ శిరీష్ కవరు అందుకుని తెరచి చూశాడు. తెల్లటి కాగితం బయటపడింది.

"ప్రియమైన సత్యా!

నేను కులాసాగా వున్నాను. త్వరలో ఇంటికి వస్తాను. ఏకాంతం కోసం ఇలా ప్రవర్తించాను.

—సత్యనారాయణ."

చదవడం ముగించి శిరీష్ ఉత్తరాన్ని కుమార్ కి అందించాడు. శిరీష్ పై కవరును పరీక్షగా చూశాడు. పోస్టాఫీసులో అమ్మే యెర్రటి స్టాంపింగ్ వున్న కవర్ అది. డిఫేసింగ్ వాల్తేరు ఆర్.ఎస్.లో జరిగింది. ముందు రోజు ఉదయాన్నే పోస్టులో వేశారు. సాయంకాలం అందింది.

"లోకల్ డెలివరీ!" అన్నాడు డిటెక్టివ్ శిరీష్.

కుమార్ తలూపి, "ఏకాంతం ఎక్కడో రాసివుంటే బావుండేది!" అన్నాడు.

"రాసివుంటే కాదు — రాయించి వుంటే!" అని నాలుక కరుచుకున్నాడు శిరీష్. సత్యవతి వద్ద సెలవు పుచ్చుకుని ఇద్దరూ బయటికి నడిచారు.

# 8

కళ్ళు తెరచి చూశాను.

ఒళ్ళంతా నొప్పులుగా వుంది. ఈ గది తోడిదే జీవితమైపోయింది.

మూడు రోజులయింది కాబోలు. ఈ మూడు రోజుల్లోనూ ఏ ముప్ఫయిసార్లో టెలివిజన్ మీద డ్రాక్యులా సీరీస్ చూశాను. తల దిమ్మెక్కిపోయింది. ఆ టెలివిజన్ ఎలా ఆన్ చేయగలుగుతున్నారో, ఆఫ్ చేయగలుగుతున్నారో ఆపరేషన్ విచిత్రంగా వుంది. నాకు ఎటు చూచినా ఈ గదిలో డ్రాక్యులాతో భయంకర సంఘటనలూ, స్టీరియో శబ్దాల రొదా గుర్తు వస్తున్నాయి. ఈ భవనం ఎక్కడ వుందో చూచాయగా తెలుస్తోంది.

వాచీ చూసుకున్నాను. మధ్యాహ్నం రెండయింది.

వెంటిలేటర్ లోంచి చక్కటి వెలుగు గదిలో పరుచుకుంటోంది. చెవులు రిక్కించి వినసాగాను. ఎండవాలును

బట్టి నా గది గుమ్మం ఉత్తర దిశగా వున్నట్టు అర్థం చేసుకోగలిగాను. పావుగంట గడుస్తోంది. నా శ్రమ వృధా కాలేదు. ఆకాశంలో జుంమంటూ శబ్దం వచ్చింది. ఆ శబ్దం ఏమిటో నాకు తెలుసు. విశాఖపట్నం విమానాశ్రయానికి కలకత్తానుండి హైదరాబాద్ పోతూ మధ్య ఆగే విమానం శబ్దం అది! భవనం మీదనుండి బంయ్‌మంటూ దూసుకుపోతోంది. ప్రొపెల్లర్స్ హోరు పెడుతున్నాయి.

దగ్గరలోనే విమానాశ్రయం వుండబట్టి విమానం నేల మట్టానికి దిగువగా ఎగురుతోంది. మరి కొన్ని క్షణాల్లోనే అది చక్కర్లుకొట్టి నా గదిమీదుగా ఎగిరివెళ్ళింది. గాలిలో విమానం శబ్దాలు గిరికీలు కొడుతున్నాయి. ప్రొపెల్లర్స్ హోరులోంచి ఈల వినిపిస్తోంది. క్రమంగా ఈల శబ్దం సన్నబడి రెక్కలు తిరుగుతోన్న గాలికోత శబ్దం వినిపిస్తోంది. విమానం లాండ్ అయిందన్నమాట.

ఆ లెక్కన నేను విమానాశ్రయానికి దగ్గరగా వున్న భవనంలో వున్నానన్నమాట. విమానాశ్రయానికి ఉత్తర దిశగా ఈ గది వుంది! చేతులకు కట్టివున్న తాళ్ళతో కాళ్ళను కట్టడంవలన నాకు శరీరం కదపడానికి లేదు.

కాళ్ళను నేలకు తాటించి మెల్లగా కుర్చీని కదిపాను. అతికష్టంమీద కుర్చీని సెంటీమీటర్ చొప్పున కదుపుతూ బెడ్ వైపు కదిలాను. ఉదయం షేవ్ చేసుకోవడానికి పనిమనిషి బ్లేడు యిచ్చినపుడు దాన్ని తిరిగి రేజర్‌తో బాటు ఆమెకి వాపస్ చేయలేదు.

బెడ్ మీద తలగడ క్రింద బ్లేడును జాగ్రత్త పెట్టు కున్నాను. చేయి వున్నవైపు కుర్చీని మెల్లగా తలగడ ప్రాంతంవైపు నడిపాను. చేతివ్రేళ్ళతో అతికష్టంమీద

బ్లేడును అందుకున్నాను. వ్రేళ్ళ సహాయంతో కుడిచేతిలో బ్లేడును పొజిషన్‌లో పెట్టాను.

ఎడం చేతికి కట్టిన త్రాళ్ళను కోయసాగాను. మధ్య మధ్య బ్లేడు జారిపోతోంది. చేతులు చెమటలు పడుతున్నాయి. అయినప్పటికీ పండ్ల బిగువున బ్లేడును జరుపుతున్నాను. సాయంకాలం అయిదు గంటలవరకూ నా గదికి ఎవరూ రారు. ఈలోపులో నేను సాహసించాలి.

తాళ్ళు తెగాయి. ఎడంచెయ్యి స్వతంత్రమయింది. పావుగంటలో నేను కుర్చీలోంచి లేచి శ్రమ తీరేలా ఒళ్ళు విరుచుకున్నాను. కీళ్ళు కరకరలాడాయి. చకచక నా మంచం మీద బెడ్ ఎత్తి, కవర్ అందుకున్నాను. రాత్రి కొంత అన్నాన్ని మిగిల్చుకున్నాను.

ఎవరైతే నన్ను బంధించారో ఆ వ్యక్తి నాచేత రోజూ కొన్ని సీనులు రాయించి తీసుకెళ్తున్నాడు. అతడే ఈ కాగితాలు నాకు అందించేటప్పుడు ఒక కాగితాన్ని తీసి దాచాను. అన్నం మెతుకులతో దాన్ని కవర్ ఆకారంలో అతికించాను. అతికించకముందు ఆ కాగితం మీద కొన్ని వివరాలు రాయాలనుకున్నాను. కాని సాధ్యపడలేదు.

ఇప్పుడు అవకాశం దొరికింది. అదృష్టవశాత్తు పని మనిషి కలం తీసుకుపోయినా బతిమాలగా బతిమాలగా చిన్న పెనిసలు ముక్క అందించింది.

“ఈ పెనిసలు ముక్క దేనికి?” అడిగింది పనిమనిషి.

“కొత్త కథలు రాసుకోవాలంటే ఏవో ఆలోచించుకుని వాటిని కాగితం మీద నోట్ చేసుకుంటాను. లేకపోతే మరచిపోయే ప్రమాదం వుంటుంది కదా!” విషయాన్ని దాటవేశాను.

ఆమె నమ్మిందో లేదో కాని, జాలిగా చూచి నన్ను కుర్చీకి కట్టి వెళ్ళిపోయింది. ఆలోచనలను ఆపి నా చేతిలోని పెనిసలు ముక్కవైపు చూశాను. కవరు లోపలి గోడమీద పెనిసలుతో బరకసాగాను.

వెంటిలేటర్ మీద మైకు క్లిక్ మన్నది. తలెత్తి చూశాను. వెంటిలేటర్ వద్ద ఎలాంటి నీడా కనిపించలేదు.

"సత్యనారాయణా! నిద్రపోతున్నావా?" వినిపించింది మైకులోంచి.

"లేదు. కుర్చీలో కట్టివుంటే ఎలా నిద్రపోను?"

"డ్రాక్యులాను చూపించమంటావా?"

"చూపించు."

"ధైర్యం వచ్చిందన్నమాట!"

"పదే పదే చూడటం వలన భీభత్సం చప్పబడి పోయింది!"

"నీ 'నల్లకారు' నవలలోని చివరి ఛేజింగ్ సీనులగాయితూ 'శుభం' వరకూ స్క్రిప్టు రాయాలి!"

"ఇప్పుడు నాకు ఓపికలేదు!"

"ముద్దుగా చెబితే వినవల్లే వుంది. నా చేతివాటం రుచి చూస్తే జన్మలో మరచిపోవు!"

"రా! అదొక్కటే తక్కువ!"

"ఆల్ రైట్! నీ కోరిక ఎందుకు కాదనాలి! వస్తాను!"

"ఎక్కడికి?"

"నీ గదిలోకి!"

అతడు నా గదిలోకి వచ్చి రభసచేసేలా వున్నాడు. అతడు కోరినట్టు చిత్రానికి కథ రాస్తోన్నట్టు అగ్రిమెంటు రాశాను. అయిదువేల రూపాయిలూ అందుకున్నట్టు రశీదు

యిచ్చాను. నా "నల్లకారు" నవలికను నాటికీకరణ చేసి యిస్తోన్నాను. మానసిక హింసను తట్టుకోలేక అతడికి దాసోహమన్నాను.

రాత్రింబవళ్ళూ నిద్రపోకుండా హారర్ సినిమాలు చూచి నా మనసు తట్టుకోలేకపోయింది. మెదడులో భీభత్సం తప్పించి మరేమీ మిగిలేలాగా లేదు. అందుకే 'నల్లకారు' నవలకి సంబంధించి సర్వ హక్కులకూ కాగితం రాసిచ్చేశాను. ఇన్నింటికి తలవొగ్గి చివరకి క్లైమాక్స్ సీనులు రాయడానికి ఆటంకపెట్టే సాహసం ప్రదర్శించడం దేనికి?

"ఇదిగో మిస్టర్ శంకర్ రాజన్! నువ్వు నాతో సినిమాకి కథ రాయించుకుంటానని ఈ రకంగా నన్ను కిడ్నాప్ చేయడం నేరం! పోతే పోనియ్యి నవల! ఇప్పటికయినా నన్ను మర్యాదగా వొదిలిపెట్టు!" గంభీరంగా అరిచాను. ఒంటిన బంధనాలు లేకపోవడం నాకు తెగింపునిచ్చాయి.

"ఈ రోజు నీ గొంతు వింతగా వుంది! ఏమిటి కారణం?" మైకులోంచి వ్యంగ్యంగా వినిపించింది.

"నా కోసం పోలీసులు వెతుకుతూండవచ్చును."

"ఎందుకు వెతుకుతారు? నువు క్షేమంగా వున్నట్టు ఇంటికి ఉత్తరం రాశావ్ కదా!"

నిజమే! అన్ని ప్రక్కలా దిగ్బంధనం చేసుకున్న నాకు పోలీసులుగానీ, శిరీష్‌గానీ ఏం సహాయం చేయగలరు?

"చిత్రం క్లయిమాక్స్‌కి వచ్చేసిందా?"

"అవును. నగరం వెలుపలి సీన్స్ అయిపోయాయి. నగరంలో ఛేజింగ్ దృశ్యాలూ, ఓవర్ బ్రిడ్జి మీద పోరాటాలూ, చివరగా విలన్‌తో సంభాషణలూ, పోరాటమూ చిత్రీకరిస్తే చాలు-మిగిలింది ఇన్ డోర్‌లో."

"ఎలా తీశారు? మిగతా పిక్చరంతా నేను రాయలేదు కదా!"

"నేను రాసుకున్నానులే!" అతడు పకపక నవ్వాడు.

శంకర్ రాజన్ సామాన్యుడు కాడు. అన్నింట్లోనూ ప్రవేలుంది.

"చిత్ర నిర్మాణం పూర్తయాకనయినా నన్ను వదులుతావా?"

"ప్రశ్నలు వేయక! పనిమనిషి కాగితాలూ కలం తెచ్చి యిస్తుంది. నోర్మూసుకుని సీన్స్ రాయి!"

## 9

"ఇతడు నా బావమరిది పరాంకుశం!" అన్నాడు శంకర్ రాజన్.

పరాంకుశంతో కరచాలనం చేశాడు డిటెక్టివ్ శిరీష్.

"మీ బావగారి పిక్చర్లకి మీరే ప్రొడక్షన్ మేనేజరా?" అడిగాడు శిరీష్.

"లేదండి! ఈ పిక్చర్ కే పని చేస్తోన్నాను" అన్నాడు పరాంకుశం.

"మద్రాసులో మీరు ఏం చేస్తోంటారు?"

"పరాంకుశం పబ్లికేషన్స్ అని డిటెక్టివ్ నవలలూ, పిల్లల జానపద నవలలూ ప్రచురిస్తాను. పేరు మీరు వినే వుంటారు."

శిరీష్ తలూపాడు. అపరాధ పరిశోధన సాహిత్యం పేరుతో సెక్స్ సీనులు చూపించి సొమ్ము చేసుకుంటాడు! పాఠకులలో అతడి నవలలకు మోజు వుంది, అసహ్యమూ వుంది అంటూండేవాడు సత్యనారాయణ.

"అవును. విన్నాను."

పరాంకుశం సిగరెట్టు పెట్టె తీశాడు. మూత తెరచి

సిగరెట్లు ఆఫర్ చేశాడు. శిరీష్ అందుకోలేదు. పరాంకుశం అతడిని వింతగా చూశాడు.

"వీరు కాల్చరులే!" శంకరరాజన్ చెయ్యి చాపి తను ఓ సిగరెట్ అందుకుని ముట్టించుకున్నాడు. పరాంకుశం ఒక సిగరెట్టు తీసుకున్నాడు.

బల్లమీద టెలిఫోన్ మ్రోగింది. పరాంకుశం రిసీవర్ అందుకున్నాడు. అవతల ప్రక్క ఆడగొంతు వినిపించింది.

"హలో పరాంకుశం హియర్!" అన్నాడు పరాంకుశం.

అవతలనుండి ఏదో వినిపిస్తోంది.

"సారీ....రాంగ్ నెంబర్!" పరాంకుశం ఫోన్ పెట్టేశాడు.

డిటెక్టివ్ శిరీష్ చురుకుగా చూశాడు. వాచీ చూసుకున్నాడు. ఇద్దరి దగ్గరా సెలవు పుచ్చుకుని క్రిందకు వెళ్ళాడు. మేనకా హోటల్‌కి సంబంధించిన టెలిఫోన్ ఎక్స్‌చేంజ్ వుందక్కడ.

"ఏం కావాలండి?" అడిగింది టెలిఫోన్ ఆపరేటర్ హెడ్ ఫోన్ తీసిపట్టుకుని.

"ఇప్పుడు అయిదు నిమిషాల క్రితం రూం నెం. 17కి వచ్చిన ఫోన్ యెక్కడినుండో చెబుతారా?"

"యెవరో రైల్వేస్టేషన్‌నుండి చేశారు.... పేరు.... వనజ!"

డిటెక్టివ్ శిరీష్ తన ఉలికిపాటును కప్పిపుచ్చుకున్నాడు. శంకర్రాజన్ తాగే ఖరీదయిన సిగరెట్లు పరాంకుశం కూడా తాగుతాడు.

పరాంకుశం ప్రొడక్షన్ మేనేజర్ కై వుండికూడా షూటింగ్‌లకు కావలసిన సరంజామాను సర్దుబాటు

చేయలేకపోతున్నాడు. షూటింగు వదిలిపెట్టి అతడు యెటో వెళ్ళిపోతున్నందుకు శంకర్ రాజన్ అతడిమీద విరుచుకుపడినట్లు లైట్ బాయ్స్ చెప్పుకోవడం తాను విన్నాడు.

పరాంకుశం యెక్కడికి వెడుతున్నాడు? వనజకీ అతడికీ సంబంధం ఏమిటి?

"వనజ కేవలం పరాంకుశంగారి పేరు చెప్పి కనెక్షన్ అడిగింది కదూ!" అడిగాడు శిరీష్.

ఆపరేటర్ తలూపింది. ఆమెకు కృతజ్ఞతలు చెప్పుకుని బయటపడ్డాడు శిరీష్. తాను అక్కడున్నట్టు గుర్తించి పరాంకుశం తనకి వచ్చిన ఫోన్ కాల్ ని రాంగ్ నెంబర్ అంటూ రిసీవర్ ని క్రెడిల్ చేశాడు. వనజ, పరాంకుశం కలిసి సత్యనారాయణను యెత్తుకువెళ్ళి పోవడంలో అంతరార్థం ఏమిటి?

డిటెక్టివ్ కళ్ళు మెరిశాయి. వెనక్కి త్రిప్పి కారును పోలిస్ స్టేషన్ వైపు పోనిచ్చాడు.

కుమార్ తో, "పరాంకుశం పబ్లికేషన్స్ భవనంవైపు అక్కడి క్రైంబ్రాంచి ఏజంటును పంపించు. వివరాలు తెలియవచ్చును" అని చెప్పి శిరీష్ తిరిగి బయలుదేరాడు.

## 10

శిరీష్ ఓపికగా కాచుకూర్చున్నాడు.

కారుకి వున్న విండ్ స్క్రీన్స్ పూర్తిగా దించి సీట్లో వెనక్కి వాలి మేనకా హోటలువైపు చూడసాగాడు.

ఎవరో కుర్రవాడు హోటలు ఆవరణలోకి పరుగెత్తుతున్నాడు. అతడిని రాచుకుంటూ ఎవరో స్త్రీ బయటికి వస్తోంది. శిరీష్ వెనక్కి తిరిగాడు. తెరల వెనక సత్యవతి కూర్చుండి వుంది.

"ఆమె వనజ!" అంది సత్యవతి.

వనజ కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చి సిటీ బస్సు గ్రూపులో నిలబడి వుంది.

"ఆమె పరాంకుశం గదికి వచ్చింది. అతడు లేకపోవ వంతో తిరిగి వెనక్కి వచ్చింది" అన్నాడు డిటెక్టివ్ శిరీష్.

"మీ వూహ నిజమయింది. తన ఫోన్ని రాంగ్ నెంబర్ అని క్రెడిల్ చేయడాన్నిబట్టి ఆమె పరాంకుశం గదికి వచ్చింది!"

శిరీష్ మాట ముగించకముందే పోస్ట్‌మాన్ హోటల్ మేనకా ఆవరణలోకి ప్రవేశించాడు.

వనజ నిలబడినచోట కారు ఆగింది. శిరీష్ పరిశీలనగా కారులోకి చూశాడు. పరాంకుశం ఒక్కడే వున్నాడు కారులో. డ్రయివింగ్ సీట్లో కూర్చున్నాడు. కారు కదిలింది.

కారును మెల్లగా వెనకనే పోనిచ్చాడు శిరీష్. యాభై అరవై గజాల దూరంలో పరాంకుశం కారు పరుగెత్తుతోంది.

కారు న్యూ కాలనీ దాటి మర్రిపాలెం పోయేరోడ్డు పట్టింది.

ముందు కారులోని వాళ్ళకి అనుమానం రాకుండా వెంబడించసాగాడు శిరీష్. ముందుపోయే కారుకీ తన కారుకీ మధ్య కొన్ని వాహనాలుండేలాగా జాగ్రత్త పడుతున్నాడు శిరీష్.

పరాంకుశం కారు కరాస పోయే రోడ్డులోకి మళ్ళింది. విమానం వస్తోన్న చప్పుడు వినిపించి శిరీష్ తన వాచీ చూసుకున్నాడు. మధ్యాహ్నం రెండూ పది అయింది.

ముందుపోయే కారు కరాస దాటి విమానాశ్రయానికి యివతలగా వున్న సిమెంట్ రోడ్డులోకి మళ్ళింది. విశాల మైన భవంతిముందు ఆగింది.

శిరీష్ తన కారును అవతల రోడ్లోనే ఆపాడు. సత్యవతిని కార్లోనే కూర్చోమని చెప్పి చకచక నడుచు కుంటూ రోడ్డుప్రక్క నున్న గోతులు దాటి పొలానికి అడ్డం పడ్డాడు.

ఆ భవంతి వెనుకప్రక్కకి వచ్చాడు. తలెత్తి భవనం వైపు చూశాడు.

భవనం పైభాగంలో ఎంటెన్నా తగిలించి వుంది. పొడవుపాటి రాటకి చివర ఫోర్క్. పళ్ళులాగా పెద్ద గడులు ఏర్పడే కడ్డీల వరసగా నాలుగైదు తీగలు తగి లించివున్నాయి. రెండంతస్తుల భవనం అది.

'టెలివిజన్ వుంది!' గొణుక్కున్నాడు శిరీష్. భవంతి క్రింది అంతస్తువద్దకు నడిచాడు. నేలమీద కవర్ కని పించింది. చటుక్కున అందుకున్నాడు శిరీష్. పెన్సిలుతో తన అడ్రసు రాసివుంది. శిరీష్ నుదురు చిట్లించాడు. ఆ చేతిరాత తనకి చిరపరిచయం! సత్యనారాయణ చేతిరాత అది!

తల పైకెత్తి చూశాడు శిరీష్. ఈ కవర్ ఈ నేల మీద పడి ఎంతోసేపయి వుండదు. మట్టికూడా పెద్దగా అంటుకోలేదు.

కవర్ అంచులవైపు చూశాడు. అంచులవద్ద నలిగి వుంది. అంచు ఒత్తిడికి గురయినట్టుగా ఒంగి నలిగివుంది. అంటే ఈ ఉత్తరం పైగదిలోంచో అంతస్తులోంచో పడి వుంటుంది.

శిరీష్ పదడుగులు వెనక్కి నడిచి పైకి చూశాడు. అంత

పల కిటికీ గది తలుపులు తెరిచివున్నాయి. పైగది
క్కే తలుపులు మూసివుంది.

కవర్ పడిన వైపుగా ఆ గదికొక్క కిటికీ వుంది.
కవర్ ఆ కిటికీలోంచే పడివుండాలి. శిరీష్ చటుక్కున
కవర్ తెరచి చూశాడు. చిన్నవుత్తరం వుంది. సత్య
నారాయణ రాసిన ఉత్తరం అది!

"విమానాశ్రయానికి దగ్గరలోనే వున్న ఇంట్లో
నన్ను బంధించారు. ఈ భవంతిలో టెలివిజన్
వుంది. ఎంటెన్నాను బట్టి ఈ భవంతిని సులువుగా
పట్టుకోగలరు.

—సత్యనారాయణ."

శిరీష్ పరుగుపరుగున పిట్టగోడ వద్దకు వచ్చాడు.

శిరీష్ పిట్టగోడమీద చేయివేసి లోపలకు గెంతాడు.
పైకి మెట్లు కనిపించాయి.

శిరీష్ సంకోచించకుండా మెట్లు ఎక్కి పైకివెళ్ళాడు.
రెండు అంతస్తులకీ అవే మెట్లు! పై అంతస్తులో అడుగు
పెట్టి కారిడార్‌లో అడుగుపెట్టాడు. పైగదికి వెళ్ళడానికి
చిన్న మెట్లు కనిపించాయి.

శిరీష్ మెట్లు ఎక్కేలోపుగా అతడిమీదకు ఎవరో
దూకారు. శిరీష్ చటుక్కున వొంగి ప్రక్కకి గెంతాడు.

పరాంకుశం చేతిలో కత్తి తళతళలాడింది. చటుక్కున
శిరీష్‌వైపు తిరిగి గెంతి పొడవబోయాడు.

శిరీష్ అతడిని ఒక్కతోపు త్రోసి పైకి పరుగెత్తాడు.
తలుపు బయట వున్న పనిమనిషిని ప్రక్కకినెట్టి గడియ
తీశాడు. తలుపులు తెరుచుకున్నాడు.

అలజడికి నేను తలెత్తి చూశాను. శిరీష్‌ని కత్తితో
పొడుస్తున్నాడు పరాంకుశం. కత్తి శిరీష్ ఒంట్లో దిగక

ముందే అతడు తూలి క్రింద పడిపోయాడు. కెవ్వున అరిచాడు. అతడి చేతిలోని కత్తి అతడి పొట్టలో గుచ్చుకున్నది.

అప్పుడు కనిపించింది వనజ. నేను కదలడానికిలేదు. శరీఫ్ చకచక నన్ను సమీపించి కట్లు విప్పాడు.

వనజ పైమెట్టుమీదకు వచ్చింది. నేలమీద పడున్న పరాంకుశాన్ని చూచి 'కెవ్వు'న అరచుకుంటూ మెట్లమీదగా పరుగెత్తింది. కాళ్ళకు చీర అడ్డం పడినట్లయింది. తుళ్ళి క్రిందకు దొర్లిపోయింది.

నేను బయటకు వచ్చాను. సత్య నన్ను చూచి ఏడుస్తోంది.

శరీఫ్ ఆమెను సముదాయించాడు.

సత్య శరీఫ్‌వైపు కృతజ్ఞతాపూర్వకంగా చూచింది. అంతలో ఇన్‌స్పెక్టర్ కుమార్ తన బలగంతో అక్కడికి వచ్చాడు. అతని చేతిలో ఓ టెలిగ్రాం వుంది.

శరీఫ్ సాలోచనగా టెలిగ్రాం చదివాడు.

"పరాంకుశం పల్లి కేవన్స్‌లో భవంతిలో నలుగురు రచయితలు బంధించబడి వున్నారట. వాళ్ళను విడిపించి పరాంకుశం మీద కేసు ఫైలు చేస్తున్నారట మద్రాసు క్రైం బ్రాంచి వుద్యోగులు...."

"అంటే అయిదోవాడిని నేనన్నమాట! పల్లి కేవన్స్‌లో వెలువడే పుస్తకాలలోనే రాయడానికి బందీని కాబోయేనన్న మాట!" అన్నాను. అందరమూ నిట్టూర్చాం.

—: ఐ పో యిం ది :—

# (చివరి భాగం)

కాని ఈ ప్రేలుడు చుట్టుప్రక్కల ప్రాంతాలకి ఎంత ప్రమాదం!

అణుబాంబు కర్మాగారంలో ప్రేలుడు ఏర్పడితే ఏమౌతుంది?

అంత శక్తివంతమైనది కాకపోయినా, ఆ గాస్ మిశ్రమం చాలా ప్రమాదకరమైనది!

ముఖ్యంగా ఆ ప్రేలుడు శక్తి!?

కాని—ప్రొఫెసర్ చెప్పింది నిజమే.

అంతటి రిస్కు తీసుకోక తప్పదు.

కాళ్ళు కూడగట్టుకొని పైకి లేచాడు రాణా.

చెక్కుచెదరకుండా కొండలో వున్న రెండవ టన్నెల్ గుండా తను వారిని వెంటనే చేరుకోవాలి!

అవతలివైపు వున్న—వారిద్దరికీ తను సహాయపడాలి.

రేడియో బెల్టు భుజానికి తగిలించుకొని, అప్పటిదాకా ఈ విషయాలేమీ తెలియని సార్జంట్‌ని పిలవబోయాడు రాణా. కాని....

సరిగ్గా అదే క్షణంలో గుర్తించాడు రాణా, తనకు తిరిగి సమస్య ఎదురైనాయని.

నోటితో యింకా శబ్దం చేయకమునుపే, తను అక్కడ ఒంటరిగాదేనన్న నిజాన్ని గ్రహించాడు రాణా.

ఓ గుంపు....

టన్నెల్ ప్రేలుడు శబ్దాన్ని ఆకర్షితులై సుమారు వందకు పైగా జన సందోహం!....రాణా వెనుక గుమిగూడి వుంది టన్నెల్‌కి నడిచే రోడ్డుని నింపేస్తూ—

ఆ జన సందోహం.... కేకలు పెట్టడంలేదు... అరవడం

...మౌనంగా చూస్తూ నిల్చున్నారు—అతను తమ
ంటి వ్యక్తి కాదని ఎలాగో గుర్తించి....

వారి పదునైన చూపులకి దూరంగా....రాణా....
ుంగా .... నెమ్మదిగా .... వెనక్కి అడుగు వేయ
ాగాడు. హఠాత్తుగా తను కదిల్తే, వారు తనమీద
డ్తారని రాణాకు తెల్సు.

కాని అప్పటికే గుంపులో చిన్న కదలిక ఏర్పడింది.
ిక్కరు మాత్రం ధరించిన ఓ పన్నెండేళ్ళ కుర్రాడు
తోసుకుంటూ ముందుకు వచ్చి భయంతో, వణుకుతున్న
కంఠంతో అన్నాడు.

“బాంబులు పేలిన శబ్దం వినబడింది....దయచేసి
యిక్కడేం జరిగిందో చెప్తారా?....”

రాణా విస్తుపోతూ తలవంచి అతనివైపు చూసాడు.

కుర్రాడు అమాయకంగా వున్నాడు.

అతనికింకా పిచ్చిపట్టనట్టు కనిపిస్తున్నాడు.

నగరంలోని గందరగోళం అర్థంగాక, బహుశా ఈ
గుంపుతో తిరుగుతూ వుండాలి.

రాణా కుర్రాడివైపు అడుగువేసి ముందుకు వంగాడు.

“చూడు బాబూ....”

అప్పటికే ఆలస్యమైంది.

అతని కంఠం వినగానే ఉప్పెనలా విరుచుకుపడింది—
ఉన్మాదుల గుంపు రాణాపై.

కుర్రాడు జనసందోహం కాళ్ళకింద మాయమయ్యాడు.

ఉన్మాదులు చేతులుచాచి, రాణామీదకు వస్తున్నారు.
రాణా గింజుకుంటూ....

కాళ్ళతో తన్నుతూ....

వాళ్ళ పట్టును విడిపించుకోవడానికి తీవ్రంగా

ప్రయత్నిస్తూ వెనక్కి కొట్టుకుపోతున్నాడు.

ఎదురుగా వున్న ఓ పిచ్చాడి కడుపులో బలంగా తన్నాడు మోకాల్తో రాణా.

తన జుట్టును అందుకోబోతున్న ఓ స్త్రీ చెంపను ఛెళ్లు మనిపించాడు.

తనకు ఊపిరితిరక్కుండా చేస్తున్న మరో పిచ్చివాడ్ని మోచేత్తో బలంగా వెనక్కి కుమ్మాడు....

కాని....ఉన్మాదుల సంఖ్య అపారం....

రాణా, వారితో పిడికి, తను నిస్సహాయంగా వెనక్కు కూలిపోతున్నట్లు గ్రహించాడు.

కొద్ది క్షణాల్లో తన ఊపిరి లాగేస్తారీ రాక్షసులు!....

సరిగ్గా అదే సమయంలో.

రైఫిల్ శబ్దం "కయ్యో....''న మ్రోగింది.

రాణా దగ్గరో ఉన్న ఓ ఆకారం కెవ్వున అరిచి, ముందుకు కూలిపోయింది.

"రాణా సాబ్! జల్దీ సే భాగో."

సుబేదార్ పొలికేక వినబడింది.

చెయ్యి నేలమీద మోపుతూ, రెండు కాళ్ళ మీదా పైకిలేచి తారాజువ్వలా పరిగెట్టాడు రాణా.

రోడ్డు వారగా వున్న రైలింగ్‌ని ఛెంగున దూకి అవతల ఆరడుగుల పల్లంలోకి దొర్లుకుంటూ పడ్డాడు.

కాని సుబేదార్ ఊపిరి పీల్చుకునే అవకాశం కూడా రాణాకి యివ్వలేదు.

"ఇటువేపు సార్!....జల్దీ!" అరిచాడు, రెండోసారి రైఫిల్ పేలుస్తూ....

స్ప్రింగులా పైకిలేచి, మర మనిషిలా వున్న సార్జంట్ ఆకారంవేపు పరిగెట్టాడు రాణా.

"థాంక్ గాడ్! దగ్గర రైఫిల్ ఉంచుకున్నావ్!" అన్నాడు ఒగురుస్తూ.

"ఇవాళ ఉదయం చూసిన సంఘటనల తర్వాత.... రాణాసాబ్!....ఎక్కడికి ఇది లేకుండా కదిలే ప్రయత్నం చేయలేను."

"థాం...." గుంపులోకి మళ్ళీ ఫైర్ చేసాడు శైలో.

"ఈ దుస్తులతో, సరిగ్గా గురిపెట్టడం కష్టంసార్! కాని ఆ పిచ్చివాళ్ళ గుంపును కాల్చడానికి 'గురి' ఎవడికి కావాలి?"

మళ్ళీ రైఫిల్ పైకెత్తాడు సుబేదార్.

మరోసారి "కయ్...." మంటూ ప్రతిధ్వనించింది ఆ ప్రాంతం.

"వేగంగా ఆ రెండో టన్నల్‌లోకి పరిగెత్తండి! మీతో సమానంగా నేను రాలేను. కాబట్టి మీరు ముందు వెళ్ళండి. వెంటనే కెప్టెన్‌ని కల్సుకోండి. నేను వీళ్ళని కొంతసేపు ఆపి వెనకాల వస్తాను."

టన్నెల్‌కి అటువైపు జరిగిన గందరగోళం, యిప్పుడు సుబేదార్‌కి చెప్పడం అనవసరం.

అందుకే అన్నాడు రాణా, "నేనిక్కడ వుంటాను సైలో! ఐ విల్ హెల్ప్ యూ!...."

"ఇక్కడ కూర్చుని ఏం చేస్తారు? దగ్గరకు రాగానే ఉమ్మేస్తారా వాళ్ళమీద?" అసహనంగా అన్నాడు సుబేదార్.

"నా దగ్గర పిస్తోలుంది" పైకితీసి చూపించాడు రాణా.

"దాని ఉపయోగం అంతగాలేదు....మీకేమైనా ప్రమాదం జరిగితే?....నో!....యూ గో ఆన్ సర్! వాళ్ళని

నేనాపగలను. వాళ్ళవైపు చూడండి, గొర్రెలమందలా... అంతకు మించి దగ్గరకు రాలేరు...." తన మాటల్ని నిరూపించడంకోసం సుబేదార్ మళ్ళీ రైఫిల్ని—కాళ్ళమీదా చేతులమీదా ప్రాక్కుంటూ, వస్తున్న ఓ స్త్రీకి గురిపెట్టి ఫైర్ చేసాడు.

ఆమె పెట్టిన పొలికేక విని, హడలిపోయి గుంపు వెనక్కి తగ్గింది. "మీరిక నిర్భయంగా వెళ్ళండి".... అన్నాడు సుబేదార్.

మాస్క్ లోపల సైలో నవ్వుతున్నట్లనిపించింది రాణాకి.

కొంపదీసి సుబేదార్కి కూడా పిచ్చి ఆవహించలేదు గదా?....

ఒక్క ప్రశ్న మాత్రం వేయగలిగాడు రాణా.

"సక్షన్ యంత్రం సంగతేమిటి?"

చిరాగ్గా రాణావేపు చూసాడు సైలో. "అది క్షేమంగా అక్కడే వుంటుంది. దాన్ని ఎవరూ కదపలేరు, పాడుచేయలేరు. ఇప్పుడు 'ఆఖరిసారి' అడుగుతున్నాను. దయచేసి ఇక టన్నెల్లోకి వెళ్తారా....సర్?"

మెల్లగా ముందుకు వస్తున్న ఉన్మాదుల గుంపుని ఒక్క క్షణం చూసి రాణా వెనక్కి తిరిగి పరుగు ప్రారంభించాడు టన్నెల్ గుండా.

గుహలాంటి ఆ భూగర్భమార్గంలో రాణా అడుగులు ప్రతిధ్వనిస్తున్నాయి.

లోపలిభాగంలోని అంధకారంలోకి పరిగెడుతుండగా అతనికి రెండు రైఫిల్ షాట్స్ వినిపించాయి.

సుబేదార్ వెనక్కి తిరిగి, టన్నెల్లోకి వచ్చేస్తే బాగుండునని అనుకున్నాడు రాణా.

కనీసం పిచ్చివాళ్ళు చీకట్లో అతన్ని అనుసరించలేక పోవచ్చు.

కాని టన్నెల్ బయట అలా జరగలేదు!

సైలో నిర్దాక్షిణ్యంగా కాల్పులు సాగిస్తున్నాడు గుంపుమీద.

కాని పిచ్చివాళ్ళకి ఒక విధమైన కపటబుద్ధి వుంటుంది.

ఓ ఉన్మాది చేతిలోని సిమ్మెంటుదిమ్మతో పిల్లిలా సైలో వెనక్కి చేరి, తలమీద బలంగా మోదాడు!

సైలో శిరస్త్రాణం ఏ మాత్రమూ కాపాడలేకపోయింది. మెదడు పగిలి నిర్జీవంగా పడిపోయాడు సార్జంట్!

పిచ్చివాళ్ళగుంపు, ఆనందం పట్టలేక, కేకలు వేసుటింటూ అతని మృతదేహాన్ని నాలుగువైపులా పట్టుకుని పైకెత్తి—టన్నెల్ గుండా మోసుకుపోసాగింది....

పల్లకిని మోసినట్లుగా....

తన వెనకనుంచి వస్తున్న అలజడిని పసిగట్టాడు రాణా.

రైఫిల్ శబ్దం కోసం ఎదురుచూసాడతను. కాని కాల్పులు వినిపించకపోవడంతో రాణాకి పరిస్థితి పూర్తిగా అర్థమైంది.

సుబేదార్ సైలో యిక లేడు.

ఒక్కక్షణం అతని మెదడు శూన్యమైంది. కళ్లలోంచి రెండు కన్నీటిబొట్లు రాలాయి.

*　　*　　*

భూగర్భంలో సగం దార్లో వున్న దట్టమైన చీకట్లో తను ప్రవేశించినట్లు గుర్తించాడు రాణా.

అటూ యిటూ వున్న ముఖద్వారాలు కనబడ్డంలేదు, దారిలో చాల మలుపులు వుండడంవల్ల.

చేతిలో టార్చివుంటే ఎంత బావుణ్ను.

ఉదయం మొదటి టన్నెల్ లోకి వెళ్ళినప్పుడు అది తనతో వుంది.

ప్రస్తుతం తనకున్నవి-అటూ ఇటూ వున్న రాతిగోడ, కాంక్రీట్ రోడ్డు మాత్రమే!

తన అడుగులకు ప్రతిధ్వని కల్పిస్తూ తనింకా బ్రతికి వున్నానని తెలియజేస్తున్నాయవి.

దారిలో దేనికీ గుద్దుకోకూడదని భగవంతుణ్ని ప్రార్థిస్తూ చీకట్లో నిర్లక్ష్యంగా పరుగు వేగం హెచ్చించాడు రాణా.

అశ్వత్థామ—టన్నెల్ ఖాళీగా, ఏ అడ్డంకు లేకుండా ఉందని యింతకుముందు చెప్పాడు.

కాని అప్పుడు వాళ్ళు ప్రయాణించింది హాయిగా వాన్ లో.

పిచ్చివాళ్ళ కోతి అరుపులు దగ్గరౌతున్నాయ్!

పెద్ద పెద్ద అంగలు వేస్తూ పరిగెడుతున్నాడు రాణా.

ముందున్న రోడ్డు ఎత్తుగా వెళ్తున్నట్లు గ్రహించాడు రాణా.

హామ్మయ్య!

ఇంకొక్క— మలుపు!

మలుపు తిరిగి - ఆ రోడ్డు చివరకు చేరుకుంటే - బైట పడినట్లే!

బరువుగా వూపిరి పీలుస్తున్నాడు రాణా!

తొడల్లో కండరాల్లో తీవ్రమైన నొప్పి....

ఎదురుగా కనబడుతున్న అర్ధకాంతిని చూస్తూ....

పూర్తి కాంతికోసం ఆరాటపడుతూ....

తన శక్తినంతా కూడగట్టుకుని పరిగెడుతున్నాడు

అతనిలో అలసట—మాయమవలేదు.

నిర్లక్ష్యం చేయబడిందంతే!

భరింపశక్యం కాని పిచ్చివాళ్ళ కేకల ప్రతిధ్వనుల్ని వినలేక, వినలేక వింటూ మరో అయిదు నిముషాల్లో టన్నెల్ బైటపడ్డాడు రాణా.

బయటి గాలి, వెలురు కొంత బలాన్నిచ్చాయి రాణాకి.

అతని భుజాన వ్రేలాడుతున్న రేడియో అకస్మాత్తుగా ప్రాణం పోసుకుంది....

చాలసార్లు-టన్నెల్‌లో-తన పరుగుకు అడ్డుతగలంతో దాన్ని విసిరికొట్టామన్నంత కోపం వచ్చింది అతనికి.

బలవంతాన ఆ కోరిక ఆపుకున్నాడు.

అయితే యిప్పుడు చాలా సంతోషించాడు రాణా అది యింకా తనవద్ద ఉన్నందుకు.

"కెన్ యూ హియర్ మీ.... కెన్ యూ హియర్ మీ...." ఓ కంఠం ఆతృతగా పలుకుతోంది.

ట్రాన్స్‌మిట్ బటన్ నొక్కాడు రాణా. "హల్లో దిసీజ్ రాణా! ఐ కెన్ హియర్ యూ....అశ్వథ్థామా? నగర్వాలా?"

"థాంక్ గాడ్!" అవతలి కంఠం నిట్టూర్పు విడిచింది "కాప్టెన్ నగర్వాలా హియిర్!"

టన్నెల్ గోడకు జార్లబడి కూర్చున్నాడు రాణా.

"బాంబులు అమర్చారా గాస్ ఫాక్టరీకి?" అడిగాడు ఆయాసంగా.

"యెస్. ఆ పని పూర్తిచేసాను. సాధ్యమైనంత యెక్కువ ఎక్స్‌ప్లోజివ్స్ అమర్చాను రెండు టాంకర్ల క్రిందా! అవి స్టీల్‌తో తయారుచేయబడ్డాయి. కాని

నేనుపయోగించిన 'గెలగ్నైట్'కి, ఆ రాక్షస ట్యాంకర్లు కోడిగుడ్లలా పగులాయి.

మేము టన్నెల్‌కి తిరిగి క్షేమంగా చేరుకోవడాన్కి వీలుగా బాంబుల మీద అయిదు నిమిషాల టైం సెట్ చేస్తున్నాను. ఆ సమయం చాలు బాంబుల తాకిడికి దూరంగా టన్నెల్‌లో చేరుకోడాన్కి. ఎంత రక్షణ దొరికితే అంత మంచిది!" రాణా టన్నెల్‌లోకి పిచ్చివాళ్ళ గురించి చెప్పే అవకాశం యివ్వకుండా కెప్టెన్ చెప్పు కుంటూ పోయాడు "అదిగో ప్రొఫెసర్ అశ్వత్థామ వస్తున్నాడు. నేను వైర్లు అమర్చుతుండగా ఆఖరిసారి మైక్రోప్లాస్మావైపు చూస్తూ నిలబడ్డాడు యిందాక. ఆయన యింకా షాక్‌నుంచి పూర్తిగా కోలుకోలేదని అనుకుంటున్నాను. ఒక్కోసారి బాగానే వుంటాడు. కాని అకస్మాత్తుగా.... మై గాడ్! ఆయన ముఖంమీద హెల్మెట్ లేదు!!!"

కాప్టెన్—గాభరాగా అశ్వత్థామని పిలవడం విన్పించింది రాణాకి .... వెంటనే రేడియో తిరిగి జీవం కోల్పోయింది.

దూరంగా వున్న బ్రహ్మాండమైన ఎత్తులో గాస్ ఫాక్టరీ సిలిండర్ల ఆకారాలు లీలగా కనబడుతున్నాయి రాణాకి పొగమంచులో.

"నగర్వాలా! .... నగర్వాలా!" అర్చాడు రాణా రిసీవర్‌లో. "ఏం జరుగుతుం దక్కడ? ఫర్ గాడ్ సేక్! ఆన్సర్ మీ!...."

రాణా ఆందోళనగా అలా అరుస్తూనే వున్నాడు—స్పీకర్ జవాబిస్తోందని గ్రహించేదాకా.

మళ్ళీ నగర్వాలా కంఠమే వినబడుతోంది,

కాని ఈసారి దూరంగా....

మిలటరీ దర్పం మాయమై....

బలహీనంగా....

భయాందోళనలతో ....

"ఆ....ఆయన నా చేతిలోని డిటొనేటర్ బాక్స్ లాక్కున్నాడు....విష మేఘం ఆయన్ని సోకింది....కాని ఆయన మాటలు చూస్తే వివేకంగా ఆలోచిస్తున్నట్లే వున్నాయి....అయిదు నిమిషాలు వృథా చేయకూడదని చెప్పాడు....ఈలోపుగా నూక్లియస్ పదార్థం తప్పించుకు పోతుందన్నాడు .... అవకాశం వుండగానే దాన్ని నాశనం చేయాలన్నాడు.... నేను ఒప్పుకోలేదు....కాని ఆ....ఆయన నన్ను వెనక్కి తోసి బాక్స్ లాక్కున్నాడు. ఆయనతో పెనుగులాడలేకపోయాను....ఎందుకంటే.... బాక్స్‌లో మెకానిజం జోల్టు అయ్యే ప్రమాదం వుంది!....

ఆయన....ఆయన....యిప్పుడు వెనక్కి నడుస్తున్నాడు పొగమంచులోంచి....నూక్లియస్ వైపు రాణా!... రాణా! మీ రెక్కడున్నా తప్పించుకోండి....ఫైండ్ ఎ షెల్టర్! వీలైతే టన్నెల్ లో దాక్కోండి!....ఆ ప్రేలుడు చాలా ప్రమాదకరం!!.... నేను బైటికి వస్తున్నాను... యిప్పుడు వాన్ ప్రక్కగా వున్నాను....నాకింకా ....తప్పించుకొనే అవకాశం వుండొచ్చు!...."

నిశ్చలత....

నిశ్శబ్దం....

రాణాకి బాగా తెల్సు, కాప్టెన్ని మళ్ళీ పిలవడం ఎంత అవివేకమో. రాణా దూరంగా వున్న విశాలమైన రిఫైనరీ కర్మాగారం వైపు చూసాడు.

కొద్దిక్షణాల్లో దానికేం గతి పట్టనున్నదో జ్ఞప్తికివచ్చి

తణికిపోయేడు....

తర్వాత దూరంగా ఏదో కదలిక గమనించాడు రాణా....

కదులుతున్న మేఘం అడ్డురావడం నిర్ధారణ చేసుకోలేక పోయాడు రాణా....

ఏమిటది??...

ఆఁ....

అది స్పెషల్ వాన్‌లా కనబడుతోంది....

నగర్వాలా కొద్దిలో తప్పించుకోవచ్చు!

కాని అదే 'క్షణం'లో రెండు సంఘటనలు జరిగాయ్!

టన్నెల్ ముఖద్వారంనుండి బిలబిలమంటూ బైటికివచ్చింది ఉన్మాదుల గుంపు.... చేతులమధ్య ఓ మృత కళేబరాన్ని మోసుకొస్తూ....

రాణా ఉలిక్కిపడి వారివైపు తల త్రిప్పగానే....

ఆకాశాన్ని చీల్చుకుంటూ ఎర్రటి మెరుపు!—

దాని వెనకగానే—చెవులు చిల్లులుపడే ప్రేలుడు!

తర్వాత—తారాజువ్వలా ఎగురుతూ పిడుగుల శబ్దంతో ప్రేలుతున్న గాన్....

భూమి దద్దరిల్లుతోంది....

భూగోళమంతా కంపిస్తున్నట్లుంది.

బంతిలా ముడుచుకుపోయాడు రాణా ఆకారాన్ని సాధ్యమైనంత చిన్నది చేసుకుంటూ.

వేడిగాలి తన వీపుని మండిస్తున్నట్లు గుర్తించాడు రాణా. వాతావరణంలో వేడికి అతని నుదుటిమీద జుట్టు పీకెక్కి ఊడిపడుతున్నాయి వెంట్రుకలు.

కొలిమిప్రక్కగా కూర్చున్నట్లుంది రాణాకి.

తను వింటున్న శబ్దానికి తనచెవుల్లోని కర్ణభేరి పొరలు

ప్రేలిపోవడం ఖాయం అనుకున్నాడు రాణా.

ఆ ప్రళయ ఝుంఝూట ధ్వనికి ముగింపు వుండదని వాపోతున్నాడతను.

కాళ్ళక్రింద సిమ్మెంట్ చప్టా పగుల్తోంది. ఆ శబ్దాలను తను వినలేకపోతున్నా (చెవులు అప్పటికే దిమ్మెక్కి- పోవడంచేత) తనమీదకు ఉండుండి దూసుకు వస్తున్న వేడికెరటాలుబట్టి గుర్తించాడు రాణా—పెద్ద టాంకుల ప్రక్కగా ఉన్న చిన్న చిన్న గాస్ టాంకులు ఒకదాని తర్వాత ఒకటి ప్రేలుతున్నాయని.

తల ఎత్తి ఆ దృశ్యాన్ని చూడ్డానికే హడలిపోతున్నాడు రాణా.

తను పైకి లేచి నిలబడితే—వేడికి కనుగుడ్లు పైకిపోతాయన్నంత భయపడ్తున్నాడు రాణా.

పల్లంలో, టన్నెల్ ముఖద్వారంలో ఉన్న ఎంతోమంది మనుషులకంటే రాణా చాలా అదృష్టవంతుడు!

రోడ్డు పొడువునా వున్న పిట్టగోడకీ, రాతిగోడకీ మధ్య ముడుచుకూర్చున్నాడు రాణా.

వేడితాకే అవకాశం వున్నా —ఏదైనా ఎగిరివచ్చి గాయపర్చే ప్రమాదం లేదు.

శరీరాన్ని మరిగించి, మాడ్చేసే ఆ వేడికి చాలామంది మరణించారు.

మరికొంతమంది రాకెట్లలా ఎగురుకుంటూ వస్తున్న ఉక్కుముక్కలకీ, శిలారాళ్ళకు బలైపోయి—ఖండ ఖండాలుగా భూగర్భ మార్గంలోకి విసిరివేయబడ్డారు.

మిగతావాళ్లు—ఏమైనా మిగిలితే—భూకంపనకు గురై టన్నెల్ ముఖద్వారం అంచుల్లో ఉన్న కొండరాళ్ళు వదులై, మీదపడగా బల్లుల్లా నేలను కర్చుకుపోయి

ప్రాణాలు విడిచారు.

చాల, చాల సమయం గడిచిన తర్వాత రాణా ధైర్యం కూడగట్టుకుని ముఖాన్ని కప్పుకున్న బొబ్బలెక్కిన చేతుల్ని తీసేసి తలెత్తి చూసాడు.

కుడిప్రక్కగా టన్నెల్‌లోకి వెళ్ళే రోడ్డుమీద పడివున్న యినుపముక్కల్నీ, శిలాఖండాల్నీ; గుట్టలగా పడివున్న మృతదేహాల్ని చూసాడు.

టన్నెల్ అంతర్భాగంలో యింకా ఎన్ని మృత దేహాలున్నాయో?...

లోపలికివెళ్ళి చూడాలన్న ఆసక్తి రాణాకి లేదు.

మెల్లగా, బాధగా, పైకి లేచినిలబడ్డాడు రాణా. మొత్తం ఆ ప్రాంతమంతా—బ్రహ్మాండమైన మండే బంతిలా వుంది!

అతనికి యిప్పుడు రెండు ఫర్లాంగుల దూరంలో వున్న గాస్ ఫాక్టరీ ఆకృతి కనబడ్డంలేదు!

భవనాల ఆకారాలు కనబడ్డంలేదు.

వాటిలో యింకా మిగిలి వున్నవి—మిగిలివుంటే—అవి కాస్తా ఎగిసిపడ్తున్న మంటల్లో కనబడ్డంలేదు.

దీపావళి రాత్రి చివరి ఘడియల్లో వినిపించే టపా కాయల టపటపలా యింకా అక్కడక్కడా చిన్నచిన్న ప్రేలుడ్లు వినబడుతున్నాయి.

తదేకంగా చూడ్డంవల్ల కళ్ళు వేడెక్కి వాచినట్లు తెల్సుకుని, బాధగా పిట్టగోడ మీదికి వంగాడు రాణా, కళ్ళు రుద్దుకుంటూ.

ఒక నిమిషం గడిచిన తర్వాత—

గోడెక్కి ఎత్తునుంచి మళ్ళీ చూడసాగాడు రాణా. సముద్రం ఒడ్డున బయల్దేరిన ఆ మంటలు తన ఎడంవైపుగా

దాదాపు పావుమైలు దాకా ఆక్రమించినట్లు గ్రహించాడు రాణా.

గాస్ రిఫైనరీకి దగ్గరలోనే వుండే చిన్న చిన్న ఫాక్టరీలు యిప్పుడు కనబడ్డంలేదు.

రోడ్డు వారగా వుండే భవనాలు పూర్తిగా కూలి పోయాయి.

ఆ సర్వనాశనం వర్ణించలేనిది!

బహుశా—ఆ గాస్ టాంకర్లలో ఇంధనం పూర్తిగా నిండుకొని ఉండివుండాలి.

వాటిల్లోని వాయువు అతి సూక్ష్మమైనది కావడంవల్ల మంటలు వ్యాపించి—గొలుసుకట్టులా ప్రక్కటాంకులకు పాకివుండాలి హోమానికి సమిధలుగా చేస్తూ.

ఓ వంద గజాల దూరంలో వంకరగా కూలిపోయి వున్న స్పెషల్ వాన్ని చూసాడు రాణా.

కుండపెంకులా పడివుందది. అప్పటికే అంతా కాలి పోయి....

రాణా క్రిందికి దిగి, అలసటగా గోడకు జార్లబడి కూర్చున్నాడు, మండుతున్న కళ్ళను మూసుకుంటూ.

విషమేఘాన్ని నాశనం చేయడానికి ఎంత ధర చెల్లించాల్సి వచ్చింది?

రాణాలో యిప్పుడు ఎంతమాత్రం ఆవేశం లేదు. ఈ సర్వనాశనానికి ఒక పొరపాటువల్ల కారణమైన వ్యక్తులమీద కూడా అతనికి కోపంలేదు.

దాన్ని సృష్టించిన మేధావిపై కోపంలేదు. అతనిలో ఆవేశకావేషాలు, కాలువలో మురికిలా కొట్టుకుపోయాయి. యిప్పుడు అతని గుండెలనిండా నిండుకొని వున్నది—జాలి!

మానవాళికి భయంకర శత్రువుగా మారిన ఆ విష మేఘం యిప్పుడు దారుణమైన వేడికి నాశనం కాబడిందని రాణాకు తెల్సు.

అంతటి మహాజ్వాలకి మాడి మసైపోని వస్తువు కాని, జీవికాని ఏముంటుంది?

మనిషి ఉత్పత్తిచేసిన ఒక వ్యాధి....విష మేఘం... ఈ విధంగా ప్రక్షాళన కాబడింది.

జీవకణాలతో కూడిన ఆ విషపదార్థం యికలేదు.

విష మేఘం గుండెకాయ, మహోగ్రజ్వాలలో ఎండు టాకులా కాలిపోయింది.

ప్రొఫెసర్ అశ్వత్థామ నిజంగా పిచ్చివాడయ్యాడా? కాకపోతే—అలా ప్రవర్తించాడా చివరిసారి. ఖచ్చితమైన మార్గంలో.

లేక....

తన మెదడు కణాల్లో వ్యాధి నాటుకుంటూందని గ్రహించి రెచ్చిపోయి ఈ విధంగా విష మేఘంమీద పగ తీర్చుకున్నాడా?

తనకు తాను ఎందుకు బలైపోయాడు ఈ ప్రయత్నంలో??

ఈ ప్రశ్నలకు జవాబు దొరికే మార్గం లేనేలేదు. ప్రస్తుతం ఆ ప్రశ్నలకు జవాబు తెల్సుకోవాలన్న ఆసక్తి కూడా రాణాకు లేదు.

అతను యిప్పుడు కాంక్షించేదంతా

విశ్రాంతి.

అతని ఉదాసీనతను భంగపరుస్తూ సముద్రంనుంచి వెలువడ్డ ఓ చల్లని గాలితరంగం రాణాని తాకింది.

పిట్టగోడ యెక్కి, వొళ్ళు విరుచుకున్నాడు రాణా

ఆవులిస్తూ.

మంట ఇంకా పెద్దదౌతోంది, తనుతోను కూడగట్టు కుంటూ కుక్క గొడుగు ఆకారంలో పైకిలేస్తూ.

తలపై నల్లగా పొగ.

యింకా మిగిలి వున్న పసుపురంగు విష మేఘాన్ని జ్వాలలు లోపలికి లాక్కోవడం గమనించాడు రాణా.

బలం పుంజుకునే విష మేఘం గుండెకాయ యిప్పుడు లేదు.

అలసటగా పిట్టగోడమీద కూర్చుండిపోయాడు రాణా కన్నార్పకుండా ఆకాశంలోకి చూస్తూ....

ఆకాశం తిరిగి నీలిరంగులోకి మారడానికి యెదురు చూస్తూ!

* * *

రాణా టన్నెల్‌గుండా అవతలకు చేరి విష మేఘం నమూనాతో నిండుకున్న సక్షన్ యంత్రాన్ని తిరిగి యివతలివైపుకు నడిపించుకొచ్చాడు.

నిర్మానుష్యంగా వున్న డాక్‌యార్డుని చేరుకుని— అక్కడ ఒంటరిగా వున్న ఓ లాంచిలో సక్షన్ యంత్రాన్ని లోడ్ చేసి, లాంచీని స్టార్టుచేశాడు.

కోస్తాప్రాంతం పొడవునా ప్రయాణిస్తూ, ఓ గంటలో భూగర్భ రహస్య స్థావరం దరిదాపుల్లో నావల్ భవనాల ఒడ్డున లాంచి ఆపుచేసాడు.

ట్రాలీయంత్రాన్ని దింపి, లాంచిని వదిలిపెట్టి ప్రభుత్వ రహస్య స్థావరంవైపు అడుగువేసాడు రాణా.

స్థావరంలోని ప్రభుత్వాధికార్లు అతని రాకను టెలివిజన్ స్కానర్ల ద్వారా పసిగట్టారు.

కాని సగం భాగంలో మాడిపోయిన జుట్టుతో, నల్లగా కమిలిపోయిన ముఖంతో, చిరిగిపోయి మట్టికొట్టుకు పోయిన దుస్తుల్లో వున్న రాణాని మొదట రాణాగా గుర్తించలేకపోయారు వాళ్ళు.

కాని రహస్య స్థావరం వెనకవైపు వున్న కార్ పార్కింగ్ లోని సీక్రెట్ డోర్ ని దబదబా బాదుతుండ డంతో గుర్తుపట్టారు అతనే రాణా అని.

వెంటనే విశాలమైన ఆటోమేటిక్ డోర్ తెరిచారు. ట్రాలీని అతనిని ప్రత్యేక రసాయనాలతో పరిశుభ్రం కావించారు.

మొత్తం కథనంతా ప్రభుత్వాధికారులకి పూసగుచ్చినట్లు వివరించి చెప్పాడు రాణా.

నగరంలో తమ ప్రయాణం.

డోగ్రా మరణం,

నల్లరాతి కొండలో వున్న ఓ టన్నెల్ ని సీల్ చేయడం.

గాస్ ఫాక్టరీని తగులబెట్టడం ద్వారా మైక్రోప్లాస్మాని సర్వనాశనం చేయడం.

మొదలైన సంఘటనలన్నీ....

వారి ప్రశ్నల వర్షాన్ని ఓర్పుగా ఎదుర్కొని జవా బిచ్చాడు రాణా.

చివరికి వారంతా రాణాని అభినందనలతో, పొగడ్త లతో ముంచెత్తారు.

సంతోషం పట్టలేక అతన్ని ఎత్తుకుని ముద్దాడారు.

ఆ అభినందనలు-కష్టపడి, ప్రాణాలకి తెగించి, ఆ వ్యాధి కారక విష మేఘాన్ని పూర్తిగా నాశనం చేసిన ప్రొఫెసర్ అశ్వద్ధామకు, కెప్టెన్ నగర్వాలాలకు మాత్రమే దక్కాలని చెమర్చిన కళ్ళతో, వినయపూర్వకంగా చెప్పాడు రాణా.

డాక్టర్ జులేఖా అతని గాయాన్ని పరీక్షించింది.

చెప్పుకోదగ్గ గాయాలేమీ అతని శరీరం మీద లేవు 'స్పెషల్ వాన్' యాక్సిడెంట్ అయినప్పుడు ముఖానికి ప్రక్కగా లోతుగా చీరుకుపోయి ఏర్పడ్డ గాయం తప్ప.

దాని గురించి శ్రద్ధ వహించవలసిందిగా కోరింది జులేఖా.

అతను పూర్తిగా అలసిపోయి, స్పృహకోల్పోయి పడిపోయే, పరిస్థితిలో వున్నాడనీ ఆందోళనపడ్తూ వెంటనే బెడ్ పై రెస్ట్ తీసుకోవల్సిందిగా కోరింది జులేఖా.

రాణా అందుకు ఒప్పుకోలేదు.

స్లీపింగ్ గాస్‌ని పట్టణమంతా వెదజల్లేలోపలే తాను లూసీని చేరుకోవాలని అభ్యర్థించాడు.

అలసట పోయి, తాత్కాలికంగా 'శక్తి' వచ్చేందుకు ఏదైనా డ్రగ్ యిమ్మని ప్రతిమాలాడు రాణా.

ఎట్టి పరిస్థితుల్లోను రాణా ఇక్కడ నిలవడనీ, రహస్య స్థావరం వదిలి తన ఇంటికి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడని గ్రహించి—జులేఖా అతనికి ఓ డ్రగ్ యింజక్ట్ చేసింది.

ఎవరో యిచ్చిన జర్కిన్ ధరించాడు రాణా. పట్ట

ణంలో మిగతా భాగాల్లో చిన్నవిమానాల ద్వారా ముందు నిద్రమందు జల్లి ఆఖరిగా రాణా నివసించే ప్రాంతంలో స్ప్రే చేయడాన్కి అధికార్లు ఒప్పు కున్నారు.

వారిచ్చిన మిలటరీ జీపుని అధిరోహించాడు రాణా.

కన్నీళ్ళతో నిలబడిపోయింది జూలేఖా, జీపుప్రక్కగా.

జూలేఖా యిచ్చిన యింజక్షన్ — అతని శరీరమంతా ప్రభావాన్ని చూపించసాగింది.

అలసట మాయమై—నరాల్లో ఓ విచిత్రమైన శక్తి పుంజుకుంటోంది.

* * *

జీపు ఆవరణలో ఆపి, తన ఫ్లాట్ కు వెళ్ళే మెట్లు ఎక్కుతుండగా వినబడింది రాణాకి హెలికాప్టర్ శబ్దం దూరంగా....

ఉన్మాదులుగా మారిన నగరప్రజల్ని నిద్రపుచ్చ డాన్కి మత్తుమందుచల్లే కార్యక్రమం ప్రారంభమైందన్న మాట!

మూడోఫ్లోర్ చేరుకుని, తన ఫ్లాట్ ముందాగాడు రాణా.

తలుపులు మూసివుండడం గమనించి, సంతృప్తిగా నిట్టూర్చాడు.

లూసీ పేరు పిలుస్తూ తలుపు తడుతున్న రాణా— పైఅంతస్తుకి వెళ్ళే మెట్లమీద కూర్చున్న నీడలాంటి ఆకారాన్ని గుర్తించలేకపోయాడు.

ఆ ఆకారం—అతని కోసం ఉదయాన్నించి, ఎదురు చూస్తోంది.

తలుపు వెనకనుంచి కంగారుగా వినబడింది ఓ కంఠం, "హూ ఈజ్ దేర్?....రాణా??...."

"ఎస్. డార్లింగ్!" అరిచాడు రాణా, పెదవుల మీదికి నవ్వు తెచ్చుకుంటూ, "ఏం ఫర్వాలేదు.... నేనే! తలుపు తియ్."

చర్చీలు, బల్లలు....జరుపుతున్న శబ్దం....
బోల్టు వెనక్కి జరిపిన చప్పుడు....
తలుపు ఓరగా తెర్చుకుంది.
తలుపు సందులోంచి లూసీ ముఖం కనబడింది.

"ఓహ్!....డార్లింగ్ .... నువ్వేనా!" అర్చిందామె, "పొద్దున్నుంచి ఎవరో లోపలికి రావడానికి"....

అప్పటికే అతని పెదవులు, ఆమె నోటిని ఆక్రమించాయ్.

ఆమెను బిగికౌగిట్లో బంధిస్తూ లోపలికి జరిగాడు రాణా.

లూసీ ఆనందంతో, అరుస్తోంది....
ఆమె కళ్ళలో ఆనందబాష్పాలు నిండుకున్నాయి....

ఆమెను చేతుల్లో పొదివి పట్టుకుని, వెనక్కి తోస్తూ లోపలికి ప్రవేశించి రాణా, కాలి మడమతో తలుపు దగ్గరగా తోసాడు.

లూసీ అకస్మాత్తుగా అతని కౌగిలి నుంచి విదిలించుకుంది.

ఆమె ముఖంలో నల్లని నీడలు....

"రాణా! ఏమయింది నీకు? ముఖం మీద గాయం ఏమిటి?"

రాణా నవ్వాడు. "అదో పెద్దకథ. ముందు నువ్వు, నేను ఘాటైన విస్కీ తాగబోతున్నాం. తర్వాత చెబు తాను బెడ్ మీద కథంతా. ఆ తర్వాత నువ్వు, నేను బ్రహ్మాండమైన నిద్రలోకి జారుకోబోతున్నాం."

లూసీ అతనివైపు చూస్తూ పలువరస మెరిసేలా నవ్వింది.

ఆమె ముఖకవళికలు ఆతృతను వ్యక్తం చేస్తున్నా, ఆనందాన్ని, ధైర్యాన్ని కొట్టొచ్చినట్టు చూపుతున్నాయి.

అకస్మాత్తుగా ఆమె ముఖరేఖలు భయాన్ని వ్యక్తం చేస్తూ బిగుసుకున్నాయ్.

రాణా భుజం పైనుంచి అవతలగా ఉన్న దృశ్యం చూసింది లూసీ.

తలుపులు పూర్తిగా మూసుకోనీకుండా ఏదో అడ్డు కుని వుంది.

ఆమె ముఖంలో ప్రస్ఫుటమైన ఆకస్మిక భయాం దోళనలకు ఆశ్చర్యపోతూ తల వెనక్కి తిప్పాడు రాణా. అంతే!

అతని ఊపిరి స్థంభించిపోయింది, ఒక్క క్షణం.

రైనా గుమ్మంలో అడ్డంగా నిలబడివున్నాడు, విచిత్ర మైన నవ్వుతో.

* * *

మఫ్టీదుస్తుల్లో వున్న ఇన్‌స్పెక్టర్ రైనావైపు తిరి గాడు రాణా.

అతని వెనుక లూసీ నిలబడింది—

"హల్లో రైనా!" పలకరించాడు రాణా.

జవాబు లేదు....

కదలిక లేదు....

లూసీ, అతని భుజం మీద చెయ్యి వేసి భయంగా గొణి గింది, "రాణా! అతనే అయ్యుండాలి. ప్రొద్దుట్నించీ లోపలికి రావడానికి ప్రయత్నించారెవరో. తలుపులు బాదారు. విరగొట్టడానికి కూడా ప్రయత్నించారు. ఎవరని పిల్చినప్పుడల్లా శబ్దం ఆగిపోయేది. జవాబు వచ్చేదికాదు. తిరిగి గంట తర్వాత మళ్ళీ తలుపులు బాదుతున్న శబ్దం ప్రారంభమయ్యేది. భయంవేసి బల్లలు, కుర్చీలు అడ్డం పెట్టాను. ఇతను అప్పట్నుంచీ బయటే కాచుకుని వుండి వుండాలి."

అతన్నుంచి జవాబు పొందడానికి మళ్ళీ ప్రయత్నిం చాడు రాణా. "వాట్ డు యు వాంట్ రైనా?"

ఈ సారి కూడా జవాబులేదు....

అదే నవ్వు....

అతని దుస్తులవైపు విచిత్రంగా చూసాడు రాణా.

బూడిదరంగు త్రీపీస్ సూటులో పరిశుభ్రంగా ఉన్నాడు రైనా. మెడకు ఎర్రచుక్కల బౌతిక్ టై.

నిగనిగ మెరిసే బూట్లు.

రైనా జేబులో చేయిపెట్టడం గమనించి-కంగారు పడ్డాడు రాణా.

అతని చేయి దేన్నో బయటికి తీసింది.

మొదట్లో అర్థంకాలేదు రాణాకి, ఆ వస్తువు ఏమిటో. కాని, రైనా మడతలు విప్పుతుండగా చూసి గ్రహించాడు.

సన్నని పొడుగాటి వైర్ అది....అటూ యిటూ చెక్క పిడులున్నాయి.

"లూసీ! బెడ్ రూంలోకెళ్ళి తలుపులు వేసుకో!" ఆజ్ఞాపించాడు రాణా, ఎదురుగా వున్న ఆకారం నుంచి దృష్టి మరల్చకుంటూ.

"నో రాణా! నిన్ను వదిలిపెట్టి వెళ్ళను!" అందామె భయంగా.

"డూ యాజ్ యు ఆర్ బ్లడీ టోల్డ్!" అసహనంగా అన్నాడు రాణా, పళ్ళు బిగిస్తూ.

లూసీ కదిలింది.

బెడ్ రూం తలుపులు 'క్లిక్'మంటూ మూసుకున్న చప్పుడు.

"వాట్ డు యు వాంట్ రైనా?" మళ్ళీ అడిగాడు రాణా. ఆశించకపోయినా ఈ సారి జవాబు వచ్చింది.

"నువ్వే!" గొణిగాడు రైనా, "యూ బాస్టర్డ్...." యిప్పుడు అతని చేతుల్లో రెండు హాండిల్స్ వున్నాయి—వైర్ సాచబడి—అతని ఛాతీలెవల్లో వుంది.

అతని చేతిలోని నాటు ఆయుధం ఎలా పనిచేస్తుందో రాణాకి తెలుసు.

ఉరితాడులా....

మనిషి మెడచుట్టూ దాన్ని చుట్టబెట్టి లాగితే— కంఠంలోని గాలిగొట్టం, జుగులర్ రక్తనాళం క్షణంలో తెగిపోయి కనురెప్ప మూసి తెరిచేలోగా మనిషి మరణిస్తాడు.

ఆ తీగ అంత పదునైనది.

రైనా ఒక్క అడుగు ముందుకేసాడు.

రాణా కాలం వృథా చేయలేదు.

జర్కిన్ లోపలి పిస్తోలు అందుకోడానికి టైం లేదు.

అప్పటికే దగ్గరయ్యాడు శత్రువు.

రాణా మొదటి ఎటాక్ చేసాడు.

వైర్ని తప్పించుకుంటూ మెరుపులా రైనామీదకి దూకాడు రాణా.

ఇద్దరూ పెనుగులాడుతూ, దొర్లుకుంటూ గుమ్మం అవతల వరండాలో కుప్పలా పడ్డారు.

రైనాలో ప్రవేశించిన విచిత్రమైన శక్తిని గమనించాడు రాణా.

తను ప్రస్తుతం వున్న పరిస్థితిలో ఎక్కువసేపు పోరాడ్డం కష్టమని తెలుసు రాణాకి.

మోకాళ్ళమీద దొర్లుకుంటూ ప్రక్కకి తూలాడు రాణా.

సరిగ్గా అప్పుడే ప్రత్యక్షమైంది లూసీ గుమ్మం దగ్గర చేతిని నోటికి అడ్డం పెట్టుకుని—భయంగా రైనా చేతిలోని ఆయుధంకేసి చూస్తూ.

తూలుకుంటూ, రైనా పైకిలేచి నిలబడ్డాడు, కాలయముడిలా చేతిలోని ఆయుధంతో.

లూసీ పొలికేకకు ఉలిక్కిపడి తల తిప్పి చూసాడు రైనా.

ఆ సమయం చాలు రాణాకి.

అతను వేగంగా ముందుకు కదుల్తూ తలతో, రైనా ప్రక్కటెముకల్ని ఢీకొన్నాడు, ఆబోతులా....

రైనా హాల్లో దొర్లుకుంటూ వెనక్కిపడ్డాడు.

వెనక్కిపడుతూ, సరిగ్గా బూటుకాలు సాచి, రాణా గడ్డంమీద ఫడాలున తన్నాడు.

రాణా వెనక్కి తూలి గోడకు గుద్దుకున్నాడు. తల దిమ్మెక్కింది. కళ్ళముందు నక్షత్రాలు మెరిసాయ్ రాణాకి.

రాణా గుడ్డిగా పైకిలేచాడు. గోడను ఆధారం చేసుకుంటూ ...

అప్పటికే అతని మెడచుట్టూ ఉచ్చులా చుట్టుకుంది

చల్లగా....సన్నని....పదునైన....తీగ.

రాణా అదిరిపోయాడు తనకి తెలియకుండా చేయి కంఠంవైపు పోనిస్తూ.

రైనా తీగ హాండిల్స్ అటూ ఇటూ లాగిపట్టుకుని, బిగిస్తున్నాడు.

రాణాకి శక్తి సన్నగిల్లుతోంది.

ఊపిరి స్తంభిస్తోంది.

మెడవెనుక చర్మం, తీగ ఒరిపిడికి బిగుసుకుపోయి తెగుతోంది.

కేవలం లెదర్ జాకెట్ అతన్ని రక్షిస్తోంది.

మరుక్షణంలో జర్కిన్ కాలర్ కూడా తెగిపోయి తన కంఠం చుట్టూ నాటుకుంటుంది ఆ తీగ!

మెల్లగా చేయి, జర్కిన్ లోపలికి పోనిచ్చాడు రాణా.

చటుక్కున బైటికి వచ్చింది చేయి-పిస్తోలుతో.

రైనా అతని చేతిలోని పిస్తోలుని గమనించలేదు.

మోకాళ్ళమీద వంగి నవ్వుతూ....రాణా పీకమీద దృష్టినంతా కేంద్రీకరించి వున్నాడు. కాలర్ కట్ అయిపోయింది.

సేఫ్టీ కాచ్ వెనక్కి లాగడం, పిస్తోలు ట్రిగ్గర్ మీద

రాణా చూపుడు వేలు బిగుసుకోవడం.... క్షణాల్లో జరిగి పోయాయి.

"ఢాం... "

రైనా ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

ఏం జరిగిందో తెల్సుకో నేలోగానే, అతని శరీరం, పట్టుతప్పి క్రిందికి కూలిపోయింది.

చలన రహితంగా వెనక్కి వొరిగిపోయింది రైనా మృతదేహం. గుండెల్లో రంధ్రం. వెచ్చని రక్తం ఉబుకు తోంది అందులోంచి.

*　　　*　　　*

రాణా, లూసీ ప్రక్కగా కూర్చున్నాడు, నిస్త్రాణగా, గోడకు జార్లబడ్డ లూసీని దగ్గరగా లాక్కుంటూ....

"ఇక మనకు గడ్డుకాలం పూర్తయింది డార్లింగ్" ప్రశాంతంగా పలికాడు రాణా, ఆమెను సున్నితంగా ఊపుతూ. "తట్టుకో లేని అనుభవాలతో మనం అలసి సొలసి బలహీనమయ్యాం. కాని త్వరలో ఈ పదతినుంచి కోలుకుంటాం. ఐ లవ్ యూ సోమచ్ లూ.... సీ...."

ఆమెను పైకి లేవనెత్తి, పొదవిపట్టుకుంటూ నడి పించాడు రాణా. ఆమె అతన్ని హత్తుకుపోయి మౌనంగా రోదిస్తోంది.

ఇద్దరూ బెడ్ రూంలోకి నడిచారు ఒకరొకరు ఆధారం చేసుకుంటూ.

రాణా బెడ్‌రూం తలుపు మూసాడు.

సరిగ్గా అప్పుడే పైకప్పు నుంచి, క్రిందుగా యెగురుతున్న ఎల్. ఎఫ్. విమానాల రొద వినబడసాగింది లీలగా.

—: సమాప్తం :—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ'

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషా

(ఈ శీర్షికలో ప్రచురితమయ్యే ప్రతిరచనకూ రూ. 5 పారితోషకం ఇవ్వబడును.)

## వెంటొచ్చిన వాసన?

భార్య: ఏవిటండీ మీ దగ్గర సారాయి వాసన వస్తున్నది! ఖర్మ! తాగొచ్చారా?

భర్త: అబ్బే! నే టా గ లే దే! 'దేవదాసు' సినిమా చూసొచ్చాలే–ఆడు తాగేడు గందా–ఆ వాసన నా ఎంటే వొచ్చింది–ఒట్టు!

—కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు–2

## పోజుల్రాయుడు

ఆదరా బాదరాగా బస్సెక్కిన ఆ అందమైన అమ్మాయిని చూడగానే పోజుల్రాయుడైన రవికి మనస్సంతా అదోలా ఐ రంగుల ప్రపంచంలో ప్రవేశించినట్టయింది. దానికి తోడు ఆమె సీటులేక నిలబడే వుండడంతో రవికి ఓ ఆలోచన వచ్చింది. ఆమెకు తను కూచున్న సింగిల్ సీట్ ఆఫర్ చేసి, ఆమె ఇచ్చిన "థాంక్స్"ను 'నో మెన్షన్'తో కలిపేసి ఆమె ప్రక్కనే నిలబడి పోజులు కొట్టసాగాడు.

ఇంతలో కండక్టర్ ప్రవేశించి "నిలబడ్డ వాళ్ళంతా దయచేసి దిగిపోండి—నో స్టాండింగ్ పాసింజర్స్ ప్లీజ్-
ఇ లిమిటెడ్ హాల్టు సర్వీసు" అన్నాడు.

అంతే! రవి బిక్కచచ్చి మరేం చేయలేక, ఏడ్వలేక నవ్వుతూ బస్సుదిగి పోయాడు.

—వేదాంతం జగన్నాథం, హన్మకొండ.

## చెల్లని దొంగ?

జడ్జి: నీ కొడుకుకి ఇప్పటికి ఆరుసార్లు జైలు శిక్ష విధించాను. అయినా మళ్ళీ దొంగతనం చేశాడు. తండ్రివి కాస్త మందలించి బుద్ధిచెప్పుకోరాదూ-

తండ్రి: వాడికి చాలాసార్లు బుద్ధిచెప్పాను. అయినా మళ్ళీ మళ్ళీ పోలీసులకు దొరికేస్తున్నాడు. క్షమించాలి! మావాడిలో కాస్త చురుకుతనం తక్కువ!

—చంద్రశేఖర్ దేశాయ్, ఆదోని.

## జైలు గోడలు?

దొంగ: (పోలీసుతో) సార్! ఈ జైలుగోడలు సిమెంటుతో కట్టారా? లేక సున్నం ఇటుకలతో కట్టారా?

పోలీస్: ఎందుకొచ్చింది నీకీ సందేహం?

దొంగ: అబ్బే, మరేంలేదు. ఈ గోడకు ఎవరయినా కన్నంవేస్తే పడుతుందో, లేదో తెలుసుకుందామని. అంతే!

—వి. సుమలత, పార్వతీపురం.

192

# దోపిడికి ఇన్సూరెన్స్!

"25 లక్షల్ని ఇన్సూర్ చేయించాలని వచ్చాన, అన్నాడు గజదొంగ గజానందు ఇన్సూరెన్సు ఏజంటు కలిసి.

ఏజంటు ఎగిరి గంతేసినంత పనిచేసి "తప్పకుండా కూర్చోండి. మీ ఆస్తి వివరాలు చెప్పండి" అన్నాడు.

"ప్రస్తుతం ఆస్తి నా చేతిలో లేదు. కోటీశ్వరుడ కనకారావు ఇంట్లోని ఐరన్ సేఫ్‌లో రొక్కం రూపంలో వుంది. వారం రోజుల్లో అది దోచెయ్యాలని నా ప్లాను ఈలోగా అది మరెవరయినా కాజెయ్యకుండా ఈ ఇన్సూ రెన్సు. ప్రీమియం ఎంతవుతుందో చెప్పండి!" అన్నాడు

నోరెళ్ళబెట్టాడు ఏజంటు.

—సుంచు కృష్ణస్వామి, కమల్‌నగర్

